అపరాధపరిశోధన అనుబంధం—171

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## తిరుగులేని మందు
రచన: వి. యస్. రావ్

## సుబ్బారావు చావు
రచన: వసుంధర

## రెడ్ బాక్స్
రచన: సుంకరి రాంప్రసాద్

## ఎడారి కోయిల
రచన: బొమ్మిడి అచ్చారావు

అపరాధ పరిశోధన సప్లిమెంట్—171
మార్చి, 198౪
వెల: రు. 7-50
ఏడాది చందా: ౪0 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఎ. వి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64848

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్, స్ట్రీట్ మద్రాసు-1.

# తిరుగులేని మందు

వి. యస్. రావ్

ఇద్దరూ హోటల్ లాంజ్ లోకి ప్రవేశించారు. రెండున్నర గంటలపాటు నిర్విరామంగా తెరమీద చూసిన పేడిమూతి హీరోయిన్ గురించి తన వ్యంగ్యమైన విమర్శని ఆపకుండా అతని ఎడమ చెవికి చెప్తూనే వుందామె.

"ఆ పేడి మొహాన్ని టాప్ హీరోయిన్‌గా జనం యెలా తట్టుకుంటున్నారో, పాపం!"

అతను ఆగి, తన వేళ్ళమధ్య ఇరుక్కున్న ఆమె సన్నటి వేళ్ళని సున్నితంగా నొక్కాడు. కొద్దిగా తల వాల్చి ఆమె మొహంలోకి నవ్వుతూ చూశాడు.

"నీలాంటి రియల్ బ్యూటీ ప్రేక్షకుల్లోనే వుండిపోయినంతకాలం అలాంటి పేడిమొహాలు టాప్ స్టార్స్‌గా వుంటూనే వుంటాయ్!"

ఆమె కళ్ళు మెరిశాయి. అతని మొహంలోకి నవ్వుతున్న ఆమె పళ్ళు మెరిశాయి. పక్కకి, మెట్లవైపు తిరిగి అతన్ని లాగుతూ కదిలిందామె. మెట్లవైపు తిరిగి...

అతను మళ్ళీ ఆగాడు. ఆమె వేళ్ళచుట్టూ అతని వేళ్ళు బిగుసుకున్నాయి. ఆమె ప్రశ్నార్థకంగా అతనివైపు చూసింది. అతను ఆమెవైపు చూడ్డం లేదు. అతని చూపులు మెట్లమీదే వున్నాయి. ఆమె తన చూపుల్తో అతని చూపుల్ని వెంబడించింది.

ట్రిమ్‌గా తయారైన ఒక యువకుడు ఠీవిగా మెట్లు దిగుతున్నాడు. ఖరీదైన వైట్ షర్ట్. ఖరీదైన గ్రేకలర్ పాంటు. నడుముని చుట్టిన సన్నటి బెల్టు. బ్లూ నెక్ టై. ఖరీదైన నల్లకళ్ళద్దాలు. ఎడం చేతిలో తళతళ మెరుస్తున్న లెదర్ బాగ్.

మెట్లమీంచీ అతను క్రిందికి దిగాడు. అద్దాల్లా మెరుస్తున్న అతని బూట్లు మొసాయిక్ మీద గంభీరంగా నిర్లక్ష్యంగా చప్పుడు చేస్తున్నాయి. సన్నటి మీసాల్ని ప్రేమగా వేలితో దువ్వుకుంటూ అతను రిసెప్షన్ ముందు ఆగాడు. లెదర్ బాగ్‌ని కౌంటర్ మీద పెట్టి, గది తాళంచెవిని కౌంటర్ మీదికి జారవిడిచాడు. జేబులోంచీ తీసిన రెడ్ విల్స్ పాకెట్‌లోంచీ సిగరెట్ తీసి వెలిగించాడు. పొగ ఊదుతూ రిసెప్షనిస్టువైపు చూశాడు.

"ఇవాళ కూడా ఆలస్యంగా వస్తాను. డిన్నర్ గదికి పంపే ఏర్పాటు చేయండి" అన్నాడతను.

"అలాగే సార్!" రిసెప్షనిస్టు వినయంగా అన్నాడు. "ఈ ట్రిప్‌లో ఆ 'స్టిమలిన్' టానిక్ ఇస్తామన్నారు."

"ఈ ట్రిప్‌లో టానిక్ పట్రాలేదు. ఆల్ రైట్, ఏదో షాపులోంచీ పట్టుకొస్తా. డిన్నర్ చల్లారిపోకుండా చూడండి!" అంటూ అతను లెదర్ బ్యాగ్‌ని నిర్లక్ష్యంగా లాక్కుని ఎంట్రెన్స్‌వైపు హుందాగా నడిచాడు.

ఆమె వేళ్ళు అతని వేళ్ళకి సిగ్నల్ ఇచ్చాయి. "ఎవ

రతను?"

అతను ఆమెవైపు చూడలేదు. "తెలీదు ..."

"కమాన్, లెట్స్‌గో!" అందామె అలసటగా.

ఈసారి అతని వేళ్ళు ఆమె వేళ్ళని నొక్కాయి. ఆ నొక్కుల్లో మునుపటి సున్నితత్వం లేదు.

"నువ్వు గదిలో విశ్రాంతి తీసుకో. కాసేపట్లో వస్తా...." అన్నాడతను ఎంట్రెన్స్‌వైపే చూస్తూ.

"ఎక్కడికెళ్తావ్?" ఆమె నిరుత్సాహంగా అడిగింది.

"తెలీదు?"

"ఎందుకు? అదీ తెలీదా?" ఆమె కంఠంలో ఆక్షేపణ స్పష్టంగా ధ్వనించింది.

అతను ఆమె వేళ్ళ అల్లికలోంచీ తన వేళ్ళని విడిపించుకున్నాడు. తలని ఆమెవేపు తిప్పాడు. అతని చెయ్యి ఆమె బాబ్డ్‌హెయిర్ కింద, భుజమ్మీద ఆని, నొక్కింది. "హనీ, అతిన్తో వెళ్ళి, ఎక్కడికి వెళ్లానో, ఎందుకు వెళ్లానో కనుక్కుని కాసేపట్లో నీ చెవిలో చెప్తాను. స్నానంచేసి మరో చీర కట్టుకో!" అన్నాడతను కదుల్తూ.

"ఎంత సేపట్లో వస్తావ్?" ఆమె చిరుకోపంతో అడిగింది.

అతను వెనక్కి తిరగలేదు. నడకలో వేగం తగ్గించలేదు.

"డార్లింగ్ ...."

"ఇప్పుడు టైం గుర్తుపెట్టుకో. నేను రాగానే టైం చూసుకో. వచ్చినప్పటి టైంలోంచీ వెళ్ళినప్పటి టైం తీసేయ్. ఎంత సేపట్లో వచ్చానో తెలిసిపోతుంది!" క్షణ

కాలం ఆగి, తల వెనక్కి తిప్పి కళ్ళతో నవ్వుతూ అన్నాడు శివరామ్....

## 2

కోటుజేబుల్లోకి రెండు చేతుల్నీ పోనిచ్చి శివరాం దూరందూరంగా అంగలు వేసుకుంటూ పేవ్‌మెంట్ మీద నడుస్తున్నాడు. అతని చూపులు లెదర్ బాగ్ పట్టుకుని నిర్లక్ష్యంగా నడుస్తున్న వ్యక్తిమీదే వున్నాయి. కాసేపట్లో చౌరస్తాకి దగ్గర్లో వున్న 'సిటీ డ్రగ్ సెంటర్' ముందు, ముందునడుస్తున్న వ్యక్తి ఆగాడు. సిగరెట్ పీకని కిందపడేసి, టైనాట్‌ని పట్టుకుని మెడని నీళ్ళలో తలముంచిన కాకిలా విదిలించుకున్నాడు. స్టయిల్‌గా నడుస్తూ మెట్లెక్కి మందుల దుకాణం కౌంటర్ ముందు ఆగాడు.

శివరామ్ అతని వెనకే నిలబడి రోడ్డువేపు తిరిగాడు. పాలోచనగా సిగరెట్ ముట్టిస్తూ కళ్ళనిముందూ చెవుల్ని వెనకా కేంద్రీకరించాడు.

"అయామ్ ఫ్రమ్ కుకుత్‌జోగి ఫార్మస్యూటికల్స్" యువకుడి కంఠం స్పష్టంగా, సగర్వంగా ధ్వనించింది.

శివరామ్ మెల్లిగా తలతిప్పి పాపతన్ని చూశాడు. పాపతని ముఖం ప్రశ్నార్థకంగా మారింది.

"కుకుత్‌జోగి నుండి వారం కిందటే రిప్రజెంటేటివ్ నిఖిల్ వచ్చి వెళ్ళాడే! మీరు కొత్తగా వచ్చారా? అతనేమయ్యాడు?"

శివరామ్ తలని రోడ్డువైపు తిప్పాడు.

యువకుడి నవ్వు అతని చెవిలో ప్రతిధ్వనించింది. "ఆఫ్‌కోర్స్ నిఖిల్ మావాడే. నేను ఏరియా ఇన్‌స్పెక్టర్ని. ఎక్స్‌పయిర్డ్ డ్రగ్స్ తీసుకుని కొత్త స్టాక

అందించడం నా డ్యూటీ!"

"ఐసీ....మామూలుగా రెప్సే ఆ పని చేస్తారుగా?" షాపతను అడిగాడు.

"అఫ్‌కోర్స్. ఊరూరా తిరుగుతూ ఆర్డర్స్ బుక్ చేస్తూ కంపెనీకి రాసి తెప్పించడానికి రెప్స్‌కి ఎక్కువ టైమ్ పడుతుంది. మీకు ఇబ్బంది కలగకుండా, క్విక్‌గా మా ప్రాడక్ట్స్ మూవ్ అవడానికి ఈ కొత్త పద్ధతి ప్రవేశపెట్టాం. ఎక్స్‌పైర్డు ప్రాడక్ట్స్ వున్నాయా?" యువకుడు అన్నాడు.

"లేకేం? ఇచ్చేయమంటారా?" షాపతను అడిగాడు.

"స్టాక్ వద్దు. లిస్ట్ మాత్రం ఇవ్వండి. రేపు ఉదయం ఆటోలో వేసి ఫ్రెష్ స్టాక్ పంపుతాను. మీ లిస్ట్ ప్రకారం చూసుకుని, పాతవి అతనికి అందచేయండి" యువకుడు అన్నాడు.

"వ్యాఘ్రేశ్వర్రావూ, శుక్రుత్ జోగి డ్రగ్స్. కాలం తీరిపోయినవన్నీ చూడు. ముఖ్యంగా 'శుక్రోలిన్' వయల్స్ చూడు. నలభైకి పైగా వుండిపోయాయి. త్వరగా అన్నీ లిస్టు రాయ్!" షాపతను లోపలికి అరిచాడు.

శివరామ్ మరో సిగరెట్ వెలిగించాడు.

"మీ పేరు చెప్పలేదు! కూర్చోండి!" షాపతను అంటున్నాడు. "ఒరేయ్ టీ పట్రా!"

"అయామ్ జోగీశ్వర్...." శుక్రుత్ జోగి ఏరియా ఇన్‌స్పెక్టర్ అన్నాడు.

"మిస్టర్ జోగీశ్వర్, మీ నిఖిల్ లాభంలేదు. శుక్రోలిన్ గురించి చెప్పాను. ఇదిగో అదిగో అంటూ నెట్టుకుపోతున్నాడు. మా డ్రగ్ సెంటర్ సిటీ మెటర్నిటీ హోమ్ దగ్గర్లో వుంది. రెండు మూడురోజులలో

సారి కుబోలిన్ ప్రిస్క్రిప్షన్స్ వస్తూంటాయి. పైగా మీ ప్రొడక్టు ధర కొంచెం ఎక్కువగా వుంచారు. సేమ్ ఇంజెక్షన్ 'రోలిన్' నాలుగురూపాయలఎనభైకే అమ్మగలుగుతున్నాం. మీది మాకే ఆరేటుకి ఇవ్వడంలేదు! రేటు తగ్గించడం మంచిదని నా సలహా!" పాపతను సలహా ఇచ్చాడు.

"యూ ఆర్ రైట్. కంట్రీవైడ్‌గా పరిస్థితి ఇలాగే వుంది. మార్చి తరవాత కుబోలిన్ నాలుగున్నరరూపాయలకే వస్తుంది. మీ రేటుకాదు; మినిమమ్ రిటెయిల్ ప్రైజ్!"

"అలాగా?"

"యస్స్! వుయ్ వాంట్ టు బీట్ రోలిన్!" జోగీశ్వర్ సగర్వంగా అన్నాడు.

మూడో సిగరెట్ వెలిగించి శివరామ్ పూర్తిగా పాపువైపు తిరిగాడు. జోగీశ్వర్ టీ తాగుతున్నాడు.

"ఇదిగో సార్, లిస్టు!" కర్కర్ వ్యాఘ్రేశ్వరరావు ఓ కాగితాన్ని కౌంటర్ మీద పెట్టాడు.

"మూళారా? కుబోలిన్ యాభైరెండున్నాయి. చాలా డబ్బు బ్లాక్ అయిపోయింది!" పాపతను నొచ్చుకుంటూ అన్నాడు.

"కంగారుపడకండి! రేపొద్దుట పదింటికి ఆటో వస్తుంది. కుబోలిన్—ఫిఫ్టీటూ వయల్స్ వుంటాయి. చెక్ చేసుకుని, డెలివరీ తీసుకోండి. కాలం తీరిపోయిన వాట్ని ఆటోవాడికి ఇవ్వండి. మాకు అందుతాయి" జోగీశ్వర్ నవ్వుతూ అన్నాడు. "అన్నట్టు ఆవే చాలా? మరో పాతిక పంపమంటారా?"

"చాల్లెండి. అవి అయ్యేలాగా మార్చి అయిపోతుందిగా? అన్నట్లు కుబోలిన్ ప్రిస్క్రైబ్ చేయడానికి డాక్టర్లు వెనకాడుతున్నారు. మీరు వాళ్ళని కొంచెం గమనించుకోవాలి!" షాపతను నవ్వుతూ అన్నాడు. "మా 'గమనింపు' చాలడంలేదు!"

"హుఁ! మనుషులు మారిపోయారు. మంచి మందు రాయడానికీ లంచం ఇవ్వాల్సిందే! ఆల్ రైట్. సరికొత్త కాంప్లిమెంట్స్‌తో త్వరలో డాక్టర్స్ దగ్గరకు కొంత మందిని ప్రత్యేకంగా 'డ్రైవ్' పంపుతాం!" అంటూ జోగీశ్వర్ లేచాడు.

• • •

"అయామ్, రత్నకుమార్. ఏరియా ఇన్‌స్పెక్టర్, దక్షిణ్ ఫార్మస్యూటికల్స్!" జోగీశ్వర్ సగర్వంగా ఏ టు జడ్ మెడికల్స్ ప్రొప్రయిటర్‌తో అన్నాడు. కౌంటర్ల ముందూ షాపులో జనం, గుమస్తాలూ కిటకిటలాడుతున్నారు.

"యస్?" షాపతను అద్దాల్లోంచి చూస్తున్నాడు.

"మా ప్రొడక్ట్స్‌లో ఎక్స్‌పైర్ ఏవైనా వుంటే తీసేసుకుని కొత్త స్టాకు సప్లై చేయడానికి వచ్చాను" రత్నకుమార్‌గా అవతారం ధరించిన జోగీశ్వర్ అన్నాడు.

"మీ రిప్రజెంటేటివ్ చూస్తాడుగా?" షాపతను అడిగాడు.

సిటీ డ్రగ్ సెంటర్ కాత్రీకి చెప్పిన సమాధానాన్నే జోగీశ్వర్ టేప్ రికార్డర్‌లా అప్పజెప్పాడు.

"మీవన్నీ చాలావరకు ఖరీదైన మందులే. ముఖ్యంగా ఇంజక్షన్స్ చాలా నిలిచిపోతున్నాయ్. అమ్మకం ధర

కొంచెం తగ్గించాలి!" పాపతను అన్నాడు.

'దక్షిణ్' ఇంజక్షన్స్ ఆపి ఎక్స్‌పైర్డు సరకుని లిస్టు తయారుచేయమన్నాడు జోగీశ్వర్. పాపతను యెవర్నో పురమాయించాడు.

"లిస్టు ప్రకారం రేపొద్దున బ్రేక్‌ఫాస్ట్ వస్తుంది. రిసీవ్ చేసుకుని పాతవి పంపేయండి!" జోగీశ్వర్ అన్నాడు.

"స్టాక్స్ ఎక్కడ పెట్టారు?" పాపతను కొత్త ప్రశ్న అడిగాడు.

"లాడ్జి గదిలో. స్టాక్‌ని వెంటేసుకు తిరగడం రిస్కు. అందుకే లిస్ట్స్ తీసుకున్నాక, వరసగా అందరికీ సప్లై చేసేస్తాం!" జోగీశ్వర్ వివరించాడు.

శివరాం కౌంటర్ దగ్గరగా జరిగాడు. అతని మొహం మీద చిరునవ్వు మెరుస్తోంది.

"ఏం కావాలి సార్?" పాపతను డాబుసరిగా వున్న శివరామ్‌ని ప్రశ్నించాడు.

"ఇంటిమేట్ ఆయింట్‌మెంట్."

పాపతని గుబురు కనుబొమలు కొక్కెల్లా పైకిసాగాయి. రిమ్‌లెస్ కళ్ళద్దాలు ముక్కు మధ్యకు జరిగాయి. "ఇంటిమేటా?" అర్థంకానట్టు ప్రశ్నించాడతను.

"యస్. ఆయింట్‌మెంట్" శివరామ్ సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు.

పాపతను పెదవి విరిచాడు. "ఇంటిమేట్ శానిటరీ నాప్‌కిన్స్ వున్నాయి. ఆయింట్‌మెంట్...ఏ కంపెనీదో తెలుసా?"

శివరాం సాలోచనగా చూశాడు. "దక్షిణ్ ఫార్మస్యూటికల్స్ అనుకుంటా........యస్ దక్షిణ్ వాళ్ళదే.

ఏ క్లాస్ అయింట్ మెంట్!"

శివరామ్ కళ్ళు పొగలొంచి చూసీ చూడనట్టు జోగీశ్వర్, రత్నకుమార్ని చూస్తున్నాయి. క్షణకాలం అతని మొహంలో కంగారు కనిపించి, మాయమైంది.

"దక్షిణా?" పాపశను ఆశ్చర్యంగా అన్నాడు. తటాలున అతని కళ్ళు జోగీశ్వర్ వైపు తిరిగాయి. "మిస్టర్ రత్నకుమార్, మీ ప్రొడక్ట్స్లో ఆ అయింట్ మెంట్ లేదనుకుంటున్నానే...."

"కరక్ట్! ఆ పేరుతో మేం ఏ అయింట్ మెంటూ రిలీజ్ చేయలేదు. అయినా చెప్పలేం లెండి. ఇమిటేషన్స్ వస్తున్నాయేమో...."

"అసలుదివుంటేగానీ నకిలీది రాదుగా?" పాపశను అన్నాడు.

"అఫ్ కోర్స్. మా 'దక్షిణ్'కి మందుల తయారీలో చాలా పెద్ద పేరుందిగా? దక్షిణ్ పేరుతో ఏ 'ఉత్తర్' కంపెనీయో ఏదో పిండిని అయింట్ మెంట్ గా మార్కెట్లో వదిలేయొచ్చుగా!" అన్నాడు జోగీశ్వర్ నవ్వుతూ.

"జరిగినా జరగొచ్చు!" అంటూ పాపశను శివరాం వైపు చూశాడు. "లేదు సార్! ఇంటిమేట్ అయింట్ మెంట్ దేనికి వాడతారో చెప్పండి. హై క్లాస్ సబ్ స్టిట్యూట్ ఇస్తాను!"

శివరామ్ చిన్నగా నవ్వాడు. "వేరుశనగలు కావాలంటే, ఉప్పుశనగలిస్తానంటారేం!"

పాపశను పళ్ళికిలించాడు. "ఇంతకీ దాన్ని దేనికి వాడతారు? తెలుసుకుంటే...."

"లేనిదాని ఉపయోగం తెలుసుకునీ లాభంలేదు!

వెల్....థాంక్స్ ఫర్ నథింగ్!" అంటూ శివరామ్ వెనక్కి తిరిగాడు.

• • •

"ఎక్స్క్యూజ్ మీ...." శివరాం కంఠం అక్కడ ఇద్దరిమధ్యా ఉల్లాసంగా సాగుతున్న సంభాషణకి ఫుల్ స్టాప్ పెట్టింది.

పాపతని బట్టతల గ్లోబులా శివరామ్ వైపు తిరిగింది. ఇప్పుడు, ఇక్కడ మళ్లా జోగీశ్వర్ అవతారంలో తయారైన రెండో వ్యక్తి తనకేమీ పట్టనట్టు గంటన్నరలోగా సెవెన్త్ అయిన మూడో టీ తాగడానికి ఉపక్రమించాడు.

"ఇంటిమేట్ అయింట్మెంట్ ఒకటివ్వండి."

జోగీశ్వర్ ఉలిక్కిపడ్డం, సర్దుకోడం శివరామ్ కళ్ళ నుంచీ తప్పించుకోలేదు.

ఫుల్ సూటులో ఎత్తుగా, ఠీవిగా నిలబడ్డ శివరామ్ని 'అష్టలక్ష్మి మెడికల్స్' బట్టతల ప్రొప్రయిటర్ కళ్ళు చిట్లిస్తూ చూశాడు. "లేదు; ఇంతకీ, ఆ పేరు ఇంతవరకూ వినలేదు!"

"ఇప్పుడు విన్నారుగా? తెప్పించి పెట్టండి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఇంతకీ అది ఉందంటారా? ఇంతకీ యే కంపెనీ ప్రొడక్టది. ఇంతకీ ........" పాపతను గొలుసు అల్లుకు పోతున్నాడు.

"భారతదేశానికి గర్వకారణంగా వున్న కుక్రుత్ జోగి ఫార్మాస్యూటికల్స్ ఉత్పత్తి అది. ఎక్స్పోర్టు క్వాలిటీ. ఇంతకీ మీరు కుక్రుత్ జోగీ పేరు విన్నారా?" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

తన వాక్యభుక్తమైన 'ఇంతకీ'ని ఉపయోగించిన

శివరామ్‌ని షాపతను చిరునవ్వుతో చూశాడు.

"కుక్రుత్ జోగీ గురించి వినకపోడమా? మా షాపులో అన్ని కంపెనీల అన్ని మందులూ అన్నివేళల్లో దొరుకుతాయి. అది మా ప్రఖ్యాతి. ఇంతకీ, కుక్రుత్ ఆఫీసరిక్కడే వున్నారుగా!" అంటూ అతను శివరామ్‌ని వోరగా చూస్తున్న జోగీశ్వర్ వైపు తిరిగాడు.

"మిస్టర్ జోగీశ్వర్, ఇంతకీ ఇంటిమేట్ ...."

"ఆ పేరుతో ఒక హైక్లాసు ఆయింట్‌మెంట్‌ని మేం ఆర్నెల్ల క్రితం ఎనౌన్స్ చేశాం. అయితే పేటెంట్ రిజిస్ట్రేషన్ వగైరా టెక్నికల్ ప్రాబ్లమ్స్‌వల్ల తయారు చేయలేదు...." జోగీశ్వర్ బింకంగా అన్నాడు.

అతని సమయస్ఫూర్తి శివరామ్‌కి నవ్వు తెప్పించింది. ఇలాంటి సమయస్ఫూర్తి వున్న వ్యక్తులే తనకి కావాలి!

"చూశారా?" షాపతను శివరామ్‌వైపు బట్టతల తిప్పి అన్నాడు.

"విన్నాను! వస్తాను" శివరామ్ వెనక్కి తిరిగాడు.

కుక్రుత్ జోగీ ప్రొడక్ట్స్‌లో కాలం చెల్లిపోయిన వాటన్నింటినీ త్వరగా లిస్టులో రాయమని షాపతను యెవరో శిష్యుడిని పురమాయించడం శివరామ్ చెవులకి శుభ్రంగా వినిపించింది. పేవ్‌మెంట్ మీద ఆగి, అతను సిగరెట్ వెలిగించాడు. జోగీశ్వర్—రత్నకుమార్—జోగీశ్వర్—రత్న... కళ్ళు తన వీపుని చిల్లులు పొడిచే ప్రయత్నంలో వున్నాయని అతనికి తెలుసు.

శివరాం ఆలోచిస్తూ రోడ్డు దాటాడు. ఎదురుగా వున్న రాణీ అండ్ రాజా మెడికల్స్‌లోకి దూరాడు. కుక్రుత్ జోగీ ఫార్మస్యూటికల్స్ ఎనౌన్స్ చేసి, ఇంకా తయారు చేయని ఇంటిమేట్ ఆయింట్‌మెంట్ గురించీ,

దక్షిణ్ ఫార్మస్యూటికల్స్ కలలో కూడా ఊహించని ఇంటిమేట్ అయింట్ మెంట్ గురించి—రాణీ అండ్ రాజా మెడికల్స్‌లో గిరాకీల్ని ఆకర్షించడానికి షో కేసులో బొమ్మలా కూచున్న రాణీతో రెండునిమిషాలు మాట్లాడి గిరుక్కున వెనక్కి తిరిగాడు.

అతని చూపులు రోడ్డవతల షాపుకి దూసుకెళ్ళాయి. జోగీశ్వర్ ఇటువేపే చూస్తున్నాడు.

శివరాం పేవ్ మెంట్ మీద నడవసాగేడు. ఆగిన ఆటోని సాగిపొమ్మన్నాడు. తను ఆలోచించాలి. తనకి ఆలోచించడానికి వ్యవధి కావాలి. సిగరెట్ ని గిరాటేసి శివరాం శరవేగంతో ఆలోచిస్తూ, నెమ్మదిగా నడవసాగేడు....

# 3

మరుసటిరోజు రాత్రి తొమ్మిది దాటింది.

శివరాం హోటల్ రిసెప్షన్ ముందుకి నడిచాడు. సీరియస్ గా రిజిస్టర్ని పరిశీలిస్తున్న రిసెప్షనిస్టు తలెత్తి అతన్ని గౌరవభావంతో చూశాడు.

"అమ్మగారు గంటక్రితం బైటికి వెళ్ళారు సార్. ఇంకా రాలేదు. అన్నట్టు గది తాళంచెవి ఇవ్వలేదు; మరిచిపోయినట్టున్నారు...."

"అలాగా?" అమ్మగారు గంటక్రితం బైటికి వెళ్ళిందనీ, కావాలనే తాళంచెవి ఇవ్వడం 'ప్రయత్నించి' మరిచిపోయిందనీ, ఇప్పట్లో తిరిగిరాదనీ శుభ్రంగా తెలిసిన శివరాం అమాయకంగా అన్నాడు.

"ఏం చేస్తారు సార్? అమ్మగారు వచ్చేస్తారనుకుంటా" రిసెప్షనిస్టు మర్యాదపూర్వకంగా అడిగాడు.

శివరాం మౌనంగా కోటుజేబులోకి చేతినిపోనిచ్చాడు.

'టప్'మని శబ్దం చేస్తూ ఒక బాటిల్ని కౌంటర్ మీద పెట్టాడు. రిసెప్షనిస్టు బాటిల్ని ఆశ్చర్యంగా చూశాడు. బాటిల్ని కొద్దిగా తిప్పాడు. గ్రీన్ లేబుల్ మీద రెడ్ లెటర్స్‌లో జిగేల్‌మంటున్న 'స్టిములిన్' పేరుని అతను మెరిసే కళ్ళతో చూశాడు. ప్రశ్నార్థకంగా శివరాం వైపు చూశాడు.

"ఎక్కడ సంపాయించారు, సార్? అర్నెల్లగా అన్ని షాపుల్లోనూ అడుగుతూనే వున్నాను!"

అరగంటలో, ధర పైన పాతిక రూపాయల బక్షీస్‌తో దాన్ని తను సంపాయించాడని చెప్పకుండా శివరాం తేలిగ్గా నవ్వాడు. "నేను కాదు; రూమ్ టూ నాట్ నైన్‌లో వున్న నా మిత్రుడు నీకోసం సంపాయించాడు! నీకు ఇవ్వమన్నాడు."

"ఓహ్! ఆయన మీ మిత్రుడా? మామూలుగా వున్నా ఆయన మీ మిత్రులని నాకు తెలీలేదే!" రిసెప్షనిస్టు అన్నాడు.

"నిన్ననే మా స్నేహితం పుట్టింది; పెరిగింది. ఇద్దరిదీ ఒకే వృత్తి చూడు...."

"మెడికల్....ఓహ్....మీది ఏ కంపెనీ సార్?"

"ఒకటి కాదు; అయిదు కంపెనీలకి నేను ఫీల్డాఫీసర్ని. చిత్తరంజన్ కంపెనీ నా పరిధిలోకే వస్తుంది; మార్చి తర్వాత....అన్నట్టు, చిత్తరంజన్ ఇవాళ కూడా ఆలస్యంగానే వస్తాడు. డిన్నర్ గదికి పంపమన్నాడు" శివరాం నవ్వుతూ అన్నాడు.

"అలాగే సార్! థాంక్స్ సార్...."

"ఫర్గెటిట్. అన్నట్టు మరో సంగతి. మా ఆవిడ వాళ్ళ ఫ్రెండింటికెళ్ళింది. ఏ పదకొండింటికో వాళ్ళు

కార్లో ఆమెని దిగబెడతారు....నువ్వు వుంటావుగా?" శివరాం ప్రశ్నించాడు.

"లేదు సార్. పదిహేను నిమిషాల్లో డ్యూటీ దిగేస్తాను....ఏం?"

"ఆమె వచ్చేలోగా చిత్తరంజన్, నేనూ సెలిబ్రేట్ చేసుకోవాలనుకున్నాం. నన్ను అతను తన రూంలోనే వుండమన్నాడు....ఓ పని చేస్తే?" శివరాం ఆలోచిస్తూ రెండు మోచేతుల్నీ కౌంటర్ మీద ఆన్చాడు.

"ఏమిటి సార్?"

"నేను చిత్తరంజన్ గదిలో రెస్టు తీసుకుంటూ వుంటాను; నువ్వు తాళం తెరిస్తే..."

"ఎంతమాట సార్! తాళంచెవి ఇస్తాను; పట్టుకెళ్ళండి" రిసెప్షనిస్టు ఉషారుగా అన్నాడు.

"అక్కర్లేదు. నాతో నువ్వురా. గది తాళం తీసెయ్. నేను కాసేపు పడుకుంటాను. నిద్రపోతే ఒక పట్టాన మెలకువరాదు నాకు. మళ్ళీ బైటతాళం వేసి, తాళంచెవిని ఇక్కడే వేళ్ళాడేయ్. చిత్తరంజన్ తీసుకుని తాళం తెరిచి, నన్ను నిద్రలేపుతాడు. బైదిబై మా ఇద్దరికీ ఈ పూట తిండి అతని గదికే సప్లై చేసే ఏర్పాటు చెయ్....వోకే?" అతనికి ఆలోచించుకునే అవకాశం ఇవ్వకుండా అన్నాడు శివరాం.

"....అలాగే...." రిసెప్షనిస్టు నసిగాడు.

శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. "నీకు ఇబ్బందిగా వుంటే ఆ సోఫాలో కునికిపాట్లు పడుతూ వుంటాను, అతను వచ్చేదాకా!"

రిసెప్షనిస్టు నవ్వాడు. "ఇబ్బందేముంది సార్! మీరిద్దరూ మిత్రులు. ఇద్దరూ మా అతిథులు! పదండి.

ఎటొచ్చీ మిమ్మల్ని లోపలవుంచి లాక్ చేయాలే అని ఆలోచిస్తున్నా...."

"మరేం ఫర్వాలేదు. అతను వచ్చి, స్నానం అదీ చేసి తీరిగ్గా నన్ను లేపుతాడు. మరిచాను.........భోంచేశాక, వేడివేడి పాలలో రెండు చెంచాలు కలుపుకుని 'ప్రీమ లిన్' తాగాలిట. తరవాత....రెస్టు" శివరాం నవ్వుతూ కన్నుగీటాడు. "ఇంతికీ పెళ్ళయిందా?"

అతను సిగ్గుపడుతూ నవ్వాడు. "అవకపోతే ఇది యెందుకు సార్?" అన్నాడు బాటిల్ని పాంటు జేబులో దోపుకుంటూ.

శివరాం సిగరెట్ వెలిగించాడు నవ్వుని దాచుకో డానికి. రిసెప్షనిస్టు అదరాబాదరా కౌంటర్ ముందుకి నడిచాడు. అతని చేతిలో టూ నాట్ నైన్ తాళంచెవి వేళ్ళాడుతోంది.

"వెళ్దాం, సార్...." అన్నాడతను.

"తప్పకుండా!" శివరాం నవ్వుతూ కదిలాడు. ప్రీమ లిన్ ఇన్స్టంట్ — వండర్ — డ్రగ్ అనుకుంటూ మెట్లవైపు దూసుకెళుతున్న రిసెప్షనిస్టుని వెంబడించాడు.

## 4

గుమ్మం ముందు అడుగుల చప్పుడు ఆగింది. తాళంచెవి స్లాట్లో దూరి తిరుగుతూ చప్పుడు చేసింది. తలుపు తెరుచుకుంది; మూసుకుంది. కూనిరాగం ఉషారుగా వినిపిస్తోంది....

గుమ్మానికి యెదురుగా వున్న గోడవేపు తిప్పిన ఫోమ్ సోఫాలో హాయిగా పడుకున్న శివరాం మెల్లిగా లేచి నిలబడ్డాడు.

"వెల్‌కమ్ టూ యువర్ రూం, చిత్తరంజన్!" శివరాం కంఠం స్పష్టంగా ధ్వనించింది.

రాతిగోడను ఢీకొన్న గుడ్డివాడిలా అతను తటాలున నిలబడ్డాడు. కూనిరాగం ఆగిపోయింది. చేతిలోని లెదర్ బాగ్ దబ్‌మన్న శబ్దంతో కిందపడి అతనిలో ఒక్కసారిగా పేలిన ఆశ్చర్యాన్నీ, భీతినీ వ్యక్తం చేసింది. రెప్పపాటు మరిచిపోయిన అతని కళ్ళు ఆశ్చర్యాన్ని విశ్వరూపంలో చూపిస్తున్న భూతద్దాల్లా వున్నాయి. అతని పెదవులు అదిరాయి.

"ఎ........ఎవర్నువ్వు? ఎలా వచ్చావ్?" వణుకుతున్న బొంగురు కంఠాన్ని అదుపులో పెట్టుకుంటూ అరిచాడతను.

శివరాం చిన్నగా నవ్వాడు. కోటుజేబులోంచీ పాకెట్ తీసి సిగరెట్ వెలిగించాడు. పొగని విష్ణుచక్రంలా అతనివైపు నోటితో ఊదాడు.

"నీ సంచీని చేతపట్టుకో—ధైర్యాన్ని చిక్కబట్టుకో ఇలారా!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఇంటిమేట్ అయింట్ మెంట్ అంటూ నా వెనకాలే షాపులన్నీ తిరిగావ్, నిన్న! తాళంవేసిన నా గదిలోకి యెలా వచ్చావ్?" చిత్తరంజన్ హుంకరించాడు.

"రాజాలాగా నీ గదిలోకి రావడానికి మూటఇరవై యేడు రూపాయలా నలభై పైసలూ ప్లస్ 'స్టిములిన్' కొనడానికి ఆటోవాడికి ఇచ్చిన ఇరవై రెండు రూపాయలూ ఖర్చయ్యింది!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఎందుకు వచ్చావో నాకు తెలీదు. తెలుసుకోవాలనీ లేదు! రిసెప్షన్ పన్నానీ టానిక్ బాటిల్ లంచం తీసుకుని నా గదిలోకి నిన్ను వదిలాడని అర్థమవుతోంది.

తెల్లారేక వాడు ఇంటికీ, తెల్లారకముందే నువ్వు జెయిలుకి వెళ్ళే యేర్పాటు చేస్తాను; రాస్కెల్!" చిత్తరంజన్ హుంకరించాడు.

శివరాం మంచంమీద కూచున్నాడు. తలవేపున స్టూల్ మీదున్న టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు. "రూం నంబర్ టూ వో నైన్. కనెక్టు మీ టూ క్రైమ్ బ్రాంచ్!"

చిత్తరంజన్ అర్థంకానట్టు చూస్తూ సోఫా దగ్గరగా నడిచాడు. క్రైమ్ బ్రాంచ్ అన్న పదం అతనిలోని కోపాన్ని కంగారుగా మార్చేస్తోంది.

"హలోల్డాన్! ఎవర్నువ్వు?"

శివరాం రిసీవర్ని పడేశాడు. కాలుమీద కాలేసుకుని చిత్తరంజన్ని చిరునవ్వుతో చూశాడు. "నా పేరు కావాలా, నా హోదా పేరు కావాలా?"

"రెండూ చెప్పేసి, గదిలోంచీ యేదేనా తీసుకుని వుంటే అక్కడ పడేసి పారిపో!" చిత్తరంజన్ హుందాగా అన్నాడు.

శివరాం పకపక నవ్వాడు. "ఇందాకా తెల్లారేలోగా నన్ను జైల్లోకి సరఫరా చేస్తానన్నావ్! నీ బతుకు తెల్లారే క్షణాలు ఒకదాన్నొకటి తరుముకుంటూ వస్తున్నాయ్!"

"వాడ్డూయూ మీన్?"

"ఇందాకా యెవరని అడిగావు. నా పేరు ప్రస్తుతానికి అనవసరం. నా హోదా పేరు: అసిస్టెంటు కమిషనర్, ఆర్ ఏ డబ్ల్యూ—రిసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్, గవర్నమెంటాఫ్ ఇండియా న్యూఢిల్లీ!"

చిత్తరంజన్ చెయ్యి సోఫా వెనకనుంచీ పైకి లేచింది. లెదర్ బాగ్ని సోఫాలో పడేసి అతను మెల్లిగా ముందుకి

నడిచాడు. బాగ్ పక్కనే సోఫాలో చతికిలబడి అయోమయంగా చూశాడు.

"....నేను నమ్మను!"

"అది నీ దురదృష్టం!" శివరాం నవ్వుతూ అన్నాడు. "మూడునెలలుగా జోగీశ్వర్ని, రత్నకుమార్నీ, తాండవేశ్వర్నీ వెంటాడుతూ, నీ నామరూపాలూ, గుణగణాలూ — నీ పూర్తి చరిత్రా కనిపెట్టాను, చిత్తరంజన్!"

"నా ఇష్టం వచ్చిన పేరుతో వ్యవహరిస్తాను. కాదనే అధికారం ఈ దేశంలో యెవ్వరికీ లేదు.... పైగా నేను యే నేరమూ చేయలేదు!" చిత్తరంజన్ గంభీరంగా అన్నాడు.

శివరాం నవ్వుతూ పైకి లేచాడు. టెలిఫోన్ మోగింది. వొంగి రిసీవర్ అందుకున్నాడు. "యస్. ఐ ఉడ్ లైక్ టూ స్పీక్ విత్ ఇన్స్పెక్టర్ మెహతా...."

చిత్తరంజన్ అమాంతం సోఫాలోంచీ లేచాడు. లెదర్ బాగ్ని పట్టుకుని సోఫా అవతలకి గంతేశాడు. రిసీవర్ని పడేసి శివరాం మెరుపులా కదిలాడు. సోఫా మీదికి కాలు ఆని, అటువైపు దూకాడు. తలుపుని చేరుకున్న చిత్తరంజన్ చొక్కా వెనక భాగాన్ని అతని చేతివేళ్ళు పట్టకారులా పట్టేశాయి.

గింజుకుంటున్న అతన్ని శివరాం బలంగా వెనక్కి లాగుతూ చేతిని వదిలేశాడు. చిత్తరంజన్ తివాచీమీద వెల్లకిలాపడ్డాడు. లెదర్ బాగ్ అతని చేతిలోంచీ జారింది. మోచేతులమీద ఆనుకుని పైకిలేచే ప్రయత్నం చేస్తున్న అతన్ని శివరాం సింహంలా సమీపించాడు. పైకిలేచిన చిత్తరంజన్ మోకాల్ని శివరాం బూటుసుత్తిలా తాకింది.

అప్రయత్నంగా చిత్తరంజన్ కవ్వుషున్నాడు. అతని రెండు కాళ్ళూ పాదె వెదుళ్ళలా నిటారుగా సాగాయి.

శివరాం రెండు కాళ్ళనీ యెడంగా వుంచి, అతని తొడల సరిహద్దుకి కదిలాడు. బూట్ల పాదములతో రెండు తొడల్నీ బలంగా నొక్కుతూ కిందికి వంగాడు. అతని చెయ్యి పాము పడగలా కదిలింది. చిత్తరంజన్ నడుముని చుట్టిన బెల్టు బకిల్ రెప్పపాటులో అతని చేతిలోకి ఊడి వచ్చింది. పైకిలేస్తూ శివరాం చేతిని విసురుగా గుంజాడు. పాంటుకి వున్న రింగ్స్‌ని తెంచుకుంటూ పుట్టలోంచీ లాగబడిన పాములా బెల్టు అతని చేతిలోకి ఊడివచ్చింది. చిత్తరంజన్ నడుం పైకి లేచి మళ్ళీ కింద పడింది.

శివరాం చెయ్యి పైకి లేచింది. చిత్తరంజన్ మొహంలోకి అతను తీక్షణంగా చూశాడు. గారడాలా వేళ్ళాడు తున్న లెదర్ బెల్టుని చిత్తరంజన్ కంగారుగా చూశాడు.

"నో ఓ ఓ ఓ.........!" అసంకల్పితంగా అరిచాడు.

"తొక ముడుచుకుని లేచి, దేకుతూ వెళ్ళి మంచం మీద శోభనం పెళ్ళికొడుకులా కూచో!" శివరాం గర్జించాడు.

"నో!" చిత్తరంజన్ కీచుగా అరిచాడు.

శివరాం చెయ్యి విసురుగా కదిలింది. చిత్తరంజన్ రెప్పవేసి తెరిచేలోగా బెల్టుకొస శివరాం చేతిలోకి మారి, బకిల్ వున్న కొస కిందికి వేళ్ళాడింది.

"గటప్! బకిల్ని బాడిసెగాచేసి బీరుతో గుండ్రంగా నునుపు తేలిన నీ దట్టి మొహాన్ని చెక్కేస్తాను!" శివరాం అరిచాడు.

మూలుగుతూ, నడ్డి విరిగిన పాములా చిత్తరంజన్ పైకి జరిగి, వొగురుస్తూ లేచాడు. తడబడుతున్న అడుగులతో

మంచం కొంచెపు కదిలాడు.

"ఆగు!" శివరాం ఉత్తరువిచ్చాడు. అతను ఆగి వెనక్కి తిరిగాడు.

"మనసు మార్చుకున్నాను...." శివరాం ఆగి, అతని కళ్లల్లో తొణుక్కుమన్న రిలీఫ్‌నీ, ఆశనీ చిరునవ్వుతో చూశాడు.

"మంచం ఇప్పుడే వొద్దు! అటువైపున గోడ కుర్చీ వెయ్!"

చిత్తరంజన్ నమ్మలేనట్టు చూశాడు. "వా...ట్..!"

"చిన్నప్పుడు బళ్లో నేర్చుకునే అది! ఆ గోడకుర్చీ వేసి హాయిగా రిలాక్స్ అవు!"

"నో! ఆర్ యూ...."

శివరాం చేతిలోకి బెత్తం ప్రాణం వచ్చినట్టు ఉలిక్కిపడింది. చిత్తరంజన్ మొహానికి అరడుగు దూరంలో 'ఝమ్' అంటూ దూసుకెళ్ళింది. చిత్తరంజన్ అసంకల్పితంగా వెనక్కి వాలాడు.

"ఈ క్షణం నుంచీ రెండోసారి ఏదీ చెప్పను! ఒకోసారి, అప్రయత్నంగా ఎఫెక్టు కోసం నా కంఠస్వరాన్నీ, మాడ్యులేషన్‌నీ మార్చేస్తూ వుంటాను! చెవులు రిక్కించి ఏకాగ్రతతో విను! గో!" శివరాం గంభీరంగా అన్నాడు. అతని ఉత్తరువుని దండోరా వేస్తున్నట్టు బెత్తం మళ్ళీ 'ఝమ్' అంది.

చిత్తరంజన్ అదరాబాదరా గోడకి వీపు ఆన్చి, కిందికి జారాడు. ముందుకి సాగిన మోకాళ్ళమీద అప్రయత్నంగా చేతుల్ని ఆన్చుకున్నాడు. శివరాం దగ్గరగా జరిగి అతన్ని నవ్వుతూ చూశాడు.

"గుడ్. మీ పంతులు ఎవడో గోడకుర్చీ వేయడం

నీకు బాగా నేర్పినట్టున్నాడు. హేట్సాఫ్ టు హిమ్!"

చిత్తరంజన్ కలగంటున్న; మేలుకుంటున్న వ్యక్తిలా అయోమయంగా చూశాడు. "ఎ....ఎ....ఏమిటిదంతా? మీరు....మీకు ఏం కావాలి....?"

"నిజం" శివరాం క్లుప్తంగా అన్నాడు. ప్రశ్నార్థకంగా చూస్తున్న చిత్తరంజన్ కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు.

"చిత్తరంజన్, నువ్వు 'కామన్ హెల్తు' ఫార్మస్యూటికల్ 'రెప్' వి. జోగీశ్వర్ పేరుతో 'కుక్రుత్ జోగీ' వ్యక్తిగా, రత్నకుమార్ పేరుతో 'దక్షిణ్' వ్యక్తిగా, తాండవేశ్వర్ పేరుతో 'హీలర్' ఫార్మస్యూటికల్స్ వ్యక్తిగా నటిస్తున్నావు. ఆ కంపెనీల ఎక్స్‌పైర్డ్ ఇంజెక్షన్లూ, మందులూ—ఖరీదైనవి—తీసుకుని, షాపులకి కొత్త స్టాకు సప్లై చేస్తున్నావ్ ..."

"ఆ కంపెనీలన్నిటికీ నేనే ఏరియా ఇన్‌స్పెక్టర్ని..." చిత్తరంజన్ అడ్డుతగిలాడు. తడబడుతూ.

శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. "నీకు తాతయ్య వున్నారా?"

చిత్తరంజన్ అర్థంకానట్టు చూశాడు. "ఎ..ఏం...?"

"నేను పంపించాక వెళ్ళి ఈ కథ మీ తాతయ్యకి చెప్పుకో!" శివరాం ఎగతాళిగా అన్నాడు. "మూడు కంపెనీలకి నువ్వే ఏకైక ఏరియా ఇన్‌స్పెక్టర్ అయితే మూడు పేర్లెందుకు? ఒకే పేరు—చిత్తరంజన్—చాలు!"

చిత్తరంజన్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. అతని పెదవులు అదరడం ప్రారంభించాయి. అయితే మాట రాలేదు.

శివరాం చెయ్యి కోటుజేబులోకి వెళ్ళి తిరిగొచ్చింది.

ఖరీదైన దళసరి కాగితాల్ని అతను కిందపడేశాడు. చిత్త రంజన్ వాటిని ఆశ్చర్యంతో చూశాడు.

"కుశల్ జోగీ, దక్షిణ్, హీలర్, కామన్ వెల్తు కంపెనీల్లో రెప్‌గా పనిచేస్తున్న వ్యక్తుల పేర్లున్న సర్టిఫైడ్ లిస్ట్ అవి. కేవలం కామన్‌వెల్తు లిస్టులో మాత్రం నీ పేరుంది. ఏ కంపెనీకీ నువ్వు సృష్టించిన 'ఏరియా ఇన్‌స్పెక్టర్' ఉద్యోగం లేదు!" శివరాం ఆగి, సిగరెట్ వెలిగించాడు.

తెల్లగా పాలిపోయిన మొహాన్ని చిత్తరంజన్ శివరాంవైపు పైకెత్తాడు. అతని కళ్ళల్లో బ్రహ్మాండమైన భయం, ఆందోళనా జతగా అవుపిస్తున్నాయి.

"కమాన్! నీ బహుపాత్రాభినయం యెందుకు?" శివరాం గర్జించాడు.

చిత్తరంజన్ ఇబ్బందిగా కదుల్తూ మోకాళ్ళనీ, తొడల్నీ అరచేతుల్తో రుద్దుకున్నాడు. గోడకుర్చీలో అతను పడుతున్న బాధ అతని మొహంమీద స్పష్టంగా అవుపిస్తోంది. చెమటలు ధారలుగా కారుతున్నాయి. బెల్టు పట్టుకున్న శివరాం చెయ్యి కొద్దిగా కదిలింది.

"నో! చెపుతాను....డబ్బుకోసం....ఒకో కంపెనీకి ఒక్కో పేరుతో పనిచేస్తున్నాను అంతే...."

శివరాం తటాలున అతని దగ్గరగా కదిలాడు. అతని ఎడమ చెయ్యి చిత్తరంజన్ జుట్టుని కర్కశంగా పట్టుకుంది. చేతిని వెకిలాగుతూ అతని తలని వెనక్కి తోశాడు శివరాం. గుళ్ళో రాతిమీద కొబ్బరి కాయలా అతని తల గోడని తాకి చప్పుడుచేసింది. సీలింగ్ వైపు లేచిన మొహంతో శివరాం మొహంలోకి కంగారుగా చూశాడతను.

"బాస్టర్డ్! గంగిరెద్దులాగా తలలూపే షావు వాళ్ళలా నీ మాటల్ని నమ్మేస్తాననుకుంటున్నావా?" శివరాం హుంకరించాడు.

"నో! ప్లీజ్! నేను నిజమే చెప్తున్నాను!" చిత్తరంజన్ అరిచాడు.

"షటప్!" శివరాం గర్జించాడు. "నువ్వు చెప్తోంది పచ్చి అబద్ధమని నాకు తెలుసు. నీముందు పడున్న కాయితాలు నీ అబద్ధాన్ని రాతలో చూపిస్తున్నాయ్! నువ్వు చెలామణీ అవుతున్న మూడు పేర్లూ ఆ లిస్టుల్లో లేవు!"

అప్రయత్నంగా చిత్తరంజన్ రెండు చేతుల్లో మొహాన్ని తుడుచుకున్నాడు. మెల్లిగా అతని వీపు గోడమ్మట కిందికి జరుగుతోంది.

"సిట్ రైట్!" శివరాం అరిచాడు.

పళ్ళు బిగబట్టుకుంటూ చిత్తరంజన్ సర్దుకున్నాడు. శివరాం చెయ్యి మళ్ళీ కోటు జేబులోకి దూరింది. పిడికిలిలో బిగించిన ఇంజెక్షన్ వయల్స్‌ని పక్కనే వున్న మంచం మీద పదేశాడతను. రెండో పిడికిలి కూడా పదేసి చిత్తరంజన్ వేపు యెగతాళిగా చూశాడు. చిత్తరంజన్ కంగారుగా మంచంమీది పడున్న వయల్స్ కుప్పని చూస్తున్నాడు.

"నువ్వు కొత్తగా సప్లై చేసిన స్టాకులోంచీ కొన్ని, వాపసు తీసుకోబోయిన స్టాక్స్‌లోంచీ కొన్నీ—సేకరించాను. తెల్లవారుజామునే ఇవన్నీ స్పెషల్ పార్సెల్‌లో గాలిలో దూసుకుంటూ ఢిల్లీలోని ఆర్ ఏ డబ్ల్యూ లాబొరేటరీకి వెళ్తాయి. సాయంత్రంలోగా టెలెక్స్‌లో వాటి అనాలిసిస్—రిజల్టు మనకి అందుతుంది. అంతవరకూ నువ్వు క్రైమ్‌బ్రాంచ్ ఛీఫ్ ఆత్మారామ్ గుప్పిట్లో

భద్రంగా వుంటావు...”

కటాలున నేలకి జారి గజగజ వణకడం ప్రారంభించిన చిత్తరంజన్ని చూస్తూ శివరాం ఆపేశాడు.

కూలిపోయిన చిత్తరంజన్ వణుకుతూ పైకి లేచాడు. మరుక్షణంలో బిగ్గరగా ఏడ్చేవాడిలా శివరాంవైపు చూశాడు. అతని పెదవులు వణికాయి.

“సార్....నిజం చెప్పేస్తాను నన్ను....నన్ను.... కాపాడతారా?” ఏడుపు గొంతుతో బొంగురుగా అడిగాడతను.

తన్నుకొస్తున్న నవ్వుని బలవంతంగా లోపలికి తోస్తూ శివరాం అతని దగ్గరగా కదిలాడు అతని చెయ్యి కటాలున చిత్తరంజన్ నెక్ టై నాట్ని పట్టుకుంది. రంగు వెలిసిపోయిన గుడ్డలా అవుపిస్తున్న చిత్తరంజన్ మొహం తన మొహానికి దగ్గరగా వచ్చేలా గుంజాడు శివరాం. చిత్తరంజన్ మెడలో మెటిక విరిగింది.

“స్కౌండ్రల్! నిజం నిజం అంటూ ఇందాకా అబద్ధాలాడావు!” శివరాం ఉరిమిచూస్తూ గర్జించాడు.

“నో నో ...ఈసారి అంతా నిజమే చెప్తాను.... నన్ను కాపాడతారా?” అడిగిన ప్రశ్నే అడిగాడు చిత్తరంజన్.

శివరాం అతని టైని వదిలేశాడు. “మొదట నువ్వు పాడు. తరవాత కాపాడే సంగతి ఆలోచిద్దాం!”

చిత్తరంజన్ ఆశగా మంచంవేపు చూశాడు. శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. తేరగా తిని; బాగా బొజ్జేసి, శరీరాన్ని పెంచుకున్న చిత్తరంజన్ ఈసారి గోడకుర్చీ వేయిస్తే జెల్లీలా తయారవుతాడనిపించిం దతనికి.

"ఆల్ రైట్ .... వెళ్ళి మంచం మధ్యలో పద్మాసనం వేసుకుని, నిటారుగా కూచో. చేతుల్ని తొడలమీద యోగా పొజిషన్లో పెట్టుకో. పొట్టని లోపలికిలాగు. వెన్నుపామూ, మెడా ఒకే స్ట్రెయిట్ లైన్లో వుంచుకో. అటూ ఇటూ కదలకుండా కూచో. పద్మాసనంలో కూచుంటే సత్యం పలకడం సులభమవుతుందని యోగులు చెప్తారు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

చిత్తరంజన్ మళ్ళీ నమ్మలేనట్టు చూశాడు. ఎండి పోయిన అతని పెదాలు కదిలాయి.

"మహర్షి మహేష్‌యోగి 'ట్రాన్స్‌సెన్‌డెంటల్ మెడి టేషన్' క్లాసులకి యెప్పుడేనా వెళ్ళావా?" శివరాం సీరియస్‌గా ప్రశ్నించాడు.

"లె.... లేదు...." చిత్తరంజన్ నత్తిగా అన్నాడు.

"షరీబాడ్! ఆల్ రైట్ ........ ప్రిలిమినరీ టి. యం. లెసన్ నేను చెప్తాను. మంచం మధ్యలో పద్మాసనం! గెట్ అప్!" శివరాం హుంకరించాడు.

చిత్తరంజన్ ఆదరాబాదరా మంచం ఎక్కి అతి కష్టంమీద పద్మాసనం వేశాడు. ఆతుర్దాతో శివరాంని చూశాడు. శివరాం కిందపడున్న కాగితాల్ని, చిత్త రంజన్ లెదర్ బ్యాగ్‌నీ అందుకున్నాడు. బ్యాగ్ తెరిచి వొకసారి చూసి కాగితాల్ని, అందులో పడేశాడు. మంచంమీద పడున్న ఫయిల్స్‌ని బ్యాగ్‌లోకి జాగర్తగా వేశాడు. సోఫాని మంచం దగ్గరగా లాగాడు. కూచుని లెదర్ బ్యాగ్‌ని పక్కనే పెట్టుకున్నాడు. కాలుమీద కాలువేసుకుని సిగరెట్ వెలిగించాడు. రెప్పలెత్తి చిత్త రంజన్ని తీక్షణంగా చూశాడు.

టి.యమ్. క్లాసులో కూచుని, ఉపదేశంకోసం గురువు

మెుహాంలోకి చూస్తున్న శిష్యుడిలా, బుద్ధిగా పద్మాస
నంలో వున్నాడు చిత్తరంజన్.

"పాడు!" శివరాం ఆజ్ఞాపించాడు.

చిత్తరంజన్ నిట్టూర్చాడు. మెల్లిగా దగ్గాడు. కాళ్ళని అటూ ఇటూ సర్దుకుని మళ్ళీ నిట్టూర్చాడు.

శివరాం అతన్ని చిరునవ్వుతో చూశాడు. ఈసారి చిత్తరంజన్ నిజంగా నిజమే కక్కేస్తాడని అతనికి తెలుసు. తన గోడకుర్చీ, బెల్టు కొరడా, బెదిరింపులూ వగైరా లేకుండా అతనిచేత నిజం పలికించే కారణాలు వేరే వున్నాయనీ శివరాంకి తెలుసు. ఇంజెక్షన్ వయల్సూ రెప్రజెంటేటివ్స్ లిస్టులూ, ఆర్. ఏ. డబ్ల్యూ అతన్ని పూర్తిగా క్రుంగదీశాయనీ శివరాంకి తెలుసు....

"ఒక్క అక్షరం అబద్ధం ఆడితే, కూచున్న నేను పైకిలేస్తాను. ఆ క్షణంలో నువ్వు ఆ సేరెయొచ్చు. నిన్ను పోలీసు ఆఫీసర్లకి అప్పగిస్తాను. స్పెషల్ ట్రీట్మెంట్ ఇచ్చి, వాళ్ళు నీచేత కచ్చేరీ చేయిస్తారు. నువ్వు చెప్పే పూర్తి నిజాన్నే కాకుండా కేసుకోసం వాళ్ళకి కావాల్సిన 'నిజాల్నీ' చెప్పిస్తారు!" శివరాం నవ్వుతూ అన్నాడు,

"పూర్తిగా నిజం.... చెప్తాను.......," కంగారుగా అన్నాడు చిత్తరంజన్.

"చూద్దాం. ప్రారంభించు!" శివరాం ఆర్డరిచ్చాడు.

చిత్తరంజన్ వణికే కంఠంలో, తలత్ మెహమూద్ కంఠంతో—ప్రారంభించాడు....

# 5

అగుతూ, ఆగుతూ చెప్పి, 'ఇంతే' అన్నట్టు చూస్తూ శివరాంవైపు గుడ్లు మిటకరించాడు చిత్తరంజన్. అతని

మొహంమీద నూనె జిడ్డులా మెరుస్తున్న చెమటని చూస్తూ శివరాం సోఫాలోంచీ పైకి లేచాడు. పైన ఫాన్ తిరుగుతున్నా కూడా చెమటతో తడిసి ముద్ద అయిపోయి చిత్తరంజన్ శరీరానికి అతుక్కుపోయిన చొక్కాని ఒకసారి చూసి, మరో సిగరెట్ ముట్టించి, శివరాం పచార్లు ప్రారంభించాడు.

చిత్తరంజన్ చెప్పిన కథ నమ్మడానికి వీల్లేనిదిగా, ఊహాతీతంగా వుంది. అయితే, చిత్తరంజన్‌లో అబద్ధమాడే ధైర్యం ప్రస్తుతం లేదని అతనికి తెలుసు. చిత్తరంజన్ ప్రదర్శించిన బహుపాత్రధారణలో యేదో దుర్మార్గం వుందని మాత్రం తను ఊహించగలిగాడు. అయితే, ఆ దుర్మార్గం యెందుకోసం జరుగుతుందో చిత్తరంజన్ వివరించలేదు. ఆలోచిస్తూ శివరాం తటాలున ఆగి, చిత్తరంజన్ వైపు చూశాడు.

చేసిన నేరం వొప్పేసుకుని, యజమాని నిర్దాక్షిణ్యంగా విధించబోయే శిక్షకోసం యెదురుచూస్తున్న కట్టుబానిసలా కూచున్నాడు చిత్తరంజన్. ఎలుకను పట్టబోతూ, పొరపాటుగా పెద్ద బోనులో యిరుక్కుపోయిన పిల్లి కళ్ళలా కంగారుగా చూస్తున్నాయి అతని కళ్ళు.

"చిత్తరంజన్, నువ్వు పూర్తిగా నిజం చెప్పలేదు!" శివరాం గంభీరంగా అన్నాడు.

చిత్తరంజన్ దీనంగా చూశాడు. "గాడ్ ప్రామిస్! నిజమే చెప్పాను!"

"దేవుని సాక్షిగా నువ్వు చెప్పి వుంటే, దేవుడే నిన్ను రక్షించాలి! మానవమాత్రుడెవడూ నిన్ను రక్షించలేడు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

చిత్తరంజన్ నాలుక అతని గొంతులో అర్ధంకాని

చప్పుళ్ళు చేసింది.

"చిత్తరంజన్, కోలిన్ ఇంజెక్షన్‌కి సబ్‌స్టిట్యూట్‌గా వున్న కుకోలిన్‌కి డూప్‌గా నీ కంపెనీ తయారుచేసిన 'కామోలిన్' ఇంజక్షన్‌ని దేనికి వాడతారు?" శివరాం ఉన్నట్టుండి ప్రశ్నించాడు.

చిత్తరంజన్ గుటకలు మింగాడు. ఇన్‌ఫెక్షన్‌తో పూర్తిగా మూసుకుపోయిన గొంతులా తయారైన బొంగురు కంఠంతో అన్నాడు. "డెలివరీ జరిగాక తల్లి సీరియస్ కండిషన్‌లో పడితే.... దాన్ని.... వాడతారు.."

"నిజం చెప్పావ్! అలాగే మరో నిజం చెప్పు; చాలా ఖరీదైన ఆ ఇంజెక్షన్స్‌మీదే నీ డర్టీ బిజినెస్ ముఖ్యంగా కేంద్రీకరించబడింది. ఎందుకు?"

".... తెలీదు... చెయ్యమన్న పని చేయడం నాడ్యూటీ" చిత్తరంజన్ తడబడుతూ అన్నాడు.

"ఆల్‌రైట్. నీ స్టేట్‌మెంట్ సంతృప్తికరంగా లేదు. మరో అరగంటలో మా డిపార్టుమెంటు నువ్వు గ్రిఫిన్ ప్లాక్స్‌నీ, కాలంతీరిన ప్లాక్స్‌నీ నిలవచేసిన ఆ చౌకబారు లాడ్జిగదిని సీల్ చేస్తుంది. అనాలిసిస్ రిపోర్టు వచ్చాక ఏం చేయాల్సిందీ నిర్ణయిస్తాం!" శివరాం సాలోచనగా అన్నాడు.

చిత్తరంజన్ ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. రెండు క్షణాల తరవాత తెప్పరిల్లి తగ్గుస్వరంలో అన్నాడు. "సార్.... ప్లాక్స్ మీ ఇష్టం........అంతా చెప్పి నేను మీకు సహకరించాను...."

"నాకు కాదు; నీకు నువ్వు సహకరించుకున్నావ్!" శివరాం గంభీరంగా అడ్డుతగిలాడు.

"సార్ ....నన్ను....నన్ను....ఏం చేస్తారు?"

శివరాం అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "నీ ప్యాక్స్‌ని సీజ్ చేసి, సీల్ చేసేవిధంగా నిన్నూ సీజ్ చేసి, లాకప్‌లో సీల్ చేస్తాం!"

వణుకుతున్న చేతుల్ని చిత్తరంజన్ పిడికిళ్ళుగా బిగించి, ప్రాధేయపూర్వకంగా చూశాడు.

"పూర్తి నిజం—పూర్తిగా చెప్తే నిన్ను అప్రూవర్‌గా అంగీకరించి క్షమించే ప్రయత్నం చేస్తాం. అఫ్‌కోర్స్ మెడికల్ వీరుడిగా నిన్ను పర్మనెంట్‌గా డిస్‌క్వాలిఫై చేస్తామనుకో...." శివరాం సాదాగా అంటూ ఆగాడు.

"పూర్తి నిజం....అంటే....ఇంకా....మీకు....ఏం చెప్పాలి?" చిత్తరంజన్ గొణిగాడు.

"చిత్తరంజన్, మా రిసెర్చ్ వింగ్ గురించి నీకు తెలీదనుకుంటాను. ఈమధ్యే ఇండియాలో తయారవుతున్న కొన్ని వేల డ్రగ్స్‌ని అనలైజ్ చేసి పనికిమాలిన వాటి కిందికి చేర్చాం. అవన్నీ దాదాపు నా అబ్జర్వేషన్‌లో బైటపడిన నాసిరకం మందులే!" శివరాం సగర్వంగా అన్నాడు. క్షణకాలం ఆగి, మళ్ళీ ప్రారంభించాడు:

"నువ్వు ఆడుతున్న నాటకానికి అసలు కారణం యేమిటో నేను అప్పుడే పసికట్టాను. నీ నిజాయితీని పరీక్షించడానికి, తెలీనట్టు ఊరుకున్నా!"

చిత్తరంజన్ కళ్ళు గిన్నెల్లా తయారయ్యాయి. అతి ప్రయత్నంమీద అతను గొంతు పెగుల్చుకున్నాడు. "కారణం........నాకు కంపెనీ వివరంగా చెప్పలేదు. అయినా నా అనుభవంతో ఊహించి చెప్తాను....నన్ను.. వదిలేస్తారా?" ఆశ అతని కంఠంలో దోబూచులాడింది.

శివరాం అతని నక్క కళ్ళల్లోకి చూశాడు. "చూద్దాం. ఊహించు. నేను తయారుచేసుకున్న జవాబులకి నీ జవా

బులు సరిగ్గా సరిపోతే, మరో చిన్నపని నీకు చెప్తాను. అదిచేస్తే నిన్ను ఉరినుంచీ తప్పిస్తాను...."

చిత్తరంజన్ క్షణకాలం ఆలోచిస్తూ, అసంకల్పితంగా కళ్ళు మూసుకున్నాడు. అతను నిజంగానే ఆ యోగాసనంలో అలాగే ధ్యానంలోకి — భావాతీత ధ్యానంలోకి - వెళ్ళిపోతాడేమో అనిపించింది శివరాంకి. అయితే చిత్తరంజన్ కళ్ళు తెరిచాడు. ఆ కళ్ళల్లో ఏదో నిర్ణయం ప్రతిబింబిస్తోంది.

తగ్గుస్వరంలో పూర్తి నిజాన్ని, పూర్తిగా చెప్పడం ప్రారంభించాడతను ....

# 6

"ఇంతే సార్ ....చిత్తరంజన్ నిట్టూర్చాడు.

శివరాం అతన్ని చిరునవ్వుతో చూశాడు. "గుడ్. ఇప్పుడు నిజమే చెప్పావ్. ఇప్పటి ఈ నిజం కలిసేదాకా ఇందాకా నువ్వు చెప్పిందంతా నిజంగా ధ్వనించలేక పోయింది...."

"సార్ ....అప్రూవర్ గా కూడా వద్దు సార్ ...నన్ను వొదిలేయండి!" చిత్తరంజన్ లోని ఆరితేరిన సేల్స్మన్ అన్నాడు. శివరాం అతని కళ్ళల్లోకి తీక్షణంగాచూశాడు.

"చిత్తరంజన్, నువ్వు చాలా భయంకరమైన నేరం చేశావు."

"సార్ .... నేను అమాయకుణ్ని ....కంపెనీ నన్ను ఉపయోగించుకుంది...."

"ఒకవిధంగా నువ్వు రైట్. అయితే నేరం పూర్తిగా కంపెనీమీద తోసివేయలేవు! పెద్దవాడు పాపాలు చేయిస్తాడు. నీలాంటి చిన్నవాడు బలహీనుడు ఆయుధంగా ఉపయోగించబడతాడు. అంతా గల్లంతై

నప్పుడు బలవంతుడు తెలివిగా జారుకుంటాడు. బలహీనుడు బలైపోతాడు!" శివరాం గంభీరంగా అన్నాడు.

"మా కంపెనీ అలాంటిది కాదు సార్...." చిత్తరంజన్ ధైర్యంగా అన్నాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "ఇంతకాలం నువ్వు సాగించిన వ్యాపారం చేయమని కంపెనీ నీకు వ్రాతమూలకంగా ఆర్డర్ ఇచ్చిందా?"

చిత్తరంజన్ నోరు వెళ్ళబెడుతూ చూశాడు. "లేదు...."

"నీద్వారా సాగిన ఈ ఘోర నేరాన్ని నేను సి.బి.ఐ.కి అప్పగిస్తాను. నువ్వు చెప్పిందంతా పూర్తిగా రిపోర్టు చేస్తాను. సిబిఐ నీ కంపెనీని, నిన్నూ విచారిస్తుంది. దేశవ్యాప్తంగా అంతా తవ్వుకుంటూ జరుగుతుంది. అప్పుడు యేమవుతుంది?" శివరాం రెప్పవేయకుండా చూస్తూ ప్రశ్నించాడు.

చిత్తరంజన్ గుటకలు మింగి, చిన్నగా దగ్గి, అర్థంకానివాడిలా చూశాడు.

శివరాం చిన్నగా నవ్వుతూ అన్నాడు. "ఏమవుతుందో నేను చెప్తాను చిత్తరంజన్! నీ కంపెనీ అమాయకత్వం నటిస్తుంది. చేసిన తప్పుడు వ్యాపారమంతా తన రెప్రజెంటేటివ్ అయిన చిత్తరంజన్ డబ్బుకోసం చేసుకున్నాడంటుంది. నిన్నుగురించి తెలియజేసినందుకు సిబిఐకి ధన్యవాదాలు చెప్తుంది. వరసగా నెలరోజులపాటు నీ ఫోటోతో అన్ని పేపర్స్‌లోనూ ప్రకటన ఇస్తుంది. చిత్తరంజన్ అనే వ్యక్తిని ఉద్యోగంలోంచీ తొలగించామనీ, అతనికీ 'కామన్ హెల్తు' సంస్థకీ ఏ సంబంధమూ, లేదనీ,

చిత్తరంజన్ బోగస్ సేల్స్‌మన్ అని నీ గురించి దండోరా వేసి, నిన్ను చిత్తరంజన్‌గా మార్చేస్తుంది. తరవాత యెక్కడ కనబడితే అక్కడ మెడికల్ స్టోర్స్ అసాములు నిన్ను పట్టుకుని...."

"నో ఓ.ఓ.ఓ!" చిత్తరంజన్ సైరన్‌లా అరిచాడు.

అతని మొహాన్ని తడిపేస్తున్న కొత్త చెమటని శివరాం తృప్తికరంగా చూశాడు. "యస్! చిత్తరంజన్! నువ్వే చెప్పు; ఫార్మాస్యూటికల్ చరిత్రలో ప్రపంచంలో మొట్టమొదటిసారిగా భారతదేశంలో జరిగిన డ్రగ్ స్కాండల్‌తో తనకి సంబంధం వుందని 'నీ కంపెనీ' వొప్పుకుంటుందా?"

చిత్తరంజన్ వూపిరాడనట్టు చూశాడు. అదురుతున్న అతని పెదవులూ, రబ్బరులా తయారైన నాలుకా అతి కష్టంమీద కదిలాయి.

"ఒప్పుకోదు...."

"అంటే నువ్వు బలి అయిపోతావు 'ఇదిగో, నేరం చేసి మా సంస్థ పరువుని బురదగుంటలోకి లాగడానికి ప్రయత్నించిన చిత్తరంజన్! ఇతన్ని తగినవిధంగా శిక్షించండి!' అంటూ నీ కంపెనీ నీ మెడనూ, మాంచి సర్జికల్ నైఫ్‌నూ మా చేతికి అందించేస్తుంది! అప్పుడు.."

"నో! నో! నో!" చిత్తరంజన్ అరిచాడు. తన అజ్ఞ మేరకు ఇంకా పద్మాసనంలోనే వున్న అతన్ని శివరాం చిరునవ్వుతో చూశాడు. తను ఒకటి రెండుసార్లు ప్రదర్శించిన ఆగ్రహంకన్నా తన చిరునవ్వు అతన్ని వాడల గొట్టేస్తుందని శివరాంకి తెలుసు....

"ఇది అన్యాయం! ఈ పనిని చేయమని నన్ను బ్రెయిన్ వాష్ చేసి పుష్కలంగా డబ్బిచ్చిన కంపెనీ చివరికి

నన్ను నాశనం చేయడం అన్యాయం" చిత్తరంజన్ ఆవే శంతో అరిచాడు.

"అన్యాయాన్ని యెదిరించు చిత్తరంజన్!" శివరాం గంభీరంగా అన్నాడు.

చిత్తరంజన్ అర్థంకానట్టు చూశాడు. "ఎలా? ఎలా ఎదిరించాలి? ఏదీ వ్రాతమూలకంగా కంపెనీ నాకు ఇవ్వలేదు."

"నువ్వు వ్రాతమూలకంగా ఇవ్వు, చిత్తరంజన్." శివ రామ్ నవ్వుతూ అన్నాడు.

"నే....నా....?" చిత్తరంజన్ గొణిగాడు.

"యస్! కంపెనీ స్వార్థంకోసం నిన్ను ఎప్పుడు ఎట్లా ఉపయోగించుకుందో వివరంగా రాయి!"

చిత్తరంజన్ అనుమానిస్తూ చూశాడు. "రాస్తే.... నేను ఇరుక్కుపోతాను!" కంగారుగా అన్నాడు.

"నువ్వు ఇప్పటికే పకడ్బందీగా ఇరుక్కుపోయావ్!" శివరాం గంభీరంగా అన్నాడు. "ఎందుకంటే, ఈ కథంతా నువ్వు రాయకపోయినా నేను డిటెయిల్డు రిపోర్టుగా రాస్తాను; రాసితీరాలి! అయితే, నువ్వే రాసి ఇవ్వడంవల్ల నీ నిజాయితీ వ్యక్తమవుతుంది. దాదాపు శిక్ష లేకుండా నువ్వు తప్పించుకుంటావ్. మరో లాభం యేమిటంటే ఈ కథ బైటికి పాక్కగానే 'ప్రోబ్', 'ఇండియా టు డే', 'సన్ డే', 'ఆన్ లుకర్', 'వీక్' వగైరా పత్రికలన్నీ నిన్ను ఇంటర్వ్యూ చేస్తాయి. నిర్భయంగా నిజం చెప్పి "డ్రగ్ రాకెట్" నుంచీ దేశాన్ని కాపాడిన నిన్ను హీరోగా చిత్రిస్తాయి. మరో ప్రచురణ సంస్థ ఆదరాబాదరా నీ దగ్గరకు పరిగెట్టుకొస్తుంది. "ఫుల్ డిస్క్లోజర్"తో ఈ విషయంమీద నీ చేత నవల రాయి

స్తుంది...."

"నిజంగానే....అంటారా?" చిత్తరంజన్ అడ్డు తగిలాడు.

"నేను అనడం కాదు, నువ్వే ఆలోచించు. బోఫోర్స్, ఫెయిర్ ఫాక్స్ గందరగోళాల్లో మన పత్రికలు ఎలాంటి పెద్ద కాత్రీల్ని నిర్భయంగా ఏకేస్తున్నాయో గుర్తు చేసుకో!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"అయితే రాయమంటారా?" సుడిగాలిలో తగులుకని ఉక్కిరి బిక్కిరయిపోతున్నట్టున్న చిత్తరంజన్ ఆశగా అడిగాడు.

"నీ యిష్టం! మేం బలవంతం చేయం. రెండు మార్గాలు నీకు చూపించాను. ఏ మార్గంలో వెళ్ళాలో నిర్ణయించుకునే డ్యూటీ, విజ్ఞతా నీవి! ఎందుకంటే నువ్వు స్టేట్‌మెంటు ఇవ్వకపోతే మరేం ఫర్వాలేదు. రేపొద్దున ప్రశ్నలకు సమాధానాలుగా మా ఎక్స్‌పర్టు నీచేత పూర్తిగా కక్కించి రికార్డు చేస్తారు!"

"పాక్....మిమ్మల్ని నమ్ముతాను. కుర్రవాణ్ని. నా భవిష్యత్తుని కాపాడండి. అంతా, అంతా రాస్తాను!" చిత్తరంజన్ ఉద్రేకంతో అన్నాడు.

"గుడ్. తెలివయిన నిర్ణయం. అంతా వివరంగా రాయి. ఐ వాంట్ ఫుల్ డిస్క్లోజర్! నీ కంపెనీ వ్యక్తి ఎప్పుడు, ఎక్కడ నీకు యేం చెప్పాడో, ఎప్పుడు ఎంతెంత ఇచ్చాడో, ఎవరి సమక్షంలో ఇచ్చాడో ఎందుకిచ్చాడో, ఇస్తున్నప్పుడు కూచున్నాడో, నుంచున్నాడో — పూర్తిగా, యాక్షన్ పార్టు కూడా రాయి. ఎంత వివరంగా సాగదీసి రాస్తే అంత నిజంగా

అది కనిపిస్తుంది!"

"సార్, కాళ్ళు పట్టేశాయి....లేవొచ్చా?" చిత్తరంజన్ బెరుకు బెరుకుగా అడిగాడు.

శివరామ్ పగలబడి నవ్వాడు. "ఉన్నట్టుండి నువ్వు ఉరుకులూ, పరుగులూ ఎత్తడానికి వీల్లేకుండా, కాళ్ళు నీకు సహకరించకుండా వుండటానికి గోడకుర్చీ, పద్మాసనం వేయించాను. గెటప్. సోఫాలో కూచో!"

చిత్తరంజన్ రెండు చేతుల సహాయంతో కాళ్ళని విడదీసి పళ్ళు బిగువున మెల్లిగా కదిలాడు. విల్లుల్లా వొంగిన కాళ్ళతో నడిచి, సోఫాలో కూలబడ్డాడు. శివరామ్ లేచి అతని ముందు ధ్వజస్తంభంలా నిలబడ్డాడు.

"చిత్తరంజన్, లెదర్ బ్యాగ్ లో వున్న నీ కంపెనీ లెటర్ హెడ్స్ తీసుకో. శుభ్రంగా అంతా రాయి. ఈ క్షణంనుంచీ నువ్వు ఎలాగా కామన్ హెల్తు కంపెనీలో చచ్చినా పనిచేయవని నాకు తెలుసు! అంచేత గంభీరమైన పదజాలంతో, రాజీనామా ఉత్తరం కూడా రాయి. డబ్బున్న దుర్మార్గుల, స్వార్థపరుల పాపఫలితంలో పాలు పంచుకోడం ఇష్టంలేకా, దేశానికీ, సోదర మానవులకూ ద్రోహం చేయడం ఇష్టంలేకా ఉద్యోగానికి స్వచ్ఛందంగా రాజీనామా యిస్తున్నట్టు ఉద్రేకపూరితంగా రాయి!"

చిత్తరంజన్ ఆవేశంతో శివరాం వైపు చూశాడు. అతని కళ్ళు మెరుస్తున్నాయి. "థాంక్యూ ఫర్ ది అడ్వైజ్ సార్!"

"ఫర్గెటిట్! రేపొద్దున పదవిలోంచీ పీకిపారేసి, తన్ని తగిలేస్తారని నికరంగా తెలిసిన మంత్రి ముందు చూపుతో ఇవాళే రాసి, పత్రికలకి కూడా విడుదల

చేసిన 'రాజకీయ రాజీనామా' పత్రంలా నీ రాజీనామా వుండాలి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

మొట్టమొదటిసారిగా చిత్తరంజన్ చిరునవ్వు నవ్వాడు. వణకడం మానేసిన చేత్తో రాయడం ప్రారంభించాడు. శివరాం అతన్నే తదేకంగా చూస్తూ సిగరెట్ వెలిగించాడు.

• • •

చిత్తరంజన్ రాసినదాన్ని శివరాం జాగ్రత్తగా చదివాడు. చివర అతను రాసిన రాజీనామా ఉత్తరాన్ని చదువుతూ చిరునవ్వుతో తల పంకించాడు. మెల్లిగా తలెత్తి అతనివేపు చూశాడు. తను రాసిన ఆన్సర్ పేపర్లని తన సమక్షంలోనే దిద్దుతున్న కోపిష్టి టీచర్ని చూస్తున్న విద్యార్థిలా చూస్తున్నాడు చిత్తరంజన్.

"చిత్తరంజన్, అంతా బాగానే రాశావ్. అయితే రెండు విషయాలు మరిచిపోయావ్...." శివరాం సాలోచనగా అన్నాడు.

చిత్తరంజన్ ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఎక్స్పయిర్డు మందులకు కొత్త స్టాకు అందించే వ్యాపారం, ఏయే ఊళ్ళలో ఏయే షాపుల్లో ఏయే, పేర్లతో చేశావో రాయలేదు. రెండు: నువ్వు సప్లై చేసిన ఫ్రెష్ స్టాకు అమ్మకం జరగకుండా ఆపాలన్న సూచనని నువ్వు వ్యక్తం చేయలేదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

చిత్తరంజన్ నాలుక కొరుక్కుంటూ చూశాడు. "ఎక్కడేనా ఇరికించమంటారా?"

"వద్దు. వేరే కాగితాల్లో షాపుల లిస్టు రాయి. తతిమ్మాది నేను చేసుకుంటా..." శివరాం ఆగి అతన్ని అదోలా చూశాడు. "చిత్తరంజన్, ఈ వ్యాపారం

నువ్వొక్కడివే చేస్తున్నావా? యింకా యెవరేనా నీ లాంటివాళ్ళున్నారా?"

"లేరు...."

"వాట్?" శివరాం ఆశ్చర్యంగా అడిగాడు.

"నన్ను నమ్మండి. అబద్ధం ఆడే అవసరం నాకు ఇప్పుడు లేదు! ముందట ఆంధ్రా, కర్ణాటకా, తమిళ నాడూ, కేరళా చూడమన్నారు. మా కంపెనీ—వి మాన్—కామన్ హెల్తు కంపెనీ బిజినెస్ నార్త్ ఇండి యాకి వ్యాపించలేదు "

"ఆల్ రైట్....దక్షిణాదిలో ఏయే రాష్ట్రాలు ముగిం చావ్?" శివరాం అడ్డొస్తూ అడిగాడు.

"నా షెడ్యూల్ ప్రకారం ఆంధ్రా ఏరియా ఈ నెలాఖరులోగా పూర్తవుతుంది. ఇంక ఒక జిల్లా మాత్రం వుంది. తరవాత కర్నాటక...."

"మన రాష్ట్రం ఇంకా దాటలేదంటావ్?" శివరాం నవ్వుతూ అన్నాడు.

"యస్సర్...."

"రైట్....మిగతా రాష్ట్రాల సంగతి రేపు సాయం త్రానికల్లా మా పద్ధతుల్లో మేం కనుక్కుంటాం.... కమాన్....లిస్టు రాయి!" శివరాం హెచ్చరిస్తూ సిగరెట్ వెలిగించాడు. చిత్తరంజన్ బ్యాగ్‌లోంచి డైరీ పైకి లాగాడు....

రెండోవిడత చిత్తరంజన్ అందించిన కాగితాల్ని తో సారి చూసి, శివరాం మంచంమీంచి లేచాడు. చిత్త రంజన్ పక్కనే సోఫామీదున్న లెదర్ బాగ్ తెరిచి, అతనిచ్చిన కాయితా లన్నింటినీ అందులో పడేశాడు. ఆశ్చర్యంగా తననే చూస్తున్న చిత్తరంజన్ని చిరు

నవ్వుతో చూశాడు.

"చిత్తరంజన్, క్వీన్స్ లాడ్జి గదిలో నువ్వు స్టార్ట్ చేసిన సరుకునీ, నీ లెదర్ బాగ్‌నీ నేను స్వాధీనం చేసుకుం టున్నాను...."

"నాకు.... తెలీ బాగ్.... లేదు.... నా పర్సు...." చిత్తరంజన్ దీనంగా అన్నాడు.

"ఈ బాగ్‌తో ఇంక నీకు పని వుండదు. నీ పర్సుతో నాకు పనిలేదు! మంచం కిందున్న సూట్ కేసులో శాంపిల్స్ గట్రా వున్నాయా?"

"లేవు.... అన్నీ లాడ్జిగదిలో...."

"గుడ్!" అంటూ శివరాం లెదర్ బాగ్ కంపార్టు మెంటులోంచీ తీసిన పర్సుని చిత్తరంజన్ పక్కనే సోఫా మీద పడేలా విసిరాడు. మంచంమీద కూచుని టెలి ఫోను రిసీవర్ అందుకున్నాడు. హోటల్ ఆపరేటర్ నిద్రమత్తు కంఠం అతని చెవిలో సన్నగా పలికింది. తనకి కావాల్సిన నంబరు చెప్పి శివరాం సిగరెట్ వెలిగించాడు. అయోమయంగా తనవేపు చూస్తూ చేతులు నలుపుకుం టున్న చిత్తరంజన్ని చిరునవ్వుతో చూశాడు. తన చిరు నవ్వుకు అర్థం తెలీని అతని నిస్సహాయతని శివరాం తృప్తి కరంగా గమనించాడు. అతని చెవిలో ఫోన్ రింగవుతున్న శబ్దం వినపడింది.

తన ప్లాను వికరాలేమీ తెలీని అత, వొంటరిగా అక్క డెక్కడో వున్న అత కునికిపాట్లు పడుతోన్నట్టుంది. రెండు క్షణాల్లో ఆమె కంఠం అతని చెవిలో ప్రతిధ్వనిం చింది.

"కమీషనర్ కపాలి స్పీకింగ్..." ఆమెకి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా శివరాం ప్రారంభించాడు. "ఇన్స

పెక్టర్ కపూర్, సజ్జెట్ మనం అనుకున్నట్టే అప్రూవర్ గా మారిపోయాడు. పొద్దుటే ఆరుగంటలకి అతను హోటల్లోంచీ ఇవతలకి నడుస్తాడు. అతన్ని ఫాలో చేయండి...."

"........."

"చెప్తాను: న్యూస్ పేపర్ని పొడుగ్గా చుట్టి కత్తిలా పట్టుకుని చిత్తరంజన్ సరిగ్గా ఆరుగంటలకు ఇవతలికి నడుస్తాడు. ఆ క్షణంనుంచీ అతన్ని ఫాలో చేయాలి; మళ్ళీ నేను ఉత్తరువు ఇచ్చేదాకా! ఏంచెయ్యాలో, యెక్కడికి వెళ్ళాలో అతనికి నేను చెప్తాను. అతను యెక్కడికి వెళ్ళినా సరే, ఆరితేరిన మన డిటెక్టివ్స్ అతన్ని నీడలా వెంటాడాలి. మన డిపార్టుమెంటు కళ్ళనుంచీ దూరం అవడం అతనికి ప్రమాదం. అతనికి ప్రమాదం సంభవిస్తే, అసలు దోషులు తప్పించుకుంటారు...."

"........."

"ఖచ్చితంగా! అతను అమెరికా వెళ్ళినా సరే! అయితే నా సూచనల్ని చిత్తరంజన్ నిర్లక్ష్యం చేయడన్న నమ్మకం నాకుంది! బైదిబై క్వీన్స్ లాడ్జిగదికి తాళంవేసి సీల్ చేశారా?"

"........."

"వెరీగుడ్! ఇరవై నాలుగ్గంటలూ ఆ గదిని మనవాళ్ళు కాపలా కాయాలి. ఆ గదికోసం ఎవరు వచ్చినా ఆరా తీయాలి...లాడ్జి వోనరు నోరు విప్పకుండా కంట్రోల్ చేయాలి...."

"......"

"పూర్తిగా! రైట్. ఉంటాను. పొద్దుటే ఆ సాంపిల్స్ని ఢిల్లీ పంపుదాం. గుడ్ నైట్!" రిసీవర్ని పడేసి

శివరాం చిత్తరంజన్ని నవ్వుతూ చూశాడు.

చిత్తరంజన్ వెర్రివాడిలా చూశాడు. "సార్.... మీరు చెప్పినట్టు....అన్నీ రాసిచ్చాను. మళ్ళీ....నన్ను ఫాలో...."

"గుడ్! నా మాటల్ని బాగా ఫాలో అయ్యావు. ఆలస్యం చేయకుండా మా దర్యాప్తు ప్రారంభిస్తాం. సంగతి తెలీగానే కంపెనీ నిన్ను కల్సుకోడానికి ప్రయత్నిస్తుంది. తన నేరానికి ప్రత్యక్ష సాక్షి అయిన నిన్ను తుదముట్టించే ప్రయత్నం చేస్తుంది. అందుకే మా డిటెక్టివ్లు అనుక్షణం నిన్ను ఫాలో అవుతారు. వాళ్ళే నీకు సెక్యూరిటీ. అఫ్కోర్స్....వాళ్ళు నీకు అవుపించరు...." శివరాం ఆగాడు.

"అయితే....నన్నేం చేయమంటారు?" చిత్తరంజన్ దీనంగా అడిగాడు.

"రైలుబండికి పట్టాలు వేసినట్టు, నీ మార్గం నేను నిర్ణయిస్తాను. నేను నడకమన్నట్టు నువ్వు నడవాలి. పట్టాలు తప్పితే ప్రమాదం!" శివరాం గంభీరంగా అన్నాడు.

చిత్తరంజన్ ఉక్కిరి బిక్కిరవుతూ చూశాడు. భయం, ఆత్రుతా అతని మొహంమీద చెమటపూసలుగా ప్రత్యక్షమవుతున్నాయి. శివరాం అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు.

"పొద్దుటే సరిగ్గా ఆరుగంటలకు ఈ హోటల్లోంచీ వెళ్ళిపో. న్యూస్ పేపర్ని అడ్డంగా, పొడుగ్గా కత్తిలా చుట్టు. దాన్నో చేతిలో పట్టుకో. తిన్నగా స్టేషను కెళ్ళు. ట్రెయిన్ తయారుగా వుంటుంది. తిరుపతికి టికెట్టు కొనుక్కో. తిరుపతిలో దిగేయ్. నడుస్తూ ఏడుకొండలూ యెక్కి తిరుమల చేరుకో. అక్కడ కళ్యాణకట్టలో

గుండు గీయించుకో. దమ్మిడీ ఖర్చు అవకుండా నీకు అక్కడ గుండు తయారవుతుంది...."

"సార్....ప్లీస్...." చిత్తరంజన్ కంగారుగా అడ్డు తగిలాడు.

"అడ్డు చెప్పకు!" శివరామ్ కంఠం మిలిటరీ ఆఫీసరు కంఠంలా నిర్దాక్షిణ్యంగా ధ్వనించింది. "తరువాత, పాతికరూపాయల టికెట్టూ అదీ కొనకుండా 'జనతా ఖ్యూ'లో గుల్లో కెళ్ళు. ఏదో యాత్రికుడి రూపంలో మా డిపార్టుమెంటు నిన్ను నీడలా వెంటాడుతూనే వుంటుంది. రెండో రోజు కిందికి, తిరుపతికి దిగేయ్. కపిల తీర్థం వెళ్ళు. అక్కడ చాలామంది అయ్యప్ప భక్తులు పోగవుంటారు...."

"ప్లీస్...."

"వేంకటేశ్వర స్వస్థానమైన తిరుపతిలో చాలామంది అయ్యప్ప భక్తులూ, దీక్ష యిచ్చే 'గురుస్వాములూ' వుంటారు. గురువుని పట్టుకో. అయ్యప్పదీక్ష తీసుకో. ఏదో గుంపుతో కలిసి శబరిమలై యాత్ర వెళ్ళిపో. మకర జ్యోతి దర్శనం అయ్యేదాకా అక్కడే వుండిపో. ఆ "జ్యోతి" రోజు నీవు ఏం చేయాలో తెలియజేయబడుతుంది..."

"సార్.... నేను....నన్ను...." చిత్తరంజన్ తడబడుతూ అడ్డుతగిలాడు.

తను చెప్పిందంతా నమ్మలేకా, నమ్మకుండా వుండలేకా సతమతమైపోతున్న చిత్తరంజన్ మొహంలోకి శివరాం తీక్షణంగా చూశాడు. "చిత్తరంజన్, నీ క్షేమం కోసం నిన్ను రకరకాల భక్తుల్లో కలిసిపొమ్మంటున్నా. నా సూచనల్ని ఏమాత్రం నిర్లక్ష్యం చేసినా, మరుక్షణం

నాకు తెలిసిపోతుంది. నిన్ను అప్రూవర్ హోదానుంచీ అపరాధి హోదాకు డిమోట్ చేస్తాం!"

"సార్....ప్లీస్....మరో మార్గం చెప్పండి!" చిత్తరంజన్ ప్రాధేయపడ్డాడు.

శివరాం తటాలున మంచంమీంచీ లేచాడు. దగ్గరగా నడిచి, అతనిముందు ఠీవిగా నిలబడ్డాడు. తలకొద్దిగా కిందికి వాల్చి అతని మొహంలోకి తదేకంగా రెప్ప వేయకుండా చూశాడు.

"చిత్తరంజన్, పట్టాతప్పితే ప్రమాదం!" అన్నాడతను క్లుప్తంగా.

## 7

హైదరాబాద్.

టాక్సీ ఆగింది. శివరాం దిగాడు. అతని చేతిలోంచీ ఇరవై రూపాయలనోటు డ్రైవర్ వొళ్ళో పడింది. శివరాం నిర్లక్ష్యంగా వెనక్కి తిరిగాడు. సిగరెట్ పీకని కిందపడేసి బూటుకాలితో నొక్కుతూ యెదురుగా వున్న తెల్లటి బిల్డింగ్ని చిరునవ్వుతో చూశాడు. కామన్ హెల్తు ఫార్మస్యూటికల్స్—అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్....

శివరాం పోర్టికోలోంచీ వరండా పైకి యెక్కాడు. రిసెప్షన్ కౌంటర్ వెనక కూచున్న యువతి అతన్ని చూడగానే లేచినిలబడింది. శివరాం ఆమెవైపు నడిచాడు. ఎర్రగా, బొద్దుగా ఆరోగ్యంగా అవుపిస్తున్న ఆకారం. రిసెప్షనిస్ట్ 'కామన్ హెల్తు' తయారు చేస్తున్న టానిక్స్ కాకుండా ఇతర కంపెనీల టానిక్కూ ఆమె వాడుతూ వుండివుండాలి! శివరాం నవ్వుతూ ఆమె ముందు ఆగాడు.

"యస్?" అందామె చిలకలా.

"మిస్, ప్రొప్రయిటర్ గార్ని కల్సుకోవాలి........"
చేతిలోని బ్రీఫ్ కేస్ ని కౌంటర్ మీద పెడుతూ అన్నాడు శివరాం.

"మీరు...."

"సౌత్ ఇండియన్ ఫార్మస్యూటికల్స్ వెల్ఫేర్ సొసైటీనుంచీ వస్తున్నా."

రిసెప్షనిస్టు కళ్ళు చిట్లించింది. "అలాంటి సొసైటీ వున్నట్టు వినలేదు ...."

"వినిపించడానికే వచ్చాను!" శివరాం నవ్వుతూ అన్నాడు.

ఆమె మాట్లాడకుండా అతనికి గోడవారగా వున్న సోఫా చూపించింది. టెలిఫోన్ రిసీవర్ని అందుకుంది. ఆమె మాటలు విననట్టు నటిస్తూ శివరాం సిగరెట్ వెలిగించాడు; కిటికీవైపు తిరిగి.

"ప్రొప్రయిటర్ గారు బిజీగా వున్నారు. మీరు వచ్చినపని చెప్తే, ఆలోచించి, ఈ వారం తర్వాత మీకు అపాయింట్ మెంట్ ఇవ్వడానికి ప్రయత్నిస్తారు...." అందామె రిసీవర్ని పెట్టేసి.

శివరాం మెల్లిగా ఆమెవైపు తిరిగాడు. నవ్వుతూ ఆమె సుందరటి మొహంలోకి చూశాడు. "వెల్ఫేర్ సొసైటీకి యే చందానో అడగడానికి నేను వచ్చి వుంటానని మీ ప్రొప్రయిటర్ అనుకున్నాడు. అవునా?"

ఆమె పెదవులు చిరునవ్వులో కదిలాయి. ఔను అని ఆమె కళ్ళు అతనికి చెప్తున్నాయి.

శివరాం కటాలున కౌంటర్ మీదున్న బ్రీఫ్ కేసుని అందుకున్నాడు. పక్కకి తిరిగి మెట్లవైపు జోరుగా అడుగులేశాడు.

"మిస్టర్!"

శివరాం వెనక్కి తిరిగి రిసెప్షనిస్టువైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ప్రొప్రయిటర్ ఇప్పుడు యెవర్నీ చూడరు...."

"ఫరవాలేదు. నేనే అతన్ని చూస్తాను!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"అదికాదు...."

శివరాం ఆమెని పూర్తిగా మరిచిపోయి చకచకా మెట్లెక్కసాగాడు. రెండునిమిషాల్లో రెండో అంతస్థులో 'ప్రొప్రయిటర్' బోర్డున్న గదిముందు ఆగాడు. సిగరెట్‌ని పెదాలమధ్య ఇరికించి, హాండిల్ని తిప్పి, తలుపుని బలంగా లోపలికి తోశాడు. క్షణంలో లోపలికి దూరి తలుపుని వదిలేశాడు. చిన్నగా చప్పుడుచేస్తూ తలుపుమూసుకుంది.

వెడల్పాటి టేబుల్ ముందూ, వెనకా ఎదురెదురుగా కూచున్న ఇద్దరు వ్యక్తులు తలలుతిప్పి చూస్తున్నారు. ఖాకీ యూనిఫామ్‌లో వున్న వ్యక్తి ఫ్లాస్కులోంచీ టీ వొంచడం మానేసి తలతిప్పి ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఎవరు?" బొంగురు కంఠంతో విసుగ్గా అడిగిన వ్యక్తిని శివరాం తదేకంగా చూశాడు. లావుపాటి విగ్రహం. వెడల్పాటి మొహం. గోల్డ్‌రిమ్డ్ కళ్ళద్దాలు. సన్నటి మీసాలు. తలమీద తెల్లటి బొచ్చుటోపీ.

శివరాం నెమ్మదిగా పెదాలమధ్యనుంచీ సిగరెట్‌ని ఇవతలికి లాగాడు. తెల్లటి పళ్ళని అతనికి చూపిస్తూ చిరునవ్వు నవ్వాడు. "వెల్‌ఫేర్ సొసైటీ...."

"ఇందాకే చెప్పాను, వచ్చిన పనేమిటో చెప్పి వెళ్తే

వచ్చేవారం...."

"నా క్యాలెండర్లో వెళ్ళేవారాలేగానీ, వచ్చేవారా లుండవ్!" శివరాం అడుక్కిగిలాడు.

"వాటీస్ దిస్? డోంట్ డిస్టర్బ్!"

"ఈక్షణంలో నాచేత డిస్టర్బ చేయబడకపోతే, జీవితాంతం విచారిస్తావ్, వామన్రావ్!" శివరాం ఏక వచనంలో అన్నాడు.

వామనరావు, లక్షలాది రూపాయల విలువ కలిగిన కామన్ హెల్తు ఫార్మస్యూటికల్స్ సోల్ ప్రొప్రయిటర్ నిప్పులు కక్కుతూ చూశాడు. అతని మొహం ఎర్రగా కందిపోయింది.

"యూ...."

"నీ శిష్యుడు జోగీశ్వర్, రత్నకుమార్, తాండ వేశ్వర్—లేకపోతే చిత్తరంజన్ అపాయంలో ఇరు క్కున్నాడు, ఆ విషయం నీకు చెప్పమన్నాడు. ఇప్పుడు చెప్పు: వారంరోజుల తర్వాతే, వీలుంటే నే అపాయింట్ మెంట్ ఇస్తావా?" అన్నాడు శివరాం.

వామనరావు ఉలిక్కిపడలేదు. అతని కనుబొమలు కొద్దిగా కదిలాయి. టేబుల్ మీదున్న అతని చేతులు విడిపోయి మళ్ళీ కలుసుకున్నాయి.

"ఏమిటీ నాటకం?" తగ్గుస్వరంతో బెదిరింపుగా అన్నాడతను.

శివరాం ఆఖరి దమ్ములాగి సిగరెట్ని నిర్లక్ష్యంగా గది మూలకి విసిరాడు. కోపంగా తనవైపు చూసి తివాచీ మీదే పడిన సిగరెట్ పీకను వెంటాడిన కాకీ వ్యక్తిని చిరునవ్వుతో చూశాడు. చూపుల్ని మెల్లిగా వామన రావు వైపు తిప్పాడు.

"చిరంజీవ్ చేత నువ్వాడిస్తున్న బహుపాత్రాభినయంలో కూడిన నాటకం గురించి సమీక్షించే మరో నాటకం! ఆ సమీక్షని నువ్వొక్కడివే వింటే నీకు మంచిది. నీ యెదురుగా కూచున్న ఆ పెద్దమనిషి సమక్షంలో వింటే లోకానికి మంచిది. నీకు మంచిచేసుకుంటావో, లోకానికి మంచిచేసుకుంటావో తేల్చుకో!" శివరాం నవ్వుతూ అన్నాడు.

క్షణకాలం వామనరావు మౌనంగా వుండిపోయాడు. ఇంతసేపూ శివరాం కళ్ళని లోతుగా పరీక్షిస్తున్న అతని కళ్ళు యెదురుగా కూచున్న పెద్దమనిషివైపు తిరిగాయి.

"ధర్మారావుగారూ, తరవాత కలుసుకుందాం.... ఫోన్ చేస్తాను..." వామనరావు మెల్లిగా అన్నాడు.

క్షణంసేపు అనుమానించి ధర్మారావు పైకిలేచాడు. మౌనంగా గుమ్మంవైపు నడిచాడు. అతని కళ్ళు ఉగ్రంగా శివరాంవైపే చూస్తున్నాయి. శివరాం అతన్ని చిరునవ్వుతో చూశాడు. ఎడంగా జరిగి తలుపు తెరిచి కిందికి వొంగుతూ దయచేయమన్నట్టు అతనికి చెయ్యి చూపించాడు. బుసకొడ్తూ ధర్మారావు నిష్క్రమించాడు.

తలుపుకి జార్లాబడి శివరాం సిగరెట్ వెలిగించాడు! తనకి మేలుచేసుకోడానికే నిశ్చయించుకున్న వామనరావుని చిరునవ్వుతో చూశాడు.

"డోంట్ స్మోక్!" వామనరావు హుంకరించాడు.

"సారీ. ఈ క్షణంనుంచీ నీకు నచ్చని పనులే చేస్తూ వుంటాను. అయినా నువ్వు నచ్చినట్టు భరిస్తావు!" శివరాం నవ్వుతూ అతని ముందుకు నడిచాడు. ఇందాకా ధర్మరాజు కూచుని వేడెక్కించిన కుర్చీలో కూచుని కాలుమీద కాలేసుకున్నాడు.

"సౌత్ ఇండియన్ ఫార్మస్యూటికల్స్ వెల్ఫేర్ సొసైటీ అంటూ ఏవో కథలు చెప్పావ్! నిజం చెప్పు: ఎవర్నువ్వు?" వామనరావు ప్రశ్నించాడు.

శివరాం అతన్ని నవ్వుతూ చూశాడు. "అయామ్ శివరాం...."

"ఎందుకొచ్చావ్?"

"పెద్ద ప్రశ్నే వేశావ్. ఎందుకొచ్చానో ఒక ముక్కలో చెప్పగలను. నీకు అర్థంకాదు. వెనకటికి యెవరో ఋషి, ఎవరో రాజుకి పురాణం చెప్పినట్టు అంతా వివరంగా చెప్తాను. చెప్పాల్సింది చెప్పాక, నేను ఎందుకు వచ్చానో నీకు శుభ్రంగా అర్థమవుతుంది!" శివరాం నవ్వుతూ అన్నాడు.

వామనరావు కళ్ళద్దాలగుండా నిదానించి చూస్తూ వుండిపోయాడు. తన ఆశ్చర్యాన్ని, కంగారునీ బైట పడకుండా దాచుకుంటూ వ్యవహరించడం వామనరావుకి బాగా అలవాటైందని శివరాం గుర్తించాడు. నివురుగప్పిన నిప్పులా, నీళ్ళలో మునిగిన రాయిలా వుండే ఇలాంటి వ్యక్తులు అంత సులభంగా బయటికి లొంగరు. అయితే, ఆ నిప్పుని ఆర్పేసి, రాయిని దుమ్ము దుమ్ముచేసే శక్తి ప్రస్తుతం తన దగ్గరుంది.

"నువ్వు చెప్పేదేమిటో నేను వినాలంటే, ఒక షరతుని నువ్వు పాటించాలి...." వామనరావు శివరాం కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

శివరామ్ కనుబొమల్ని పైకి లేపాడు. "ఏమిటది....?"

"నన్ను నువ్వు నువ్వు అంటున్నావ్. 'మీరు' అని

గౌరవించాలి!"

శివరాం పగలబడి నవ్వాడు. రిటాలున నవ్వు ఆపేసి అతని కళ్ళల్లోకి చూశాడు. "మీరు అని సంబోధించ డానికి తగిన వ్యక్తితో నే నెప్పుడూ వ్యవహారం జరపను! నాచేత గౌరవింపబడే అర్హత నీలో లేదు వామన్రావ్!"

వామనరావు ఆగ్రహంతో ఉక్కిరి బిక్కిరవుతూ చూశాడు. కోపం పొట్లగింత బుసలా అతనిలోంచీ బయటపడింది. "ఆల్ రైట్! ఏమిటి నీ వ్యవహారం?"

"నీ శిష్యుడు చిత్తరంజన్ జోగీశ్వర్ పేరుతో 'శుక్రుత్ జోగీ' ఏరియా ఇన్స్పెక్టర్ గా, రత్నకుమార్ పేరుతో దక్షిణ్ ఫార్మస్యూటికల్స్ కాత్రీగా, తాండ వేశ్వర్ పేరుతో హీలర్ ఆఫీసరుగా డ్రామా ఆడు తున్నాడు. అది...."

"అది నాకు సంబంధించిన వ్యవహారం కాదు...." వామనరావు ఆగి, అప్పుడే గుర్తుకొచ్చినవాడిలా బంట్రోతు వేపు చూశాడు. "గరుడయ్యా, వెళ్ళి నీ పని చూసుకో ..." అన్నాడు.

గరుడయ్య తలుపు తెరుచుకొని వెళ్ళిపోయాడు.

"శుక్రుత్ జోగీ వాళ్ళ తయారీ కుడోలిన్ కీ, దక్షిణ్ వారి నుగో ఖరీదయిన ఇంజెక్షన్ కీ, హీలర్ వారి మరో ఇంజెక్షన్ కీ — కాలం తీరిపోయినవాటికి 'కొత్తవి సప్లై చేస్తున్నాడు నీ శిష్యుడు. నీ కంపెనీ మందులు కాని వాటిని నీ శిష్యుడు ఎందుకు రీప్లేస్ చేస్తున్నాడు?" శివ రాం ప్రశ్నించాడు.

"చిత్తరంజన్ అలాంటి పని చేయడు. ఒకవేళ చేసి వుంటే దానికి కారణం అతన్నే అడుగు!" వామనరావు

పుంకరించాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "సాధారణంగా, శిష్యుడితో మాట్లాడకుండా ఎవరూ గురువుదగ్గరికి రారు!"

"ఆల్ రైట్! ఎవడో శివరాముడో, చెంచురాముడో అడిగే పనికిమాలిన ప్రశ్నలకి నేనెందుకు సమాధానం యివ్వాలి? యింతికీ యెవర్నువ్వు? హూ ది హెల్ ఆర్ యూ?"

శివరాం కుర్చీలో ముందుకు వాలాడు. వామనరావు కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "వామనరావ్, నువ్వు ఆర్ ఏ డబ్ల్యూ గురించి విన్నావా?"

వామనరావు అర్థంకానట్టు చూశాడు.

"రీసెర్చ్ అండ్ అనాలిసిస్ వింగ్. గవర్నమెంట్ అఫ్ ఇండియా, న్యూఢిల్లీ. పారసిటమాల్ మాత్రలంటూ నీ కంపెనీ మార్కెట్లోకి తోసిన మైదాపిండి మాత్రల్ని, "సి" విటమిన్ పేరుతో పాపులన్నీ నింపేసిన శనగపిండి మాత్రల్ని ఇంకా చాలా కంపెనీలు తయారుచేసిన చాలా చాలా మాత్రల్ని అనలైజ్ చేసి, చెత్తాచెదారంగా ఆర్.ఏ. డబ్ల్యూ నిర్ధారించింది...." వామనరావు కళ్ళని క్షణకాలం పారల్లా కప్పిన భావాన్ని చూస్తూ శివరాం ఆపేశాడు.

"నువ్వు.... మీరు.... ఆర్. ఏ. డబ్ల్యూ తాలూకా?" అప్రయత్నంగా వామనరావు అడిగాడు.

తను వూహించిన ప్రశ్నని ఖచ్చితంగా అడిగిన అతన్ని శివరాం చిరునవ్వుతో చూశాడు. "నేను నా తాలూకే!"

"వాట్ డూ యూ మీన్?" వామనరావు కళ్ళు చిట్లించాడు.

"అనుకున్నప్పుడు అవసరమయిన విషయాన్ని ఆర్.ఏ. డబ్ల్యూకీ, సిబిఐకీ అందజేసే ఫ్రీలాన్స్ మానవుణ్ని!" శివరాం నవ్వుతూ వివరించాడు. తన నవ్వు వామనరావు తలలో డప్పులు మోగిస్తుందని అతనికి తెలుసు.

వామనరావు తటాలున కుర్చీలోంచి లేచాడు. లావుగా, ఎత్తుగా వున్న వామనరావుని శివరాం రెప్ప వేయకుండా చూశాడు.

"గెటౌట్!" వామనరావు గర్జించాడు.

"ఇఫ్ ఐ గెటౌట్ అఫ్ హియర్, యూ విల్ ఎంటర్ ది జైల్!"

శివరాం కంఠం ఖంగుమంది. అతని చెయ్యి బ్రీఫ్ కేస్‌ని టేబుల్ మీద పడేసింది. వామనరావు తేరుకుని మాట్లాడేలోగా బ్రీఫ్ కేసు తెరిచి, మడత పెట్టిన కాగితాల్ని అతని ముందుకు విసిరాడు.

"సీరియల్ నవలలా, నీ శిష్యుడు అంతా వివరంగా రాశాడు. ఈసారి నోరు తెరిచే ముందు ఆ ఫోటో స్టాట్ కాపీల్ని చదువుకో...!" అంటూ శివరామ్ పైకి లేచాడు.

అప్రయత్నంగా వామనరావు తన ముందున్న కాగితాల్ని అందుకుని విడదీశాడు. అప్రయత్నంగా చదవడం ప్రారంభించాడు. అప్రయత్నంగా కుర్చీలో కూలబడ్డాడు. ఊపిరి బిగబట్టి చదువుకుపోతున్న అతన్ని తృప్తికరంగా చూస్తూ శివరామ్ గోడవారగా వున్న చిన్న టేబుల్ దగ్గరగా నడిచాడు. ఫ్లాస్కులో గరుడయ్య సిద్ధంగా వుంచిన టీని కప్పులోకి పోసుకున్నాడు.

* * *

తన యెదురుగా కూచుని శాంతిమయంగా సిగరెట్

పిలుస్తున్న శివరాం మొహంలోకి వామనరావు అయోమయంగా చూశాడు. చిత్తరంజన్ చేతిరాత అతని నుదురుమీద గీతల్ని సృష్టించింది.

"ఏమిటిదంతా....?" వామనరావు కంఠంలో ఇందాకటి దర్పం, ధైర్యంలేవు.

"నీ కంపెనీ మందులకి కాకుండా ఇతర్ల వాటికి కొత్త ప్రాక్స్ అందించే యేర్పాటు ఎందుకు చేశావ్?" శివరాం అతని ప్రశ్నని వినిపించుకోనట్టు ప్రశ్నించాడు.

"నేను చేయలేదు! నీ దబాయింపులకి బెదిరిపోయి ఆ చిత్తరంజన్ గాడు ఏదో చెత్తంతా రాశాడు!" వామనరావు మొండిగా అన్నాడు.

శివరాం చిన్నగా నవ్వాడు. "నువ్వు అలా బుకాయిస్తావని నాకు తెలుసు; చిత్తరంజన్ కీ తెలుసు. అందుకే శ్రీ నుంచీ శుభందాకా నీ 'మందుల నాటకం' అతని చేత రాయించాను. నీకేం సంబంధంలేనప్పుడు, నీ దగ్గరకు రావడం శుద్ధదండగనిపిస్తోంది. బిగ్గెస్టు మెడికల్ స్కాండల్లో నీ కంపెనీ ఇరుక్కోడం, లైసెన్స్ రద్దు కావడం, నువ్వు జైల్లో కూచుని ఆత్మకథ రాసుకోడం వగైరా నీకు నచ్చవనీ, దీన్నంతా ఆపడానికి నువ్వు ప్రయత్నిస్తావనీ వచ్చాను...." అంటూ ఆగి అతను పైకి లేచాడు.

బెల్లంకొట్టిన రాయిలా కూచున్న వామనరావు గాజు బిళ్ళల్లా వున్న తన కళ్ళని శివరాంమీదే నిలిపాడు.

"గుడ్ బై, వామన్రావ్...శుక్రుల్ జోగీనీ, దక్షిణ్ నీ, హీలర్ నీ ఒకేచోట, ఒకేసారి సమావేశపరచి దీన్నంతా వాళ్ళకే ఇస్తాను!" శివరాం బ్రీఫ్ కేస్ అందుకుని గిరుక్కున వెనక్కి తిరిగాడు.

రెండే రెండు అడుగులు వేసిన అతన్ని వామనరావు కంఠం ఆపింది.

"ఒక్క క్షణం ..."

శివరాం ఆగాడు. తలతిప్పి భుజంమీదుగా అతన్ని తృణీకారంగా చూశాడు. "నాతో ఒక్క క్షణం చాలా చాలా ఖరీదైంది, వామన్రావ్!"

"కూర్చో. అర్థమయ్యేలా మాట్లాడుకుందాం...."

శివరాం వెనుదిరిగి కుర్చీలో కూచున్నాడు. ఇంకా మేకపోతు గాంభీర్యంతోనే వ్యవహరిస్తున్న వామనరావుని నిర్లక్ష్యంగా చూశాడు.

"శివరాం..."

"ఆట్ యువర్ సర్వీస్ వామన్రావ్!" శివరాం అడ్డొస్తూ అన్నాడు వెటకారంగా.

వెటకారాన్ని నిర్లక్ష్యం చేస్తూ వామనరావు గబగబా అన్నాడు. "శివరాం, నేను చేయించినా, తనే స్వబుద్ధితో చేసినా, చిత్తరంజన్ మంచిపనే చేశాడు...."

"ఐసీ....ఎలాగో?"

"కాలంతీరిపోయి, దాదాపు విషంగా రూపొందిన మందులకి బదులుగా అతను సరికొత్త సరుకు సప్లై చేశాడు. అది మంచి పనే!"

"అంచెలంచెలుగా నువ్వు నిన్ను డిఫెండ్ చేసుకుంటున్నావ్. కానీ లాభంలేదు...."

"ఏమిటి నీ అర్థం?" వామనరావు రోషంగా అడ్డు తగిలాడు.

"నా అర్థం నీకు అనర్థం వామన్రావ్!"

"ఏమిటి నీ బోడి అర్థం?" వామనరావు హుంకరించాడు.

శివరాం అతని కళ్ళల్లోకి తదేకంగా చూశాడు. "కాలంతీరిన, ఖరీదైన, లోకానికి యెంతో అవసరమైన ఇంజెక్షన్స్‌కి కొత్తసప్లై చేయడం తప్పుకాదు. అయితే ఆ మందులు నీ కంపెనీ తయారుచేసినవే అయ్యుండాలి! కానీ నువ్వు మాస్టర్ ప్లాన్‌తో ఇతర్ల వాటికి సప్లై చేస్తున్నావ్...."

"నాన్ సెన్స్!" వామనరావు అడ్డుతగిలాడు. "దాని వల్ల నాకుగానీ, చిత్తరంజన్‌కిగానీ లాభంలేదు. ఎక్స్‌పయిర్డ్ మెడిసిన్స్‌కి కొత్తవి ఇచ్చినా, రెండింటి ధరలో తేడా వుండదు. రెండు రకాల రేటూ ఒకటే! అంటే ఈమాలిన నేరం యెవరికీ లాభాన్నివ్వదు. లాభంలేని నేరం చిత్తరంజన్ యెందుకు చేస్తాడు? నేనెందుకు చేయిస్తాను?"

శివరాం అతని కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు. "చాలా చాలా తెలివైన ప్రశ్న వేశావ్! ఈ ప్రశ్నే నిన్ను కవచంలా కాపాడుతుందనీ ఆశించావ్! మరో కంపెనీ మందులకి కొత్త స్టాకు ఇచ్చే వ్యక్తికి పైసాకూడా గిట్టుబాటు అవదని అందరికీ తెలుసు. అలాంటి పిచ్చిపని కామన్‌హెల్తు వామనరావుగారు చేశారంటే ఆ కంపెనీ వ్యక్తులే నమ్మరు! కానీ వామన్రావ్, గిట్టుబాటుకోసం, ఆర్థికమైన లాభంకోసం నువ్వు ఈ నేరం చేయించడం లేదని నాకు తెలుసు!"

"నాన్‌సెన్స్...."

"షటప్!" శివరాం అరుపు అతన్ని కమ్చీదెబ్బలా తాకింది. ఎగతాళిగా నవ్వుతూ అతను వామనరావు మొహంలోకి చూశాడు.

"కాలంతీరిన వాటికి నువ్వు సప్లై చేయిస్తోంది ఫ్రెష్

స్టాక్ కాదు!"

ఒక్కసారి ఉలిక్కిపడి వామనరావు చిటెకెలో సర్దుకున్నాడు. "నీకు పిచ్చిపట్టింది! ఇందాకా గ్రిఫిన్ స్టాక్ అన్నావు. ఇప్పుడు...."

"నో మై యామిగో!" శివరాం గద్దించాడు. "నీకు అర్థంకావడానికి అలా అన్నాను. కుక్రుత్ జోగీ, కుటో లిన్ ఇంజెక్షన్ని ఉదాహరణగా తీసుకుందాం. ఎక్స్‌పయిర్డ్ కుటోలిన్‌ని తీసేసుకుని, అంతకుముందే సంపాదించిన ఎక్స్‌పయిర్డు కుటోలిన్ స్టాకునే నువ్వు సప్లై చేస్తున్నావ్ అయితే, ముందుగా సేకరించిన వాటిమీద లేబుల్స్‌ని మార్చేసి, డేట్ ఆఫ్ ఎక్స్‌పైరీని ముందుకు జరిపేస్తున్నావ్!"

వామనరావు ఉక్కిరిబిక్కిరవుతూ చూసి, మళ్ళీ తెప్పరిల్లాడు. అతని పెదవులు వంకరగా కదిలాయి.

"ఆ పని యెందుకు చేస్తున్నానంటూ నువ్వు ఎగతాళిగా ప్రశ్నించక్కర్లేదు, వామన్రావ్!" శివరాం గంభీరంగా అన్నాడు.

వామనరావు ఆగ్రహంతో ఊర్పిళ్ళూంచీ లేచాడు. శివరాంని నిప్పులు కక్కుతూ చూశాడు. శివరాం తన చూపుల్తో అతని చూపుల్ని వెనక్కితోస్తూ, నెమ్మదిగా పైకి లేచాడు. టేబుల్ చుట్టూ తిరిగి, వామనరావు ముందు ఆగాడు. అతని యెడమచెయ్యి తటాలున కదిలింది. వామనరావు కాలర్ని పిడికిలితో బిగించి, అతని సుంద్రటి మొహాన్ని తన మొహానికి దగ్గరగా లాగాడు. ఆగ్రహానికి పట్టిన అద్దాల్లా వున్న కళ్ళతో అతని చిన్న చిన్న దొంగ కళ్ళల్లోకి గుచ్చుతూ చూశాడు.

"ప్రసవించిన మరుక్షణం ప్రాణాపాయస్థితిలోకి

జారుకునే తల్లులకీ, అప్పుడే నీలాంటి లుచ్ఛాలు కూడా వున్న ఈ లోకంలోకి అడుగుపెట్టిన పసికందులకీ ప్రాణాంతకమైన కార్యం యెందుకు చేస్తున్నావ్?" అది శివరాం కంఠం కాదు; ఉరుము.

అగుర్దాని ఆగ్రహంగా మారుతున్న వామనరావు గింజుకున్నాడు.

"లీవ్ మీ! స్కౌండ్రల్! ఐవిల్ సీ దట్ యూ..."

శివరాం కుడిచెయ్యి మెరుపులా కదిలింది. అట్లకాడలా వామనరావు చెంపని అదరగొట్టింది. అసంకల్పితంగా వామనరావు ఎడంచేత్తో బూరెలా తయారవుతున్న బుగ్గని అదుముకున్నాడు.

శివరాం అతని మొహాన్ని ఇంకా దగ్గరగా లాగాడు. "తల్లి గొంతు కోసే భ్రష్టుడా! డబ్బుకోసం, మరణ యాతనపడి, మరో ప్రాణిని ఈ భూమిమీదకి దించి సొమ్మసిల్లిపోయే అసహాయురాలైన ఆడదాని ప్రాణాన్ని తద్వారా పసికందు తల్లినీ అపహరించే నీ రోగానికి తిరుగులేని మందు ఇస్తాను!"

కత్తికొసల్లా మెరుస్తున్న శివరాం కళ్ళల్లోకి వామనరావు దిక్కుతోచనివాడిలా చూశాడు. అతని పెదవులు అదరడం ప్రారంభించాయి. శివరాం చీడపురుగుని విదిలించినట్టు అతన్ని విడిలించాడు. వెనకున్న కుర్చీలోకి వామనరావు బస్తాలా కూలబడ్డాడు. శివరాం కదిలాడు. కుర్చీలో కూచుని, వామనరావుని తీక్షణంగా, అసహ్యంగా చూశాడు. శిరస్త్రాణం, కవచం, కత్తీ, డాలూ- అన్నీ పోగొట్టుకున్న సిపాయిలా వున్నాడు వామనరావు. అతని మేకపోతు గాంభీర్యం, హుందా, గర్వం అన్నీ గాలిలో కలిసిపోయినట్టు శివరాం గ్రహించాడు.

"డైరెక్టుగా పచ్చిబాలెంతలమీదా, పసికందుల మీదా ద్వేషంతో నువ్వు ఈ పాడుపని చేయడంలేదని కూడా, నాకు తెలుసు!" శివరాం అతన్నే చూస్తూ అన్నాడు.

కందిపోయిన చెంపని ఆప్యాయంగా తడువుకుంటూ వామనరావు గొంతులో అర్థంకాని చప్పుళ్ళు చేశాడు.

"మందుల వ్యాపారంలో దిగి కోట్లకొద్దీ పోగుచేసుకోవాలనుకున్నావ్. కామన్ హెల్తు ఫార్మస్యూటికల్స్ స్థాపించావ్. ధనకాంక్ష ఒక్కటే కాకుండా, అసహాయులయిన రోగులకు తోడ్పడాలనే నైతిక ఉద్దేశం కూడా ఫార్మస్యూటికల్స్ స్థాపించే వ్యక్తికి వుండాలన్న సత్యాన్ని విస్మరించావు. అందుకే నీ సరుకంతా నాసి రకంగా తయారైంది. సుశ్రుత్, దక్షిణ్, హీలర్ వగైరా సోదర సంస్థలతో మార్కెట్లో పోటీ పడలేక పోయావు; చిత్తుగా ఓడిపోయావు........" శివరామ్ ఆగి సిగరెట్ వెలిగించాడు.

మాటలు పడిపోయినవాడిలా, ఉబ్బెత్తుగా తయారైన చెంపతో ఫేసియల్—పెరాలిసిస్ వచ్చినవాడిలా, వెర్రిగా చూస్తున్న వామనరావువేపు తదేకంగా చూశాడు శివరామ్.

"నీ మందులతో వాళ్ళ మందులని ఓడించే శక్తిలేని నువ్వు, వాళ్ళ మందులతోనే సుశ్రుత్‌నీ, దక్షిణ్‌నీ, హీలర్‌నీ చిత్తుగా ఓడించాలనుకున్నావ్. నక్క తెలివితో భయంకరమైన ప్లాన్ వేశావ్. ఎక్స్‌పయర్డ్ మందుల స్థానంలో, తెలివిగా ఎక్స్‌పయర్డ్ మందుల్నే సప్లై చేస్తే వాటి ఉపయోగం మూలంగా అమాయకులు చస్తారు. నీ విరోధి సంస్థల మందులకి అచిరకాలంలో చాలా చెడ్డ

వేరొస్తుంది. ఆ సమయానికి నీ మందుల్ని నూతనోత్సాహంతో మార్కెట్లోకి వదిలి, ఆకాశంలోకి దూసుకెళ్ళాలనుకున్నావ్!"

"నో " వామనరావు మూలిగాడు.

"నోరు తెరిచే సే ముందున్న పళ్ళన్నీ గొంతులోకి ఒక్క పిడికిలిదెబ్బతో దించేస్తాను!" శివరాం హుంకరించాడు. బ్రీఫ్ కేస్ తెరిచి, మరో కాగితాన్ని అతని ముందుకు విసిరాడు. వామనరావు అర్థంకానట్టు చూశాడు.

"నీ శిష్యుడు నీ ప్లాను గురించి పూర్తిగా తెలీక పోయినా—ఊహించి, రాశాడు చూసుకో!" శివరాం నవ్వుతూ అన్నాడు.

కాగితాన్ని వణికే చేత్తో సరిచేసి, ఒకసారి చూసి, వామనరావు వెర్రిగా శివరాంవేపు చూశాడు. ఆశ్చర్యం, ఆందోళన, బ్రహ్మాండమైన ఓటమీ కలిసి అతని మొహం మీద ప్రళయతాండవం చేస్తున్నాయి.

"వామన్ రావ్, అత్యాశతో భూమినీ, ఆకాశాన్నీ—మొత్తాన్నీ వామనుడిలా ఆక్రమించేయాలనుకున్నావు. బలిని పాతాళానికి తొక్కినట్టు నీ శత్రు సంస్థల్ని తొక్కేయాలనుకున్నావు. కానీ బలి బదులుగా నువ్వే అధఃపాతాళానికి పోతున్నావ్!" శివరాం గంభీరంగా అన్నాడు.

"ఇదంతా రిపోర్టు చేస్తావా?" ఇరవై నాలుగ్గంటలూ ఆపకుండా కచేరీ చేసిన గాయకుడి కంఠంలా బొంగురుగా తయారయిన కంఠంతో చివరికి ప్రశ్నించాడు వామనరావు.

"అది నీ ప్రవర్తనమీద ఆధారపడి వుంటుంది!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. అతని చూపులు మెల్లిగా

వామనరావు తల పైకి లేచాయి. గోడకి అతుక్కున్న గడి యారాన్ని చూసి, శివరాం తన రిస్టువాచీ చూసు కున్నాడు. వామనరావు మొహం మీదికి మళ్ళించాడు.

"నీ శిష్యుడు సేకరించిన ఇంజెక్షను వయాల్సూ, సువ్రత నికి తెలివిగా సప్లయ్ చేసిన, అతను లాడ్జిగదిలో ప్లాంట్ చేసిన, నేను సిబిఐ ఆఫీసరు హోదాలో సీజ్ చేసి అక్కడే సీల్ చేసిన కొత్త లేబుల్స్‌తో వున్న పాత ప్లాస్కూ, నీ ముందు పడున్న చిత్తరంజన్ స్టేట్ మెంటు కాపీలూ కాస్సేపట్లో అసలు అధికారులకు అప్పగించబడతాయి" శివరాం తాపీగా చెప్పి ఆగాడు.

వామనరావు విలవిల్లాడుతూ కంగారుగా చూశాడు.

"నో!"

"నో యువర్ ప్రెజెంట్ పొజిషన్, వామన్రావ్!" శివరాం వ్యంగ్యంగా అన్నాడు. "నా వాచీ ప్రకారం ఒంటిగంటా ఇరవై నిమిషాలైంది. నీలాగే అత్రంగా పని చేసే నీ గోడగడియారం ఒంటిగంటా ముప్పైనిమిషాలం టోంది. కథంతా అధికారుల చేతికి అప్పగించటానికి రెండుగంటలా రెండునిమిషాలకి శుభముహూర్తం ఫిక్స్ చేశాను...."

"నో!" వామనరావు బొంగురుగా అరిచాడు.

"నా వాచీ ప్రకారం ముహూర్తానికి ఇంకా నలభై రెండు నిమిషాల వ్యవధి వుంది. నీ గడియారం ప్రకారం ముప్పైరెండు నిమిషాల వ్యవధిమాత్రమేవుంది. ఎప్పుడూ నా వాచీనే ఫాలో అయ్యే నేను ఈసారికి నీ గడియారాన్ని ఫాలో అవాలనుకుంటున్నాను...." శివరాం నవ్వుతూ ఆగాడు.

అదురుతున్న పెదవులూ, దవడలూ వామనరావుకి ఈ

సారి "నో" అనడంలో పూర్తిగా సహకరించలేదు. ఊపిరాడనివాడిలా గుడ్లు వెళ్ళగించుకుంటూ చూశా డతను.

"అంటే, మరో ముప్ఫైరెండు నిమిషాల్లో మనం ఎపిడెన్స్ అధికారుల హస్తాల్లోకి వాలకుండా ఆపాలి. ఆపాలంటే నువ్వు నన్ను ఆపాలి. నన్ను ఆపాలంటే నీకు కొంచెం ఖర్చవుతుంది, వామన్రావ్!" నవ్వుతూ శివరాం సిగరెట్ వెలిగించాడు.

"ఎంత?" వామనరావు నత్తిగా అడిగాడు. అంత త్వరగా తన మెసేజ్ని అందుకుని జీర్ణం చేసుకున్న అతన్ని శివరాం చిరునవ్వుతో చూశాడు.

"వామన్ హెల్తు ఫార్మస్యూటికల్స్ అకౌంట్లో స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో ఇవాళిటికి ముప్ఫై తొమ్మిదిలక్షలా నలభైరెండువేలా, మూడువందలా పంథొమ్మిదిపైసలు నిల్వవుంది...." శివరాం తన అర చేతిని చూసుకుంటూ అన్నాడు.

"నీకెలా తెలుసు....?" ఆశ్చర్యంతో అడిగిన వామన రావు కంఠంలో ఏదో బొదురు కప్ప అరిచింది.

శివరాం తలెత్తి అతన్ని చిరునవ్వుతో చూశాడు. "ఎలా తెలుసో అడగొద్దు; ఏమేం తెలుసో అడుగు వామనరావ్!"

అప్పుడప్పుడే నీళ్ళలోంచీ కొస ఊపిరితో పైకి లాగ బడిన వ్యక్తిలా చూశాడు, వామనరావు.

"వేరే బ్యాంకుల్లో యెంతుందో నా కనవసరం. లాకర్స్లో యేముందో నాకు అనవసరం. బ్లాక్మనీ యెంత నీకింద దాక్కుందో నాకు బొత్తిగా అక్కర్లేదు. నలభైరెండువేలా పైచిలుకు చిల్లరని నువ్వే వుంచుకో.

మొత్తంగా ముప్పైతొమ్మిది లక్షలూ నా ఫీజు కింద యిచ్చుకో!" శివరాం సీరియస్‌గా అన్నాడు.

వామనరావు ఉలిక్కిపడ్డాడు. గతుకుల రోడ్డుమీద వేగంగా వెళ్తున్న జీప్‌లో కూచున్న వ్యక్తిలా అతను వశం తప్పి వణకసాగేడు. రెప్పపాటులేని అతని కళ్ళు శివరాంమీదే ఆపడం అయిపోయాయి. ఒక్కసారిగా కోటిరూపాయల లాటరీ వచ్చిందన్న వార్త వినగానే మతిభ్రమించే సామాన్యుడిలా తన డోస్ మూలంగా వామనరావుకు మతిభ్రమణ సంక్రమించిందా? శివరాం నవ్వుకుంటూ ఆలోచిస్తూ అతన్నే చూశాడు.

"బొజ్జనిండా ఉండ్రాళ్ళు, కుడుములూ మెక్కి మత్తెక్కిన వినాయకుడిలా నువ్వు కూచుంటే, పంచరత్న మాల అప్పగిస్తున్న భక్తుడిలా నీ ముందు వాగుతూ కూచోలేను! వామనరావ్, వెళ్ళొస్తా...." శివరాం కటాలున లేచాడు.

"ఆ....గు...." అప్పుడే మాటలు నేర్చుకుంటున్న వాడిలా అన్నాడు వామనరావు. శివరాం ఆగాడు. కుర్చీలో కూచున్నాడు. చిరునవ్వుతో వామనరావుని చూశాడు.

"ఆగాను!"

"శివరాం....ఉప్పెనలా వచ్చి ఉన్నదంతా ఊడ్చుకెళ్ళిపోతే, నా గతేమిటి?" వామనరావు కంఠంలో ఏడుపు తొంగిచూస్తోంది.

"వామన్రావ్, తరువాత తీరిగ్గా అద్దం ముందు నిలబడు. అచ్చొచ్చినట్టు నీలాగే అవుపించే నీ ప్రతిబింబాన్ని అడుగు!" శివరామ్ నిర్లక్ష్యంగా అన్నాడు.

"అయిదు....అయిదు లక్షలిచ్చేస్తాను. ఈ కాగితాల

నకళ్ళూ, కాంపీల్సూ అసలు కాగితాలూ అన్నీ ఇచ్చేయ్. నన్ను-నన్నూ, చిత్తరంజన్నీ మరిచిపో...."

శివరామ్ నవ్వు అతనికి అడ్డు తగిలింది. "నేను వనూలు చేస్తోంది బ్లాక్ మెయిల్ మొత్తంకాదు. నాకు తెలిసిన, నీకు సంబంధించిన ఒక భయంకర రహస్యాన్ని లోకం చెవులనుండీ, కళ్ళనుండీ రక్షించడానికీ—నిజం చెప్పా లంటే నీ కథ పబ్లిష్ అవకుండా నన్ను కంట్రోల్ చేయ డానికీ. చిత్తరంజన్ని కంట్రోల్ చేయడానికి నువ్వు చెల్లించే ఫీజు మాత్రమే!"

"ఇది....ఇది....అమానుషం!" వామనరావు బొంగు రుగా అన్నాడు.

"ఈ అమానుషాన్ని ఆపు, వామనరావ్! ఇందాకటి ముప్పైరెండు నిమిషాల్లో చాలావాటిని నీ గోడగడియారం కొరుక్కు తినేసింది!"

వామనరావు ఆదుర్దాగా చేతిగడియారం చూసు కున్నాడు. "చిత్తరంజన్ ....ఎక్కడున్నాడు?"

"నా జేబులో వున్నాడు. . తో పరిచయం అయ్యాక నీ చిత్తరంజన్ అనబడే ఏకు మేకుగా తయా రయింది. అఘమేఘాలమీద వచ్చి నీ నెత్తిమీద వాలి పకడ్బందీగా నిన్ను బ్లాక్ మెయిల్ చేయాలని తహతహ లాడిపోతున్నాడు. తనని ఉపయోగించుకున్న పాడుపని గురించీ, నిన్ను గురించీ 'ఇప్పుడే' తెలిసిన అమాయకుడిలా నటిస్తూ దేశంలోని అన్ని పత్రికలకీ వ్యాసాలూ అవీ రాసేసి హీరో అవాలని తన్నుకు ఛస్తున్నాడు. నేను సూచించిన రేటుతో నన్ను నువ్వు వెంటనే కొనుగోలు చేయకపోతే, అతను నిన్ను వేలంవేసి అమ్మేస్తాడు!" శివ రామ్ నవ్వుతూ అన్నాడు.

"శివరామ్....ప్లీస్...." వామనరావు గాద్గదికంగా ప్రారంభించాడు.

"'ఇస్తాను' అన్న మూడక్షరాలు తప్పించి వేరే అక్షరం ఏది నీ నోటమ్మట వెలువడినా నేను లేస్తాను; తిరిగిచూడకుండా వెళ్ళిపోతాను. సుశ్రుత్ జోగి ఆసామినీ, దక్షిణ్ ప్రొప్రయిటర్నీ, హీలర్ వ్యక్తినీ, ఆ తరువాత సిబిఐ డైరెక్టర్నీ డైరెక్టుగా కలుసుకుంటాను. నా చేతిలోవున్న చిత్తరంజన్ కళ్ళెన్ని వదిలేస్తాను. ఇప్పుడు మాట్లాడు!" శివరామ్ కంఠంలో ధ్వనించిన నిర్ణయం, ఛాలెంజ్ వామనరావును మరో మనిషిగా మార్చేశాయి.

"ఇ....స్తా....ను" వామనరావు మంత్రముగ్ధుల్లా గొణిగాడు.

"శభాష్!" శివరాం చిన్నగా నవ్వాడు. "రిసీవర్ అందుకో. స్టేట్ బాంక్కి ఫోన్ చేయి. ఇరవై నిమిషాల్లో ముప్ఫైతొమ్మిది రెడీగా వుంచమను. అంత రెడీగా లేదంటే ఇరుగుపొరుగు బ్యాంకుల్లోంచి అరువు తీసుకొమ్మను. తరువాత కారెక్కు. కార్లో నన్ను కూచోబెట్టుకో. ఖాళీగా బ్యాంకులో కెళ్ళి నువ్వు బరువుగా తిరిగొచ్చేదాకా నేను నీ కార్లోనే వుంటాను. నిర్ణయించిన టైమ్ యేమాత్రం దాటిపోయినా నువ్వు యివతలికి రాకముందే కారుదిగి నా దారిన వెళ్ళిపోతాను. గడువు దాటితే నేను యేర్పాటు చేసిన వ్యక్తి అధికారుల్ని కల్సుకోకుండా ఆపడం పరబ్రహ్మతరం కాదు!"

వామనరావు ఉక్కిరి బిక్కిరవుతూ చూశాడు. వణుకుతున్న అతని చెయ్యి టెలిఫోను వైపు నడ్డివిరిగిన పాములా కదిలింది. శివరామ్ వైపు దీనంగా చూశా

డకను.

"అదికాదు....చిత్తరంజన్....తరువాత...."

"వామన్రావ్, నాతో మాట్లాడకు. టెలిఫోన్లో బ్యాంక్ మేనేజర్‌తో మాట్లాడు!" శివరాం నిర్లక్ష్యంగా అన్నాడు.

వామనరావు చెయ్యి రిసీవర్‌ని పట్టుకుని గడగడ వణకసాగింది. శివరాం అతన్ని చిరునవ్వుతో చూస్తూ సిగరెట్ వెలిగించాడు. "ఊ! కానీ! ఇప్పుడు అసలు మాత్రమే అడిగాను. అదయ్యాక, కొసరూ వడ్డిస్తాను! కొసరు యేమిటో కారులో విశదంగా వినిపిస్తాను!"

వామనరావు నీరసంగా తలని కుర్చీ వెనుక భాగానికి ఆన్చుకున్నాడు. కుడిచేత్తో రెండు కణతల్నీ నొక్కుకున్నాడు. వణుకుతున్న అతని ఎడమచెయ్యి రిసీవర్‌ని అతని చెవికి నొక్కిపట్టింది....

# 8

చెవులు రిక్కించి అంతా విన్న లత అబ్బురంగా చూసింది. కథ వింటూ, అప్రయత్నంగా సోఫా అంచుకు తను జరిగినట్టు గుర్తించి, మెల్లిగా వెనక్కి వాలింది. ఆమెలో మోసులెత్తుతున్న యెన్నో ప్రశ్నలు ఆమె విశాల నేత్రాల్లో స్పష్టంగా ప్రత్యక్షమవుతున్నాయి. శివరాం ఆమె మొహంలోకి చిరునవ్వుతో చూస్తూ సిగరెట్ ముట్టించాడు.

"డార్లింగ్...."

"అడుగు! నువ్వడగబోయే నాకు తెలిసిన ప్రశ్నలకి, తెలిసిన జవాబులు రెడీగా వున్నాయ్!" సగర్వంగా అన్నాడు.

లత ఎర్రటి పెదవులు మెల్లిగా కదిలాయి. పగిలిన దానిమ్మపండులోంచీ గింజల్లా ఆమె పళ్ళు తళుక్కుమన్నాయి.

"అసలు చిత్తరంజన్ నాటకాన్ని యెలా పసి కట్టావ్?"

శిరరాం చిన్నగా నవ్వాడు. "హనీ, ఎప్పుడూ ఒకటి గుర్తుంచుకో. కళ్ళు తెరుచుకుని వుంటే ఈ లోకంలో అన్నీ కనిపిస్తాయి. చెవులు రిక్కించి వింటే అన్నీ వినిపిస్తాయ్! చిత్తరంజన్ని హోటల్లో చూశాను.

ఏదో కొంటానికి మెయిన్ రోడ్ లో వున్న మెడికల్ స్టోర్స్కి వెళ్ళాను. అప్పటికే అక్కడికి చేరుకున్న చిత్తరంజన్ తను పనిచేసే కంపెనీ పేరు చెప్తున్నాడు. ఆ ముందురోజు రిసెప్షనిస్టుకి అతను చెప్పిన కంపెనీ పేరూ, షాపువాడికి చెప్పిన కంపెనీ పేరూ ఒక్కటికాదు! అకారణంగా మనిషి అబద్ధాలాడడు. ఒక ఫార్మస్యూటికల్స్ మందులమ్మే వ్యక్తి, మరో కంపెనీ మనిషినంటూ చెప్పుకోడం నాలో అనుమానం రేకెత్తించింది. ఆ రోజంతా అతన్ని పరీక్షించాను. చిత్తరంజన్ యేదో నాటకం ఆడుతున్నాడు! మర్నాడు యేమీ ఎరగనివాడిలా అతన్ని ఫాలో అయ్యాను. ఇంటిమేట్ అయింట్మెంట్ కావాలంటూ అతని నాటకానికి మెరుగులు దిద్దాను!"

"డార్లింగ్ యూ ఆర్ జీనియస్!" లత ఉద్రేకంలో అంది. "బాగానే వుంది. చిత్తరంజన్ సులువుగా అంతా కక్కేశాడా?"

"హనీ, నీళ్ళలో మునిగిపోయి పొట్టనిండా నీళ్ళు మింగేసి ఊపిరాని వ్యక్తిని పైకిలాగి పడుకోబెట్టి పొట్ట మీద నొక్కి నీళ్ళన్నీ కక్కించినట్టు అతనిచేత అంతా

శక్కించాను!" శివరాం నవ్వుతూ అన్నాడు. "అతను కత్తీ డాలూ పారేసి సరెండరయిపోడానికి వీలుగా సిబిఐ శాస్త్రిగా అతనికి నన్ను పరిచయం చేసుకున్నాను."

"ఆల్ రైట్....కామన్ హెల్తు ప్రొప్రయిటర్ని ఎలా లొంగదీశావ్?" లత అడిగింది.

అలసట నటిస్తూ శివరాం నిట్టూర్చాడు. "కామన్ హెల్తు కామందు నువ్వే అనుకో. నీకు మార్కెట్లో పోటీగా తయారైన మరో మూడు కంపెనీల తయారీలకి భయంకరమైన అపఖ్యాతి తెచ్చే ఉద్దేశంతో నువ్వు ఆ కంపెనీలకి చెందిన కాలంతీరిన మందులకి, కాలంతీరిన ఆ కంపెనీల మందుల్నే సరికొత్త లేబుల్స్‌తో మార్కెట్లో అందజేస్తున్నావ్. అది నేను కనిపెట్టాను. ఆధారాలతో నిన్ను అరికాలికింద తొక్కిపెట్టాను. 'అడిగినంతా ఇస్తావా? నీ శత్రుసంస్థలకి ప్రభుత్వానికీ, పేపర్లకీ చెప్పమంటావా?' అంటే నువ్వేం చేస్తావ్?"

కళ్ళు గిన్నెల్లా చేసుకుని లత ఆశ్చర్యంగా చూసింది. "అడిగిందంతా ఇస్తాను...."

"అచ్ఛా! వామనరావుకూడా, పాపం అడిగినంతా ఇచ్చుకున్నాడు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"డార్లింగ్...."

"చకచకా అడిగెయ్!"

"చిత్తరంజన్....అతన్నెలా కంట్రోల్ చేస్తావ్? వాటా ఇస్తావా?" లత అమాయకంగా అడిగింది.

"హనీ, నీ ప్రశ్నలో శివరాంని అవమానించావ్!" శివరాం గంభీరంగా అన్నాడు. "చిత్తరంజన్ ఎవ్వరికీ చిక్కడు. తిరపతి, శబరిమలై వగైరా క్షేత్రాల యాత్రలో బిజీగా వున్నాడు...."

"వాట్! ఎందుకూ?" లత నమ్మలేనట్టుగా అరిచింది.

చేసిన పాపాన్ని పాపనాశంలో, పంపానదిలో కడిగేసుకోడానికి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత అతన్ని చిలిపిగా చూసింది. చిటికెలో ఆమె కళ్ళలోని చిలిపితనం మాయమై, క్యూరియాసిటీ ప్రత్యక్షమైంది.

"డార్లింగ్ ....కీజు గుంజుకుంటున్నావు. కామన్ హెల్తువాడికి, మళ్ళీ మందుల మార్పిడి చేయడానికి పర్మిషను ఇచ్చావు....వాడు మళ్ళీ మనుషులకి ప్రాణాంతకంగా మందు సరఫరా...."

శివరామ్ చెయ్యెత్తి ఆమెని వారించాడు. మంచం మీంచీ తటాలున లేచి, ఆమె యెదురుగా ఠీవి గా నించున్నాడు. మెరుస్తున్న రత్నాల్లాంటి కళ్ళని లత కళ్ళల్లోకే గుచ్చి పెట్టాడు.

"హనీ, నాకు చాలా నచ్చే ప్రశ్న అడిగావు. నువ్వు మెచ్చే సమాధానం చెప్తాను...." శివరామ్ ఆగి సిగరెట్ ముట్టించాడు.

"కామన్ హెల్తు కామందుకి కొసరు వడ్డించానని యిందాకే నీకు చెప్పాను. ఆ కొసరేమిటో అడగటం నువ్వు మరిచిపోయావు!" పొగ వూదుతూ నవ్వాడు శివరాం.

లత కళ్ళు మెరిశాయి. "ఏమిటా కొసరు?"

"కామన్ హెల్తు వామనరావుని తగులుకున్న ధనకాంక్ష అన్న జాడ్యానికి తిరుగులేని మందు!" శివరాం గంభీరంగా అన్నాడు.

"కమాన్ డార్లింగ్! చెప్పు!" లత తొందర పెట్టింది.

"మందుల వ్యాపారం నుంచీ అతనికి కంపల్సరీ రిటైర్‌మెంట్ ఇచ్చేశాను...."

"వాట్ !?"

"పర్మనెంట్ గా ఫార్మస్యూటికల్స్ కట్టేయమన్నాను. మూడో రోజుకల్లా అన్ని దినపత్రికల్లో తన వ్యాపారాన్ని అనివార్య కారణాలవల్ల మూసేస్తున్నట్టు అర పేజీ అడ్వర్‌టైజ్‌మెంట్ ఇమ్మన్నాను. మానవ జాతికి మందులతో ద్రోహం తలపెట్టిన అతనిమీద శివరాం 'నాలుగో' కన్ను వుంటుందంటున్నాను...."

"నిజంగా?" లత ఆవేశం అతన్ని అడ్డుకుంది.

"మనం అబద్దాన్నైనా అసలు నిజంలా చెప్తాంగా!" శివరాం నవ్వుతూ అన్నాడు. "పేపర్లో ప్రకటించేలోగా అతని దగ్గరున్న స్టాకంతనీ కలిపి పిండికొట్టి, లిక్విడ్ మెడిసిన్స్‌లో కలిపి పానకం తయారుచేసి డ్రెయినేజీ పైపులగుండా సముద్రంలోకి సరఫరా చేసెయ్యమన్నాను. చిత్తరంజన్ లాడ్జిగదిలోని స్టాకుని నేనే నాశనం చేశాను!"

"డార్లింగ్ యూ ఆర్ వండర్‌ఫుల్!" లత ఉద్రేకంతో అని, ఆగి అనుమానంగా చూసింది. "ఇంతకీ అతను ఇదంతా చేస్తాడంటావా?"

శివరాం చిన్నగా నవ్వాడు. "హనీ. కాసేపు అంతా మరిచిపో. రేపొద్దుటే దొరికిన ప్రతి దినపత్రికనూ చూడు. 'కామెన్ హెల్తు మూత' వార్తనీ కళ్ళకి విందు చేస్తుంది!"

లత లటాలునలేచి ఉద్రేకంతో శివరాంని చుట్టేసింది. ఆమె తలని వెనక్కి వంచి శివరాం ఆమె కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు. "హనీ, అన్నీ అడిగావ్; అసలు

సంగతి మరిచిపోవు!"

లత కళ్ళు విశాలంగా అయ్యాయి. "ఏమిటి?"

"ఈ కథ సారాంశాన్ని నీలాగే వినాల్సిన మరొక వ్యక్తి ఉన్నాడు. అతన్ని గురించి అడగడం మరిచి పోయావ్!" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత కనుబొమలు మెలికలు తిరిగి కొత్తరకం ప్రశ్నార్థ కాన్ని తయారు చేశాయి. శివరాం చిరునవ్వుతో చూస్తూ వుండిపోయాడు. లత కనుబొమలు మళ్ళీ కదిలాయి.

"ఎవరు.... ఓహ్! డిటెక్టివ్ టెంపో! అవునా?" లత కంఠంలో కంగారు సన్నగా చప్పుడు చేసింది.

"నూటికి నూరు మార్కులు!" శివరాం నవ్వుతూ అన్నాడు. తనను చుట్టిన లత చేతుల్ని విడిపించబోయాడు. లత చేతులు బిగుసుకున్నాయి.

"డార్లింగ్ ....వద్దు .. టెంపోని ప్రతిసారీ...."

"హనీ, టెంపో పేరువిని కంగారుపడుతూ ఇవాళ రెండోసారి నువ్వు శివరాంని అవమానించావ్?" శివరాం గంభీరంగా అన్నాడు.

"డార్లింగ్ ...."

శివరాం ఆమెని దూరంగా జరిపాడు. మంచంమీద బొమ్మలాగా ఆమెని కూచోబెట్టాడు. జేబులోంచీ తీసిన సిగరెట్ని పెదాలమధ్య ఇరికించాడు. లత చేపే చూస్తూ అగ్గిపుల్ల గీశాడు. సిగరెట్ని వెలిగిస్తున్న అగ్గిపుల్ల కాంతిలో వజ్రాల్లా తళుక్కుమంటున్న అతని కళ్ళని లత కంగారుగా చూస్తోంది.

సిగరెట్ని ఇవతలికి లాగి పొగ ఊదుతూ శివరాం లత కళ్ళలోకి తదేకంగా చూశాడు.

"హనీ, నేను నిన్ను ప్రేమిస్తున్నాను. డిటెక్టివ్

టెంపోని—అతని అతి తెలివితేటల్ని—ద్వేషిస్తున్నాను. ప్రేమకూ, ద్వేషానికీ పరాకాష్ట ఆధారాలుగా వున్న మీ ఇద్దర్నీ నేను మరిచిపోలేను. నా ప్రతీ అడ్వెంచర్నీ ప్రేమతో నీకు వివరిస్తూ, నీ సందేహాలకు సమాధానలిస్తాను. డిటెక్టివ్ టెంపోకి నా సవాలు రువ్వుతాను!" శివరాం గంభీరంగా అన్నాడు.

"డార్లింగ్!"

"మీ ఇద్దరికీ చెప్పకుండా, చెప్పి తృప్తి చెందకుండా నన్ను యెవ్వరూ ఆపలేరు!" శివరాం కంఠం జేగంటలా ధ్వనించింది. అతను గిరుక్కున వెనక్కి తిరిగి, టీపాయ్ మీదున్న టెలిఫోన్ రిసీవర్ని అందుకున్నాడు, మెల్లిగా తనకు కావాల్సిన నంబర్ని డయల్ చేశాడు.

పైకి లేచిన లత చేతులు వెనకనుంచీ అతని భుజాల మీద అల్లుకున్నాయి. ఆమె చెంప మెత్తగా అతని వీపుని నొక్కింది. శివరాం మొహంమీద చిరునవ్వు మెరిసింది.

['శివరామ్ అడ్వెంచర్స్' సీరిస్‌లో ఇది నాలుగవ నవలిక]

—: అ యి పో యి ం ది: —

# సుబ్బారావు చావు

## వసుంధర

డిటెక్టివ్ వెంకన్న అసిస్టెంట్సు సీతమ్మ, రాజమ్మ కార్లోంచి దిగగానే ఇనస్పెక్టర్ శంకర్రావు వారికి ఎదురెళ్ళి—

"రండి రండి—మీ కోసమే యెదురుచూస్తున్నాను—" అన్నాడు.

వెంకన్న మందహాసం చేసి అసిస్టెంట్సువంక చూశాడు. వాళ్ళిద్దరూ చేతిలో నోట్ బుక్‌తో, పెన్సిల్‌తో సిద్ధంగా ఉన్నారు. వెంకన్న చిరునవ్వు చూస్తూనే వాళ్ళు శంకర్రావు మాటలు నోట్ చేసుకున్నారు.

"మీరు మా కోసం యెదురుచూస్తున్నాననడం రికార్డయింది. తర్వాత మీ రొప్పుకోకపోయినా ఈ రికార్డు నా మనసుకు తృప్తినిస్తుంది—...." అన్నాడు వెంకన్న.

"నా కారణంగా మీరు తృప్తిపడితే—అదే నాకు సంతోషం...." అన్నాడు శంకర్రావు.

"శవమెక్కడుంది?" అన్నాడు వెంకన్న విషయానికి

వస్తూ.

"బెడ్రూంలో మంచంమీద—చాలా విషాదమైన కేసు. భార్యాభర్తలిద్దరూ ఒకే మంచంమీద పడుకున్నారు. అప్పుడిద్దరూ ఆరోగ్యంగా ఉన్నారు. తెల్లారి లేచేసరికి భర్త శవంగా మారాడు. భార్య వళ్ళు తెలియని నిద్రలో వుంది. పాలవాడదే పనిగా తలుపు తట్టగా తట్టగా మెలకువ వచ్చింది...."

"పోర్టు ఎటాకా?" అన్నాడు వెంకన్న.

అప్పటికి శంకర్రావు, వెంకన్న, శవమున్న గదిలో ప్రవేశించారు. సీతమ్మ, రాజమ్మ వారి ననుసరించారు.

శవం నీలంరంగులో వుంది.

"మీ ప్రశ్నకు జవాబు లభించిందా?" అన్నాడు శంకర్రావు.

"విషప్రయోగమన్నమాట!" అన్నాడు వెంకన్న.

శంకర్రావు తలాడించి—"ఎలా జరిగిందో తెలియడం లేదు. ఇల్లంతా గాలించినా ఎక్కడా ఎలాంటి విషమూ దొరకలేదు. ఇంటి తలుపు అన్నివైపుల నుంచీ వేసి ఉన్నాయి. ఇంట్లో భార్యాభర్తలిద్దరూ తప్ప ఎవ్వరూ లేరు. లోపలకెవరూ వచ్చిన జాడలేదు. తన భర్తకెటువంటి దిగులూ లేదనీ ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం లేదనీ భార్య అంటోంది. వారిది నలుగురూ అసూయపడే అన్యోన్య దాంపత్యమనీ, భార్యది మంచి మనస్తత్వమనీ ఆమె సుగుణవతీ అనీ యిరుగూ పొరుగూ అంటున్నారు. ఇది ఆత్మహత్య అయుండాలి. హత్యయితే భార్యే చేసి ఉండాలి. ఆమె చాలా అందంగా, అమాయకంగా ఉంది. అనుమానంమీద ఆమెనరెస్టు చేయడానికి మన సొప్పడంలేదు. ఏంచేయాలో పాలుపోక మీకు ఫోను

చేశాను—" అన్నాడు.

వెంకన్న అతని మాటలు వింటూ శవాన్ని చూస్తు న్నాడు.

హతుడి వయసు ముప్పై దాటదు. కనుముక్కు తీరు చక్కగావుంది. మనిషి మంచి పొడగరి. సుమారైనలావు. అందమైన గంభీరమైన మీసాలు....

అప్రయత్నంగా—"నేనొకసారి హతుడి భార్యను చూడాలి...." అన్నాడు వెంకన్న.

"పక్క గదిలో ఉందామె. భోరున ఏడు స్తోంది—...."

వెంకన్న పక్కగదిలోకి వెళ్ళాడు. అతడి ననుసరిం చారు అసిస్టెంట్సు.

లోపల గోడవారగా కూర్చుని ఏడుస్తోందో యువతి. ఆమె తల మోకాళ్ళపై ఉంది. వెక్కిళ్ళు ఆగకుండా వస్తున్నాయి.

వెంకన్న అసిస్టెంట్సువంక చూశాడు.

సీతమ్మ, రాజమ్మ ఆమె చెరోపక్కకు వెళ్ళి కూర్చు న్నారు. సీతమ్మ ఆమె భుజంమీద చేయి వేసింది.

ఉలిక్కిపడి తలెత్తిందా యువతి. ఆమెకు ఎదురుగా వెంకన్న కనిపించాడు.

"నా పేరు వెంకన్న. నేనొక డిటెక్టివును. ఈ కష్ట సమయంలో నీకు సాయపడాలని వచ్చాను. నీ పేరు చెప్పమ్మా" అన్నాడు వెంకన్న.

"వసంత—" అందామె.

"మీ వారి పేరు?—"

"సుబ్బారావు!"

"వారేం చేస్తున్నారు?"

"సెంట్రల్ గవర్నమెంట్ లేబరేటరీలో సైంటిస్టు— ...."

"ఆయనకు శత్రువులున్నారా?"

"ఉన్నారు— ...."

వెంకన్న కళ్ళు మెరిశాయి—"వారి వివరాలు చెప్పమ్మా!"

"నేనే ఆ శత్రువుని. నేనే వారిని చంపాను...." అంటూ ఆమె భోరున ఏడ్చింది.

వెంకన్న ఆమెను తమాయించుకోనిచ్చి-"చూడమ్మా! దుఃఖాన్ని అణచుకో. పోయిన వారెలాగూ తిరిగిరారు. నువ్వు జైలుపాలు కావడం నా కిష్టంలేదు. నీకు సాయ పడాలనే వచ్చాను...." అన్నాడు.

"నాకెవరి సాయమూ వద్దు. వారు లేకపోయాక నా బ్రతుక్కి అర్థంలేదు. ఈ హత్య నేనే చేశాను. నన్నురి తీసే నేనూ వారిని చేరుకుంటాను...." అందామె జీర వోయిన కంఠంతో.

"సరే — హత్య నువ్వే చేశావు. అందుక్కారణ మేమిటి?"

"నేను దుర్మార్గురాల్ని—పాపాత్మురాల్ని. నావంటి వాళ్ళు మనుషుల్ని చంపడానికి కారణాలుండవు...." అంది వసంత ఏడుస్తూనే.

"నీ భర్తపోయిన దుఃఖంలో నువ్వేం మాట్లాడు తున్నావో నీకు తెలియడంలేదు. నువ్వే ఈహత్య చేశా వంటే నీకు పడేది ఉరిశిక్ష కాదు. యావజ్జీవ కారాగార శిక్ష. నేరం చేయకపోయినా జైలుపాలై నేరస్థుల మధ్య నికృష్ట జీవితం అనుభవించాలి ..."

"అన్నింటికీ నేను సిద్ధంగా వున్నాను...." అంది

వసంత.

వెంకన్న ఆమెతో ఇంకేమీ మాట్లాడకుండా బయటకు వచ్చారు.

"ఏమంటుందామె?" అన్నాడు శంకర్రావు.

"నేనేమడిగినా ఏడుస్తుంది తప్ప నోరు విప్పదు. మీరామెచేత పలికించడమే పెద్ద విశేషం.... అంతా విన్నాను నేను. అంటే ఆమే యీ హత్యచేసి తర్వాత బాగా అప్సెట్టయిందన్నమాట........" అన్నాడు శంకర్రావు.

"ఆమె హత్యచేసిందని చెప్పలేను కానీ అప్సెట్ మాత్రం అయింది—"

"ఏమైనా ఆమెను నేనరస్టు చేయాలనుకుంటు న్నాను...."

"వద్దు...." అన్నాడు వెంకన్న.

"వదరకు వెంకన్నగారూ! ఇది హత్యకేసు. హత్య చేసే అవకాశం ఆమెకు తప్పలేదు. ఆమె తనే హత్య చేశానంటోంది...."

"ఆమె తరఫున నేను హామీ ఉంటాను. ఇదామె నరెస్టు చేయడానికి సమయంకాదు. నేనామెను మా యింటికి తీసుకుని వెడతాను. ఆమెను సముదాయించి మామూలు మనిషినిచేసే బాధ్యత నా శ్రీమతికి అప్ప గిస్తాను. ఈలోగా మనం సేకరించవలసిన సమాచారం చాలా వుంది—" అన్నాడు వెంకన్న.

"మీరు హామీ ఉంటానంటే సరే-అయితే బాధ్యత మీదే!" అన్నాడు శంకర్రావు.

"బాధ్యతగల వాడిణ్ణి. నాకు బాధ్యత గురించి మీరు హెచ్చరించాల్సిన అవసరంలేదు-" అన్నాడు వెంకన్న.

వేలిముద్రల నిపుణుడి రిపోర్టు ప్రకారం—అనుమాన ప్రదేశాల్లో లభించిన వేలిముద్రలు — సుబ్బారావువి, వసంతవి, మూడో మనిషివి లేవు.

పోస్టుమార్టం రిపోర్టు ప్రకారం-ఒక అద్భుత విశేషం తెలిసింది. సుబ్బారావు ప్రాణంతీసిన విషం ఎక్స ఫర్టీటూ. అది కొత్తగా కనిపెట్టబడిన విశేషం. దాన్ని కాఫీ, టీలలో కూడా కలిపివ్వవచ్చు. మంచినీళ్ళలో కలిపివ్వ వచ్చు. దానివల్ల ద్రావకానికి రంగు మారదు. దానికి రుచిలేదు. పుచ్చుకున్నాక పన్నెండుగంటలదాకా దాని ప్రభావముండదు. అప్పుడది ఉన్నట్టుండి ప్రభావం చూపి స్తుంది. గుండెల్లో నొప్పి వస్తుంది. అరుద్దామన్నా గొంతు పెగలదు. కాళ్ళు, చేతులు కదపాలన్నా సాధ్యంకాదు. ప్రాణం పోవడానికి రెండు మూడు నిముషాలు పడు తుంది. అప్పుడు హతుడనుభవించే నరకయాతన వర్ణనా తీతం. చనిపోవడానికి నిముషంముందు శరీరం నీలంగా మారుతుంది. ఆ సమయంలో ఆ శరీరంనుండి ఓ వింత పరిమళం వస్తుంది. అది పక్కనున్న వారిలో గాఢ నిద్రను కలగజేస్తుంది. సుబ్బారావు తెల్లవారుఝామున మూడుగంటలకు మరణించాడు. అంటే అంతకుముందు రోజు మధ్యాహ్నం రెండుగంటల మధ్యలో అతడిపై విషప్రయోగం జరిగి ఉండాలి.

వెంకన్నకు ఎక్స-32 విషం గురించి తెలుసు. ఆ విష ప్రయోగంలో గత ఆరుమాసాల్లోనూ ప్రపంచమంతటా యెనిమిది హత్యలు జరిగాయి. అయితే ఆ విషం సామా న్యుల కందుబాటులో ఉండదు. మెడికల్ షాపుల్లో దొరకదు. దాన్ని ప్రత్యేకంగా కొన్ని డిపార్టుమెంట్సు-

ఇంపోర్టు చేసుకుంటాయి. అందులో పోలీసు డిపార్టుమెంటు కూడా ఉంది.

వెంకన్న పోస్టుమార్టం రిపోర్టు చూడగానే—సుబ్బారావు పని చేసే లాబరేటరీకి వెళ్ళాడు. సుబ్బారావు చనిపోయే ముందు రోజు లాబరేటరీకి వెళ్ళాడు. రోజంతా లాబరేటరీలోనే వున్నాడు. లాబరేటరీలో ఎక్స్-32 విషం వుంది. రెండువందలయాభై గ్రామ్ బాటిల్సు రెండుండాలి లాబరేటరీలో. వాటిని మధుమూర్తి అనే సైంటిస్టు—రసాయనిక ప్రయోగంకోసం తెప్పించాడు.

వెంకన్న మధుమూర్తిని కలుసుకుని — "వాటితో మీకు పనేమిటి?" అనడిగాడు.

"నా అనాలిసిస్‌లో ఇనుము ప్రతిబంధకం. దాన్ని మాస్కు చేయడానికి అస్కార్బిక్ ఆసిడ్‌లాంటి రసాయనాలు చాలా ఉన్నాయి. కానీ నా అనాలిసిస్‌లో అవన్నీ ఇంటర్ఫియరవుతాయి. ఎక్స్-32 వల్ల ఇనుము మాస్కవుతుంది. అనాలిసిస్‌లో ఇంటర్ఫియరన్సుండదు-" అన్నాడు మధుమూర్తి.

"కానీ—అలాంటి ప్రమాదకరమైన విషం మీ దగ్గరుండడం — ప్రమాదం కదూ!" అన్నాడు వెంకన్న.

"ప్రమాదమనుకుంటే ప్రయోగాలు చేయలేం. నా దగ్గర సోడియం, పొటాషియం సయనైడ్సున్నాయి. సెకన్లలో ప్రాణాలుతీసే ఆ విషాలతో కనీసం నెలకొక్క ప్రయోగమైనా చేస్తాను నేను—" అన్నాడు మధుమూర్తి.

"మరి మీకు భయం వేయదూ?"

"తగు జాగ్రత్తలు తీసుకుంటే చాలు—ఏ భయమూ ఉండదు—"

"మీ దగ్గరున్న ఎక్స్-32 యెవరికైనా యిచ్చారా?"

"లేదు—అది లాకండ్ కీతో యెప్పుడూ నా దగ్గరే ఉంటుంది...."

"ఇప్పుడూ ఉందా?"

"వారంరోజుల క్రితం నేను వాడాను...."

"ఇప్పుడు దానొకసారి చూడవచ్చా?"

"ష్యూర్ —" అంటూ లేచాడు మధుమూర్తి. అతడు లాబరేటరీలోని పక్క గదిలోకి వెళ్ళి కొద్ది క్షణాల్లో ఓ రెండు చిన్న సీసాలతో తిరిగి వచ్చాడు. అతడు వెంకన్నకా సీసాలందించాడు. అందులో ఒకటి సీల్డు బాటిల్. ఒకదానికి మాత్రం మూత సులభంగా వచ్చింది.

"ఇది నేను వాడుతున్నాను. నా ప్రయోగానికి— అరగ్రాము చాలు...." అన్నాడు మధుమూర్తి.

వెంకన్న పరీక్షగా ఆ సీసానే చూస్తూ—"మనిషి ప్రాణాలు తీయడానికెన్ని గ్రాములు కావాలి?" అన్నాడు.

"అయిదువందల మిల్లీగ్రాములు — అంటే అర గ్రాము...."

"ఈ సీసా మీవద్ద నున్నట్లింకెవరికైనా తెలుసా?"

"ఎందుకు తెలియదు? చాలామంది సైంటిస్టులకు తెలుసు. మా పర్చేజ్ డిపార్టుమెంటుకీ, స్టోర్సు డిపార్టు మెంటుకీ కూడా తెలుసు...."

"ఎవరైనా మిమ్మల్ని విషం కావాలని అడిగి తీసు కున్నారా?"

"అడిగితే మాత్రం నేనెందుకిస్తాను?"

"ప్రయోగాలకని అడిగినా యెవరికీ యివ్వరా?"

"ఎక్స్-32తో ప్రయోగాలు చేసేవాణ్ని లాబొ రేటరీ మొత్తంమీదా నేనొక్కడినే—" అన్నాడు మధుమూర్తి.

"అంటే ఈ ఊరి మొత్తంమీద ఎక్స్-32 వున్నవారు మీరొక్కరే! ఆ ఎక్స్-32 ప్రయోగంతో సుబ్బారావు మరణించాడు. సుబ్బారావు ఆఫీసులో ఉండగా ఆఫీసు సమయంలో ఈ విషప్రయోగం జరిగింది. దీనికి మీరేం సమాధానం చెబుతారు?" అన్నాడు వెంకన్న.

ఉన్నట్లుండి మధుమూర్తి ముఖానికి చెమటలు పట్టాయి—"సుబ్బారావుపై విషప్రయోగం జరిగిందని నాకు తెలియదు...." అన్నాడతడు.

"మీ కొలీగ్ పోయాడని మీకు సెలవు కూడా యిచ్చారు. అతడెలా పోయిందీ కూడా మీరు తెలుసు కోలేదా?"

"నేనాఫీసు విషయాలాట్టే పట్టించుకోను. నాలోకమే నాది. ఆఫీసుకు సెలవిచ్చినా — నాకేవో ప్రయోగా లుంటే చూసుకున్నాను తప్ప యింటికీ వెళ్ళిపోలేదు. సంతాప సమావేశానికి మాత్రం వెళ్ళి రెండు నిముషాలు మౌనం వహించాను...." అన్నాడు మధుమూర్తి.

అతడి మాటలమాయకంగా తోచాయి వెంకన్నకి— "సరే—ఇప్పుడు చెప్పండి—ఎక్స్-32 సుబ్బారావుకి మీరే యిచ్చారా?"

"నేనెందుకిస్తాను?" అన్నాడు మధుమూర్తి కంగా రుగా.

"ఇచ్చే అవకాశం ఇంకెవ్వరికీ లేదు కాబట్టి— మిమ్మల్నే అనుమానించాలి—" అన్నాడు వెంకన్న.

మధుమూర్తి చాలా కంగారుపడిపోయాడు. అతడు

బాగా ఆలోచించి—"నా లాబరేటరీ అసిస్టెంటు సుధాకర్‌కి నేను తరచుగా బీరువా తాళాలిస్తూంటాను—" అన్నాడు.

వెంకన్న సాలోచనగా—"ఈ సీసాలోని విషం తగ్గితే మీకు తెలుస్తుందా?" అన్నాడు.

"ఎవరైనా పది పదిహేను గ్రాములు తీసుకుంటే తెలుస్తుంది తప్ప—రెండు మూడు గ్రాములు తీసుకుంటే తెలియదు...."

"ఇలాంటి భయంకర విషం దగ్గరున్నప్పుడు ప్రతి మిల్లీగ్రామునూ ఎప్పటికప్పుడు లెక్కించాలని మీకు తెలియదా? తెలుసుకోవడం మీ బాధ్యత కాదా?" అన్నాడు వెంకన్న కఠినంగా.

"వెంకన్నగారూ! ఇందాకట్నుంచి మీరు విషం విషం అంటున్నారు. కానీ నాకు సంబంధించినంతవరకూ ఇది విషం కాదు. రసాయనం. ప్రమాదకరమైన ప్రతి రసాయనాన్ని విషంగా భావిస్తే సైంటిస్టులు ప్రయోగాలు చేయలేరు...."

"సరే—అదలాగుంచండి. మీరు మీ అసిస్టెంటు సుధాకర్ గురించి చెప్పారు. అతడికి ఎక్స్-32 అందుబాటులో వుంది. అతడికీ సుబ్బారావుకీ యేమైనా శత్రుత్వముందా?"

"నాకు తెలియదు. నేను లాబ్‌లో యెవరితోటీ యెక్కువ మాట్లాడను. సుబ్బారావుతో కూడా నా పరిచయం అంతంతమాత్రం...." అన్నాడు మధుమూర్తి.

వెంకన్న సుధాకర్ని కలుసుకుని—సూటిగా విష ప్రయోగం గురించి అడిగాడు. సుధాకర్ కంగారుపడి

తనకేమీ తెలియదన్నాడు.

"తెలియదంటే వదరదు—పోలీసులు నిన్నరెస్టు చేస్తారు...."

"నేనేపాపం ఎరుగను!" అన్నాడు సుధాకర్.

"నువ్వేపాపం ఎరక్కపోతే—సుబ్బారావుకి విష ప్రయోగమెలా జరిగింది? నీకు, మధుమూర్తికి తెలియకుండా ఇంకెవరైనా ఆ సీసా తీసుకోగలరా?"

"తీసుకోలేరు సార్!" అన్నాడు సుధాకర్.

"అయితే నిజం చెప్పు—నువ్వెవరికైనా ఎక్స—32 ఇచ్చావా?"

సుధాకర్ తల అడ్డంగా ఊపాడు.

"బాగా ఆలోచించుకుని చెప్పు. ఈ సమాధానంమీద నీ భవిష్యత్తాధారపడి ఉంది—" అన్నాడు వెంకన్న.

"నాకేం తెలియదు సార్...."

"సరే—ఈ మాటలతో ఇన్‌స్పెక్టర్ శంకర్రావుని కూడా నమ్మించు. నువ్వు అరెస్టవడం ఖాయం—" అన్నాడు వెంకన్న.

సుధాకర్ వెంటనే—"మీరు మధుమూర్తినెందుకు అనుమానించరు?" అన్నాడు.

"ఎందుకంటే—నీకూ, సుబ్బారావుకీ మాత్రమే శత్రుత్వమున్నట్లు ఆధారాలున్నాయి—" అన్నాడు వెంకన్న.

"ఎవరు చెప్పారు?"

"ఎవరు చెప్పారో చెప్పను...." అన్నాడు వెంకన్న.

సుధాకర్ మాట్లాడలేదు.

వెంకన్న అతడితో—"బాగా ఆలోచించుకో—చిన్న నిజాన్ని దాచి సాక్షీగా సాగిపోతున్న సంసారంలో

కల్లోలం సృష్టించుకోవు—" అన్నాడు.

తర్వాత అతడు పర్చేజాఫీసర్ దేనియల్ని, స్టోర్సాఫీసరు వెంకట్రామయ్యని కలుసుకున్నాడు. వాళ్ళతో మాట్లాడేక—మధుమూర్తి వద్ద ఎక్స్-32 ఉన్న విషయం ఆ ఆఫీసర్సుకే కాక—ఆ డిపార్టుమెంటులో గుమస్తాలందరికీ తెలుసని అర్థమయింది. ప్రత్యేకించి ఏ ఒక్కరినీ అనుమానించడం కష్టం.

# 3

డిటెక్టివ్ వెంకన్న శంకర్రావుని కలుసుకుని. సెంట్రల్ గవర్నమెంటు లాబరేటరీలోని కొందరు ఉద్యోగుల పేర్లు చెప్పి—"కొన్నాళ్ళపాటు వీరిపై నిఘా ఉంచి—వీరి దినచర్యలు తెలుసుకోండి—" అన్నాడు.

"పనికివచ్చే సమాచారం దొరికిందా?"

"లేదు. కానీ ఎక్స్—32 ప్రయోగంతో సుబ్బారావు చనిపోయాడన్న విషయం మీరింకా బైటపెట్టలేదుకదా-అది నేనక్కడ బైటపెట్టాను. ఫలితంగా లాబొరేటరీలో చర్చలు ప్రారంభమవుతాయి. ఆసక్తికరమైన విశేషాలు బైటపడవచ్చు "

"బైటపడినా మనకెలా తెలుస్తాయి?" అన్నాడు శంకర్రావు.

"ఊళ్ళో నాకు కొందరు అభిమానులున్నారు. ఇలాంటి విషయాల్లో సాయపడడం వాళ్ళకు సరదా. ఒకరుకాదు—ఇలాంటి వారు వందల్లో ఉన్నారు. అదో పెద్ద నెట్ వర్కు. ఆ నెట్ వర్కును వదిలిపెడుతున్నాను. పనికొచ్చే సమాచారం చాలా దొరుకుతుంది...."

"దొరక్కపోతే?"

"ఇట్నించి నరుక్కు రావడమయింది—ఇక అట్నించి

నరుక్కు వస్తాను....” అన్నాడు వెంకన్న.

“అంటే?”

“వసంత మామూలు మనిషవుతోంది. సుబ్బారావు వ్యక్తిగత విశేషాలు సేకరించాలి కదా....” అన్నాడు వెంకన్న.

శంకర్రావు వెంకన్నతో కరచాలనంచేసి — “ఈ కేసులో మీరు తొందరగా విజయం సాధిస్తారు....” అన్నాడు.

“అప్పుడు మీ దగ్గర ఫీజు వసూలు చేస్తాను—” అన్నాడు వెంకన్న.

“తప్పకుండా యిచ్చుకుంటాను. డబ్బుతో వెలకట్టలేని ఫీజు....”

వెంకన్న అక్కణ్నించి ఇంటికి వెళ్ళాడు. అక్కడ సీతమ్మ, రాజమ్మ అతడికోసం యెదురుచూస్తున్నారు. వారి ముఖాల్లో ఉత్సాహముంది.

“ఏమైనా పనికివచ్చే సమాచారం లభించిందా?”

“అవును బాస్!” అంటూ సీతమ్మ అతడికి కాగితా లందించింది.

వెంకన్న ఆ కాగితాలు చూసి — “శభాష్!” అన్నాడు.

అది సీతమ్మ, రాజమ్మ కలిసి సంయుక్తంగా తయారు చేసిన నోట్సు. సాధారణంగా ఆ అసిస్టెంట్సిద్దరూ విడి విడిగా నోట్సు తయారుచేస్తారు. కలిసి పనిచేసినపుడల్లా మాత్రం ఫలితం విడివిడిగా చేసినప్పటికంటె అద్భుతంగా ఉంటుంది.

విన్నదాని కిద్దరి ఊహాశక్తి జోడించగా తయారయిన నోట్సది. వెంకన్న నోట్సును శ్రద్ధగా మూడుసార్లు చది

వాడు.

సుబ్బారావుకు లాబొరేటరీ అంటే ప్రాణం. సైన్సు తప్ప ఇంకో ధ్యాస లేదతడికి. తను కనిపెట్టిన విశేషాల నతడు సులభపద్ధతిలో భార్యకు కూడా చెబుతూంటాడు. అతడి కారణంగా ఆమెకూ వైజ్ఞానిక పరిశోధనలంటే ఆసక్తి కలిగింది. కొత్త పత్రిక రాగానే సీరియల్ నవల గురించి యెదురుచూసినట్లు—రోజూ భర్త రాకకోసం సాయంత్రా లెదురు చూసేది వసంత. ఆ రోజు పరిశోధనల వివరాలడిగేది. సుబ్బారావెంతో సంతోషంగా ఆమెకన్నీ వివరించి చెప్పేవాడు.

సుబ్బారావుకు ప్రచారం గిట్టదు. అతడు చాలా గొప్ప విషయాలే పరిశోధిస్తున్నాడు. అతడి పరిశోధనా ఫలితాలు విదేశీ పత్రికల్లో వచ్చాయి. కానీ అతడు ఇంటికి వచ్చే మిత్రులతో లాబొరేటరీ విశేషాలు మాట్లాడడు. తన పరిశోధనల గురించి చెప్పడు. భార్యతోనూ, సైంటిస్టులతోనూ మాత్రమే అతడు వాటిని గురించి మాట్లాడతాడు. కానీ ప్రవీణ్‌కుమార్‌ను మాత్రం ఇందులో మినహాయించాలి. అతడి ఉద్యోగమేమిటో తెలియదు కానీ అతడు శాస్త్రజ్ఞుడు కాదు. కానీ తరచుగా సుబ్బారావు, ప్రవీణ్‌కుమార్—రీసెర్చి విశేషాలు మాట్లాడుకునేవారు. ప్రవీణ్‌కుమార్ సుబ్బారావుకు ప్రాణమిత్రుడూ కాదు. చిన్ననాటి స్నేహితుడూ కాదు. ఇద్దరికీ ఎలా పరిచయమయిందో తెలియదు వసంతకి. అతడు నెలకి ఒకటి రెండు సార్లు తమ యింటికి వస్తూంటాడు. తమ ఇంటికి రమ్మని యెప్పుడూ అడగలేదు. అతడికి వివాహమయిందో లేదో కూడా ఆమెకు తెలియదు. భర్త నడిగితే అతడి గురించి వివరాలడగొద్దని చెప్పాడు. ప్రవీణ్‌కుమార్ వసంతతో

ఎప్పుడూ మాట్లాడలేదు. అతడు రాగానే ఆమె కాఫీ యిచ్చేది. అతను సుబ్బారావుకు థాంక్స్ చెప్పి వెళ్ళేవాడు. కానీ సుబ్బారావు మరణానికి వారం రోజుల ముందు మాత్రం అతడు—వసంతతో మాట్లాడాడు. చెల్లెమ్మా అని ఆప్యాయంగా పిలిచాడు. నీ భర్త జీనియస్ అన్నాడు. ఆ పూటకు వాళ్ళింట్లోనే భోంచేస్తానన్నాడు. తను కూడా స్వీట్సు పట్టుకుని వచ్చాడు. ఏం జరిగిందని వసంత భర్త నడిగింది. నా ప్రయోగాలవల్ల అతడు ప్రయోజనం పొందాడని చెప్పాడు సుబ్బారావు. వసంత వివరాలడిగితే సుబ్బారావు చెప్పలేదు. వారం గడిచాక చెబుతానన్నాడు. వారం గడిచేసరికి చనిపోయాడు.

ప్రవీణ్‌కుమార్ కాక సుబ్బారావుకున్న మిగతా స్నేహితులందరూ వసంతకు బాగా తెలుసు. అందరిళ్ళకూ రాకపోకలున్నాయి. అందరికీ సుబ్బారావంటే ఎంతో యిష్టం. ఆడా, మగా అందరూ సుబ్బారావు తెలివితేటల్నీ, నెమ్మదితనాన్నీ, సమయస్ఫూర్తినీ మెచ్చుకునేవారు. ఒక స్నేహితుడి భార్య మృణాళినికి వసంత దగ్గర చనువెక్కువ. పెళ్ళికి ముందు పరిచయమయుంటే సుబ్బారావును వసంతకు దక్కనిచ్చేదాన్ని కాదనీ—తనే పెళ్ళి చేసుకుని ఉండేదాన్ననీ ఆమె వసంతతో అంది. వీలుంటే అతడితో ఎఫైర్ పెట్టుకోవాలనుందని కూడా అందామె.

మృణాళిని మాట్లాడే పద్ధతి తమాషాగా ఉంటుంది. ఆమె నిన్ను చంపేస్తానని అన్నా తేలిగ్గా తీసుకోవాలనిపిస్తుంది తప్ప కోపం రాదు. మృణాళిని కారణంగా వసంతకు భర్తంటే ఆరాధనా భావం పెరిగింది తప్ప—

మృణాళినిపై కోపం రాలేదు. అయితే ఆమె భర్తను మృణాళిని మాటలు చెప్పింది.

"నువ్వు చెప్పింది వింటూంటే నా కాళగానే ఉంది. కానీ మృణాళిని భర్త పెద్ద గూండా. పెద్దమనిషిలా కనబడతాడు కానీ పెద్దమనుషుల్ని కూడా నడి బజార్లో పాడిచేయగల మొండిధైర్యం మనిషి...." అన్నాడు సుబ్బారావు.

అప్పుడు వసంత భయపడింది. కానీ ఆమెకు తెలిసి సుబ్బారావుకీ, మృణాళిని భర్తకూ యెప్పుడూ గొడవలు జరగలేదు.

సుబ్బారావుకు మరో ముఖ్య స్నేహితుడు లక్ష్మీనారాయణ. ఆయన వయసులో సుబ్బారావు కంటె పదిహేనేళ్ళయినా పెద్దయి ఉంటాడు. ఆయన వసంతను చనువుగా అమ్మాయ్ అని పిలుస్తాడు. ఆయనకు వ్యాపారముంది. సుబ్బారావుతో ఆయన—"నువ్వెన్నేళ్ళుద్యోగం చేసినా ఇంతే! నీ తెలివితేటల్ని సైన్సుమీంచి తప్పించి నాతో చేతులు కలుపు. ఏడాది తిరక్కుండా లక్షాధికారిని చేస్తాను...." అన్నాడు చాలాసార్లు. సుబ్బారావు నవ్వి ఊరుకుంటే—"నువ్వయినా చెప్పవమ్మా మీ ఆయనకి" అంటూండేవాడు. సుబ్బారావు తన మాటలు వినడంలేదని ఆయనకు కోపంగా ఉండేది. వసంత ఆయన గురించి సుబ్బారావు నడిగితే—"మనిషలా కనిపించినా ప్రమాదకరమైనవాడు. ఆయనతో దూరంగా ఉన్నంత కాలమే స్నేహం. కాస్త దగ్గరయ్యామంటే మనం ఫినిష్—" అని తన అభిప్రాయం చెప్పాడతడు. కానీ సుబ్బారావు మరణానికి పదిరోజులకి ముందు లక్ష్మీనారాయణ అతణ్ణెంతగానో మెచ్చుకుని—"నీ సలహాలవల్ల నాకు లక్షల్లో

లాభించింది. చాలా థాంక్స్—వారంరోజుల్లో నువ్వు నాతో జాయినయ్యావా సరే—లేకుంటే నిన్ను పైన్సుకి మాత్రం మిగలనివ్వను—" అన్నాడు. ఆయన వెళ్ళిపోయాక సుబ్బారావు—"లక్ష్మీనారాయణగారు నా గురించి సీరియస్‌గానే ఉన్నారు. నేనూ సీరియస్‌గా ఆలోచించాలి—" అన్నాడు.

"మీ రాయనకు నిజంగా సలహా నిచ్చేరా?"

"ఇచ్చాను—నెల్లాళ్ళ క్రితం. ఆయన చెప్పింది విని—సలహా ఇమ్మని బలవంత పెడుతూంటే—నాకు తోచింది చెప్పాను. అందువల్ల నిజంగానే లక్షల్లో లాభించిందంటే నా కాశ్చర్యంగా ఉంది. ఆయన మాటలు నమ్మతగ్గవిగా లేవు...."

"మీ కాయన అబద్ధమెందుకు చెబుతాడు?"

"ఎందుకంటే నాలో నా శక్తిమీద నమ్మకం పెరగాలి. ఆశ పుట్టాలి. అందుకోసం నాకు లేని తెలివినీ, శక్తినీ అంటగట్టవచ్చు. నన్ను తన పార్ట్నర్‌గా చేసుకోవాలని ఆయన కోరిక...."

"ఎందుకు? ఆయనకు వేరే మనుషులు దొరకరా?—...."

"దొరుకుతారు. కానీ నిజాయితీపరులు కావాలాయనకు. తెలివితేటలు, చురుకుతనం, వ్యాపారదక్షత ఉన్న నాలాంటి మొహమాటస్థు లాయన కాదర్శం. ఆయన పదిలక్షలు లాభం తీసి నా వాటాకు లక్ష రూపాయలే యిచ్చినా నా కదితృప్తినే యిస్తుంది—ప్రతిఘటించాలనీ అనిపించదు. అందుకే ఆయన నా కోసం చూస్తున్నాడు—"

"మీ గురించి ఆయనకెలా తెలుసు?"

"అదే వ్యాపార లక్షణం. ఆయనకు నా గురించి— నీ కంటే యెక్కువ తెలుసు— ...." అన్నాడు సుబ్బారావు.

"అయితే ఆయనతో కలిస్తే ఏం?"

"కలవచ్చు. కానీ నాది సైన్సు బుర్ర. నాకు సైన్సుతోనే ముడివేసి ఉండాలనుంది. డబ్బుకోసం సైన్సు వదిలిపెట్టలేను—" అన్నాడు సుబ్బారావు.

డిటెక్టివ్ వెంకన్న ఆ కాగితాలు చదివి తెలుసుకున్న విశేషాలివి. దాన్నిబట్టి అతడికి కొన్ని విషయాలు అర్థమయ్యాయి.

సుబ్బారావు తన ఉద్యోగానికి అంకితమైన మనిషి. డబ్బు కూడా అతణ్ణి ఉద్యోగం నుంచి వేరుచేయలేదు. పరిశోధనలద్వారా అతడింతో యింతో పేరు గడించాడు. ఎవరయినా డబ్బాశ పెట్టి అతడి పరిశోధనలను వక్రమార్గం పట్టించాలనుకుంటే అతడంగీకరించే తరహా కాదు.

ప్రవీణ్‌కుమార్‌కి అతడి పరిశోధనలపై ఆసక్తి ఉంది. అతడెవరో—ఎలాంటివాడో తెలుసుకోవాలి. అతడికి సుబ్బారావును హత్యచేసే అవకాశముంది. సుబ్బారావు కనిపెట్టిన విశేషంవల్ల అతడేదో ప్రయోజనం పొందాడని వసంత చెబుతోంది. ముందుగా అదేమిటో తెలుసుకోవాలి.

రెండు మృణాళిని. ఆమె మాటలను వసంత సీరియస్‌గా తీసుకోకపోయి ఉండవచ్చు. కానీ మృణాళిని తెలివైనది కావచ్చు. తన మాటలను వసంత భర్తకు చేరవేస్తుందని ఆమెకు తెలుసు. అందువల్ల సుబ్బారావుకు తనపై ఆకర్షణ పుట్టవచ్చునని ఆమెకు తెలుసు. సుబ్బారావు భార్యవద్ద

విషయాన్ని తేలికగా తీసుకున్నట్లు నటించినా—అతడు మృణాళినికోసం ప్రయత్నించి ఉండవచ్చు. ఆ ప్రయత్నాలవామె భర్త తెలుసుకుని ఉంటే—అంతే సంగతులు! సుబ్బారావు మృణాళిని భర్త గురించి కొంత సమాచారం సేకరించి ఉంచాడు. మృణాళిని భర్త కతణ్ణి హత్యచేసే అవకాశముంది.

ఇక మిగిలింది లక్ష్మీనారాయణ. బిజినెస్ పార్ట్నర్ గా చేరనంత మాత్రాన ఏ వ్యాపారస్థుడూ—ఒక వ్యక్తిని హత్య చేయాలనుకోడు. లక్ష్మీనారాయణ సుబ్బారావును హత్య చేయాలనుకుంటే అందుకింకా బలమైన కారణం మరేదో ఉండివుంటుంది. అదేమిటో తెలుసుకోవాలి.

మొత్తంమీద సుబ్బారావు—చిత్రమైన మనిషిలాగే ఉన్నాడు. అతడు శ్రద్ధగా పరిశోధనలు చేస్తున్నాడు. అమ్మాయిల నాకర్షిస్తున్నాడు. వ్యాపారుల నూరిస్తున్నాడు. వీటన్నింటినీ కలిపి చూస్తే!

"ఆఫీసులో—సుబ్బారావు శీలం గురించి విచారించాలి—" అనుకున్నాడు వెంకన్న.

# 4

సెంట్రల్ గవర్నమెంటు లాబరేటరీలో వెంకన్న అనుచరులు సేకరించిన సమాచారం ప్రకారం సుబ్బారావు ప్రవర్తన చిత్రమైనది. అతడిగురించి అందరూ తలో రకంగానూ చెప్పారు. కొందరతడు కోపిష్టి అన్నారు. కొందరతడు మహాశాంతపురుషుడన్నారు. కొంద రతడు గర్విష్ఠి అన్నారు. కొందరతడికున్న వినయం ఆదర్శప్రాయమన్నారు. కొందరతడు ముభావం మనిషంటే మరి కొందరతడు వాగుడుకాయన్నారు. కొందరతడు భక్తిపరుడంటే మరికొందరతడు విలాసపురుషుడన్నారు. ఎక్కువ

మంది అమ్మాయిలతడంటే సదభిప్రాయం వ్యక్తపరిస్తే ఇద్దరమ్మాయిలు మాత్రం మరోలా చెప్పారు. ఒకమ్మాయి తన కతడి చూపులు నచ్చవంది. మరో అమ్మాయి అతడు తన చేయి పట్టుకున్నాడని కూడా చెప్పింది.

ఈ సమాచారం సేకరించడానికి వెంకన్న అనుచరులు తమ తెలివితేటలుపయోగించాల్సి వచ్చింది. అందరూ అంత సులభంగా తమ భావాలు బైటపెట్టరు. అవతలి వ్యక్తి పోలీసుల మనిషి కాదన్న నమ్మకం వారిలో కల గాలి.

వెంకన్న వారినభినందించి బయటి సమాచారం కూడా సేకరించమన్నాడు.

అప్పటివరకూ అతడు సేకరించిన సమాచారంలో అతి ముఖ్యమైనది—సుబ్బారావు చనిపోయే ముందు—ఆఫీసులో అతణ్ని కలుసుకుందుకో బయటి వ్యక్తి వచ్చాడు. విజిటర్స్ బుక్‌లో అతడు తన పేరు శ్రీకాంత్ అని వ్రాశాడు. అతడు కలుసుకున్న సమయం మూడుగంటలు. ఆ సమయంలో అతడు సుబ్బారావుతో కలిసి టీ త్రాగాడు. టీ తాగేముందు శ్రీకాంత్—మధుమూర్తివద్ద పనిచేసే లాబొరేటర్ అసిస్టెంటు సుధాకర్‌ని కూడా కలుసుకున్నాడు.

వెంకన్న తన అనుచరులకు సూచనలిచ్చి—శ్రీకాంత్ వివరాలు సేకరించమన్నాడు.

వాళ్ళుపనిలో ఉండగా అతడు తనకు తెలిసిన సమాచారాన్ని మననం చేసుకోసాగాడు. దాన్నిబట్టి సుబ్బారావు గురించి వెంకన్న కొంత ఊహించాడు.

సుబ్బారావు చురుకయినవాడు. కులాసా పురుషుడు. అన్నింటికీ మించి ఎవరిదగ్గ రెలా మసలాలో తెలిసిన

కావ్యడు. అతడి గురించి చెప్పినవారిలో అతణ్ని నిందించినవారు, అతడి గురించి చెడ్డగా చెప్పినవారు తక్కువ. కొందరతణ్ని ముభావంగా ఉంటాడన్నారు. కొందరు వాగుడుకాయన్నారు. అంటే సుబ్బారావందరి దగ్గరా అతిగా వాగడు కానీ బాగా వాగే అలవాటుంది.

ఇలాంటి వ్యక్తికి పెద్ద పెద్ద పరిచయాలుంటాయి. అంతా అతణ్ని ఉపయోగించాలనుకుంటారు. తన పరిశోధనల గురించి యితరులెవ్వరికీ చెప్పడని సుబ్బారావు భార్య వసంత అంది. కానీ అసలు విషయమామెకు తెలిసుండక పోవచ్చు. భార్యతో సైన్సు మాట్లాడే పెద్దమనిషి—మరెందరితోనో ఆ విషయం మాట్లాడుతూంటాడని ఊహించవచ్చు. మనిషి వాగుడుకాయ కాకుండా ఉండాలిగానీ—ఉంటే తన గురించి ప్రచారం చేసుకోకుండా ఉండలేడు. సుబ్బారావు తన పరిశోధనల గురించి ఇతరులతో మాట్లాడుతూంటాడనడానికి సాక్ష్యం—ప్రవీణ్‌కుమార్. ఆ ప్రవీణ్‌కుమారెవరో వసంతక్కూడా సరిగ్గా తెలియదు. అంటే వారిద్దరికీ పరిచయం ఇంటి బయటే జరిగుండాలి. ప్రవీణ్‌కుమార్ పేరుతో లేబరేటరీలో ఉద్యోగులెవ్వరూ లేరు. ప్రవీణ్‌కుమార్ వంటి వారింకా యెందరున్నారో తెలుసుకోవాలి. అలాంటివారెవరో అతడినంతంచేసి ఉండాలి.

వెంకన్న ఇంత దీర్ఘంగా ఆలోచిస్తున్నాడంటే అందుకు కారణముంది. లాబరేటరీలో సుబ్బారావు చేస్తున్న ప్రయోగాల గురించి అతడు విచారించాడు. అవి చాలా మామూలు పరిశోధనలు. నేరస్థులతో పరిచయముండే పరిశోధనలు కావవి. నేరస్థులకు సంబంధించినవి కూడా కావు.

సుబ్బారావు ఆర్గానిక్ కెమిస్ట్రీలో డాక్టరేట్ తీసుకున్నాడు. అతడి పరిశోధన లెక్కువగా ఆల్కహాల్సుకు సంబంధించినవి. ఆల్కహాలు తయారీ, వాటి లక్షణాలు గురించి కొత్త విశేషాలనతడు ఇంటర్నేషనల్ జర్నల్స్‌లో తను కనిపెట్టిన విశేషాలు పబ్లిష్ చేశాడు. విశేషాలు కొత్తవే అయినా నేరస్థులకు పనికిరావు.

డిటెక్టివ్ వెంకన్న అనుమాన మేమంటే—సుబ్బారావు తనకున్న పరిచయాల దృష్ట్యా ఇతరత్రా ప్రయోగాలు చేస్తున్నాడని! ఆ ప్రయోగాల నతడు ఆత్మతృప్తికో ధనాశతోనో చేస్తూండి ఉండవచ్చు. కానీ అతడి పరిచయాలకు కారణం—అతడి ఇతర పరిశోధనలే!

ఆ పరిశోధన లేమిటో తెలుసుకోవాలంటే అందుకు ప్రవీణ్‌కుమార్‌ను పట్టాలి. అతడెవరో—యెలాంటివాడో తెలుసుకోవాలి....

వెంకన్న అనుచరు లతడికి కార్యం సులభం చేశారు....

ఎక్స్-32 యే సమయంలో సుబ్బారావు శరీరంలో ప్రవేశించడానికవకాశముందో ఆ సమయంలో ఆఫీసులో అతణ్ణి కలుసుకున్న శ్రీకాంత్ అనే వ్యక్తికి పరిచయస్థులో ప్రవీణ్‌కుమార్ అనే వ్యక్తి ఉన్నాడు. ఆ ప్రవీణ్‌కుమార్ చిరునామా కూడా యిప్పుడు తెలిసింది.

వెంకన్న ప్రవీణ్‌కుమార్ యింటికి స్వయంగా వెళ్లాడు. అది యిల్లు కాదు. చిన్న గది. ఓ మధ్య తరగతి గృహస్థు తనింటి వీధిగదిని నూర్రూపాయల కద్దెకిస్తే అందులో ఉంటున్నాడు ప్రవీణ్‌కుమార్. సమయానికి ప్రవీణ్‌కుమార్ ఊళ్ళో లేడు.

ఇంటాయన్ను వెంకన్న ప్రవీణ్‌కుమార్ గురించి

ప్రశ్నలు వేశాడు. ఇంటాయన అతడి గురించి వివరంగా చెప్పాడు—"కుర్రాడు చాలా బుద్ధిమంతుడనే చెప్పాలి. మా యింట్లో పెళ్ళీడొచ్చిన ఆడపిల్లలిద్దరున్నారు. వాళ్ళ వంక ఒక్కసారి కూడా కన్నెత్తయినా చూడలేదు. కానీ "

"ఊఁ కానీ "

"అతడేం ఉద్యోగం చేస్తున్నాడో నాకు తెలియదు. రాత్రిళ్ళెక్కువగా యింట్లో వుండడు. టైము ప్రకారం ఆఫీసుకు వెళ్ళడం చూడలేదు. పగలు సాధారణంగా యింట్లోనే వుంటాడు. ఏం చేస్తాడో తెలియదింట్లో కూర్చుని. పనిమనిషి చెప్పిన ప్రకారం—ఇంట్లో బ్రాందీ, విస్కీ బాటల్సున్నాయి. అంటే గదిలో తాగుతూంటాడనుకోవాలి...."

"మరలాంటి వాణ్ణింట్లో ఎలా ఉండనిచ్చారు?"

"అలాంటివాడనుకునేందుకతడెప్పుడూ తప్పుగా ప్రవర్తించలేదు. బైటకు స్తేచాలు-తలవంచుకునే వుంటాడు. ముఖ్యంగా ఆడవాళ్ళతో మాట్లాడేటప్పుడు...." అన్నాడు ఇంటాయన.

"అద్దె సక్రమంగా యిస్తాడా?"

"డబ్బు విషయంలో అతడినేమీ అనుకుందుకులేదు. అతడి వ్యవహారం చూసి నాకనుమానం వచ్చి—ఒక రోజున డబ్బప్పు కావాలన్నాను. అప్పుతీసుకుంటే అది అడ్వాన్సుగా ఉంచుకోవచ్చని నా ఆశ. ఎంత కావాలన్నాడతడు. వెయ్యిరూపాయలన్నాను. మర్నాటికిస్తానన్నాడు. నిజంగానే యిచ్చేశాడు. నేను చాలా ఆశ్చర్యపడ్డాను. అంతేకాదు. ఆ తర్వాత నెల ఫస్టుతారీఖుకల్లా అద్దెడబ్బులిచ్చి—"అప్పు మీ వీలునుబట్టి తీర్చండి. నేను అద్దె

మామూలుగానే యిస్తుంటాను. రెండింటికీ లంకె పెట్టడం నాకిష్టముండదు—" అన్నాడు. ఇది జరిగి ఏడాది దాటింది. నేనింకా అతడికారువందలు బాకీ—"

వెంకన్న ఆశ్చర్యంగా— "అతణ్ని మీరేం ఉద్యోగం చేస్తున్నాడో అడిగి తెలుసుకోలేదా?" అన్నాడు.

"ఎందుకు?" అన్నాడింటాయన.

"మన దేశంలో అది సహజం. ప్రవీణ్ కుమార్ మంచి పెళ్ళికొడుకు—"

ఇంటాయన మొహమాటంగా—"నిజం చెప్పాలంటే నేనతడి వివరాలు తెలుసుకుందుకు ప్రయత్నించాను. పేరు తప్ప ఇంకేమీ నిజం చెప్పడం లేదని నాకు తోచింది. ఒకటి రెండుసార్లతడి తలిదండ్రుల ప్రస్తావన తెచ్చి— పెళ్ళి చేయకుండా ఎందుకూరుకున్నారని—అడిగాను. బదులుగా అతడు తాను పెళ్ళే చేసుకోనన్నాడు...." అన్నాడు.

"ఎందుకట?"

"ఎందుకో తెలియదు కానీ అతడు పెళ్ళికి విముఖుడు. అతడికి తాగుడు అలవాటు బాగా వుందని రూఢి అయింది నాకు. కానీ దాంతో అతడెవర్నీ ఇబ్బంది పెట్టాడనుకోను. అతడి ఉద్యోగం కూడా—నలుగురూ చేసేటైపు కాదనిపించింది. ఎందుకో మా ఆవిడకతడు నచ్చలేదు. పెళ్ళికొడుకుల లిస్టులోంచి అతడి పేరు తీసేశాం...."

వెంకన్న ఇంటాయన్ను ప్రవీణ్ కుమారే ఊరెళ్లాడో అడిగాడు.

"అతడి పేరేకానీ ఊరు తెలియదు నాకు—" అన్నాడింటాయన.

ఎప్పుడో స్తాడనడిగితే—వెళ్ళిన రోజే కానీ వచ్చేరోజూ తెలియదన్నాడాయన. వెళ్ళిన రోజుకు సరిగ్గా మూడు రోజుల తర్వాత సుబ్బారావు చనిపోయాడు.

ఆ యింట్లో ప్రవీణ్ కుమార్‌ని కలుసుకునేందుకు స్నేహితులు కానీ, బంధువులు కానీ రాలేదు.

వెంకన్న ఇంటాయనకు థాంక్స్ చెప్పి అక్కణ్ణించి బైటపడ్డాడు.

# 5

శ్రీకాంత్‌ను వెంకన్న స్వయంగా కలుసుకోలేదు. అయితే అతడి గురించిన విశేషాలు వెంకన్న నాశ్చర్య చకితుణ్ని చేశాయి.

శ్రీకాంత్ రాష్ట్ర ప్రభుత్వోద్యోగి. నెలకు పన్నెండు వందల జీతం. భార్య, యిద్దరు పిల్లలు. పిల్లలిద్దరూ మగాళ్ళు. శ్రీకాంత్ తలిదండ్రులు, అత్తమామలు— అత్యంత సామాన్యులు. శ్రీకాంత్ చేసే ఉద్యోగంలో లంచాలు దొరికే అవకాశం చాలా తక్కువ అనడం కంటే—లేదనడమే సరైన మాట.

అంతవరకూ బాగానే ఉంది.

శ్రీకాంత్ భార్య పండుగల్లో పట్టుచీరలు, ఎ త ప్పుడు గార్డెన్ సిల్కు చీరలు కడుతుంది. వాళ్ళింట్లో పనిమనిషి, వంటమనిషి కూడా ఉన్నారు. శ్రీకాంత్ కొడుకులిద్దరికీ బంగారపు మురుగులున్నాయి. అతడింట్లో ఖరీదైన ఫర్నిచర్‌తో పాటు కలర్ టీవీ, వీసీఆర్ కూడా ఉన్నాయి.

శ్రీకాంత్ ఇంటద్దెగా ఎనిమిదివందలిస్తున్నాడు. అతడికి బజాజ్ చేతక్ స్కూటరుంది. కారు లేకపోవడం ఆశ్చర్యం.

అతడికి ఎక్కడిదింత డబ్బు?

శ్రీకాంత్ పై అవినీతి ఆరోపణలు లేవు. ఇన్ కం టాక్స్ డిపార్టుమెంట్ రెయిడ్స్ చేయలేదు. ఇంకా చెప్పాలంటే అతడు కొన్న ప్రతి వస్తువూ ఆఫీసులో డిక్లేర్ చేయబడింది. చాలా వస్తువులతడు తలిదండ్రులు, అత్తమామల నుంచి గిఫ్టుగా పొందినట్లు ప్రకటించాడు. గిఫ్టు టాక్స్ ఆయా వస్తువులకు సక్రమంగా పే చేయబడింది.

శ్రీకాంత్ భార్య చాలామందికి ప్రయివేట్లు చెప్పి డబ్బు సంపాదిస్తోందని అతడాఫీసులో డిక్లేర్ చేశాడు. ఆ ఆదాయమెప్పుడూ ఇన్ కంటాక్స్ పరిమితులకు లోబడే ఉంటోంది.

అతడుండే వీధిలో వాకబు చేయగా శ్రీకాంత్ భార్య యెవరికీ ప్రయివేట్లు చెప్పడంలేదని తెలిసింది. లోతుగా వాకబు చేయగా శ్రీకాంత్ కి చాలా పెద్ద పరిచయాలున్నాయనీ—ఆ పలుకుబడితో తమ వీధిలోని వారందరికీ సహకరించడంవల్ల—అందరూ అతణ్ణభిమానిస్తారే తప్ప-అతణ్ని చూసి అసూయపడడంలేదనీ అర్థమయింది.

వెంకన్న శ్రీకాంత్ గురించి బాగా ఆలోచించాడు.

సుబ్బారావు హత్యకేసు—సరైన దారిలోనే వెడుతోందనిపించిందతడికి.

వెంకన్న అనుమానిస్తున్న ప్రకారం సుబ్బారావు పరిశోధన సంఘవిద్రోహకర శక్తులకు సహకరించాల్సి వుంది. అలా జరక్కపోవడంతో వాళ్ళు సుబ్బారావును హత్య చేయాలనుకున్నారు. శ్రీకాంత్ సంఘవిద్రోహకర

శక్తులతో చేతులుకలిపాడనడానికి సందేహంలేదు. అతడు అక్రమంగా ధనం సంపాదిస్తున్నాడు.

సుబ్బారావును శ్రీకాంత్ కలుసుకున్నాడు. బహుశా అతడే ఎక్స్-32 ను సుబ్బారావు శరీరంలో ప్రవేశపెట్టి వుండవచ్చు. ఇద్దరూ కలిసి టీ తాగారు. డాక్టరు చెప్పిన సమయం, వారిద్దరూ కలిసి టీ తాగిన సమయం ఒక్కటే!

ఎక్స్-32 శ్రీకాంత్ కి అందుబాటులో లేదు. అది సుధాకర్ కీ, మధుమూర్తికీ అందుబాటులో వుంది. శ్రీకాంత్ సుబ్బారావును కలుసుకునే ముందు సుధాకర్ని కలుసుకున్నాడు.

ఏం జరుగుతుందీ యెలా జరుగుతుందీ డిటెక్టివ్ వెంకన్న ఊహించగలుగుతున్నాడు. కానీ ఎందుకు జరిగిందీ తెలిసేవరకూ అతడి ఊహాకు విలువ, అర్థం—వుండవు.

# 6

"మీ పరిశోధనలెంతవరకూ వచ్చాయి?" అన్నాడిన స్పెక్టర్ శంకర్రావు కుతూహలంగా.

"మీ పోలీసులెంత దాకా పయనించారో ముందు నేను తెలుసుకోవాలి—" అన్నాడు వెంకన్న.

శంకర్రావతడికి శ్రీకాంత్ గురించి చెప్పాడు. పోలీసులు తెలుసుకున్న వివరాలకంటె వెంకన్న అనుచరులు సేకరించిన సమాచారమే ఎక్కువ. వెంకన్న అతడికి తన పరిశోధనల వివరాలన్నీ చెప్పి—"మా పరిశోధనలో మాకెక్కడా ప్రవీణ్ కుమార్ తగిలినట్లు లేదు. ఈ కేసు లింకంతా శ్రీకాంత్, ప్రవీణ్ కుమార్ లలో వుంది—" అన్నాను.

"అంతేనా—మరి మృణాళిని, లక్ష్మీనారాయణల

సంగతేమిటి?" అన్నాడు శంకర్రావు.

"మృణాళినిని రెండుమూడుసార్లు—ఇంటిదగ్గర కలుసు కున్నాడు సుబ్బారావు. ఆ విషయం అతడి భార్యకు తెలియదు. మృణాళిని భర్తకూ తెలియదని నా నమ్మకం. మృణాళిని భర్త నెలరోజులుగా ఊళ్ళోలేడు. ఆఫీసు పనిమీద అతడు ఢిల్లీకి లాంగ్ టూర్ మీద వెళ్ళాడు. ఇంకా రాలేదు. ఇక లక్ష్మీనారాయణ సంగతి తీసుకుంటే ఆయన సీదాసాదా వ్యాపారస్థుడిలాగే వున్నాడు. ఆయనకు సుబ్బారావంటే వాత్సల్యమున్నట్లు కనబడు తుంది—...." అన్నాడు వెంకన్న.

"మీరు కాదంటే సరేగానీ—మీరు చెప్పిన కార ణాలు నాకంత సబబుగా అనిపించలేదు...."

"శంకర్రావుగారూ! ఎవరైనా హత్యచేయడాని కొకోసారి చిన్న కారణం సరిపోవచ్చు. కానీ ప్రతి చిన్న కారణానికీ హత్యలు జరుగుతాయంటే — ఈ ప్రపం చంలో జనాభా మిగలదు—" అన్నాడు వెంకన్న.

"నేను శ్రీకాంత్ గురించి చాలా ఆచూకీలు తీశాను. అతడు దళారీలాంటి వాడు. ఎక్కడా తన ప్రమేయం లేకుండా తెలివిగా వ్యవహరిస్తున్నాడు. నా అనుమానం అతడు రహస్య సమాచారాన్ని సేకరించి—పెద్దమనుషుల కమ్ముతున్నాడని...."

"కరెక్ట్....బాగా తెలుసుకున్నారు....ఇక మీరు ప్రవీణ్ కుమార్ గురించి తెలుసుకోవాలి. అతడు పరారీలో ఉన్నాడని నా అనుమానం. మీరు దేశంలోని వివిధ పోలీసుస్టేషన్లకతడి గురించి హెచ్చరిక పంపండి..."

"ఒక చిన్న హత్యకేసులో సాధారణమైన అను మానంమీద అతడి గురించి ఇంత పెద్ద చర్య తీసు

కోరడం సబబు కాదేమో!"

"శంకర్రావుగారూ! ఇది చిన్న హత్యకేసు కాదు. ప్రవీణ్‌కుమార్ వివరాలు తెలిసేదాకా — ఇదెంత ప్రమాదకరమైనదో అంచనా కూడా వేయలేం...."

"సరే — పై ఆఫీసర్లతో మాట్లాడి చూస్తాను...." అన్నాడు శంకర్రావు.

అక్కణ్ణించి వెంకన్న ఇంటికి వెళ్ళేసరికో వార్త అతడికోసం యెదురు చూస్తోంది.

పోస్టుమార్టం జరిగిన వెంటనే శవాన్ని బంధువుల కప్పగించడం జరిగింది. సుబ్బారావు తలిదండ్రులు వసంతను శాపనార్థాలు పెట్టారు. వసంత తలిదండ్రులామెనింటికి తీసుకుని వెడతామన్నారు. వెంకన్న వారితో "సుబ్బారావు హత్యచేయబడ్డాడు. ఇందులో దేశద్రోహుల కుట్ర ఉందని నా అనుమానం. వారిని బైట పెట్టేవరకూ ఆమెను మా యింటనే ఉండనివ్వాలి. ఆమె ప్రాణాలు ప్రమాదంలో ఉన్నాయి. మా యింటనేగానీ మీ యింట ఆమెకు రక్షణ ఉండదు...." అన్నాడు.

నిజానికి వసంత ప్రాణాలు ప్రమాదంలో ఉన్నదీ లేనిదీ వెంకన్నకు తెలియదు. సుబ్బారావు కేసు చాలా చిత్రంగా ఉంది. అతడు హత్యచేయబడ్డానికి కారణం దొరికేవరకూ ఆమెను వెంకన్న తనింట్లోనే ఉంచుకోవాలని సంకల్పించాడు. అందుకు వసంత తలిదండ్రులూ అంగీకరించారు. వసంత కూడా ఒప్పుకుంది.

ఆరోజు వసంతకోసం రామ్మూర్తి వచ్చాడు. రామ్మూర్తి యువకుడు. సుబ్బారావు స్నేహితుడు. వసంత అతణ్ణి కలుసుకోవడానికి నిరాకరించింది. సీతమ్మ, రాజమ్మ రామ్మూర్తిని చాలా ప్రశ్నలు వేశారు.

"నేను బ్రహ్మచారిని. వసంత అందం నన్నాకర్షించింది. ఆ మైకంలో నాకేమీ తెలియలేదు. సుబ్బారావు నాకు మంచి స్నేహితుడన్న విషయం కూడా విస్మరించి ఆమెకు దగ్గర కావాలని ప్రయత్నించాను. ఆరంభంలో ఆమె ప్రతిఘటించింది. క్రమంగా నా ఆకర్షణకు లొంగిపోయింది. మా యిద్దరిమధ్యా నడిచే వ్యవహారం చాలాకాలం రహస్యంగానే జరిగింది. కొన్నాళ్ళ క్రితం మేమిద్దరం రెడ్ హాండెడ్ గా సుబ్బారావుకు పట్టుబడ్డాం. అతడు చాలా అప్సెట్టయ్యాడు. నన్నేమీ అనలేదు. భార్యను కూడా ఏమీ అనలేదని తెలిసింది నాకు. నేనతడికి ముఖం చూపించలేకపోయాను. జరిగిందానికి క్షమార్పణ చెప్పుకోవాలనుకున్నాను. కానీ ఈలోగానే అతడాత్మహత్య చేసుకున్నాడు. వసంతపట్ల నాకూ కొంత బాధ్యత వుంది. ఆమెకు ధైర్యం చెప్పడానికి వచ్చాను. ఆమెను వివాహం చేసుకుని చేయూతనివ్వడానికి సిద్ధంగా వున్నాను నేను. కానీ ఆమెకు నామీద కోపంగా ఉంది. ఇందులో తప్పు నా ఒక్కడిదే కాదు. మా యిద్దరిదీను. నా తప్పును నేను సవరించుకునేందుకు సిద్ధంగా వున్నాను.." అన్నాడు రామ్మూర్తి.

అతడు వెళ్ళిపోయాక సీతమ్మ, రాజమ్మ అతడేమన్నదీ—వసంతకు చేరవేశారు. వసంత కళ్ళెర్రబడ్డాయి.

"వాడు నరరూప రాక్షసుడు. కామపిశాచి. స్నేహితుడి భార్యనని తెలిసీ నన్ను కామించాడు. నేను వారికి ఫిర్యాదు చేశాను. వారు వాణ్ని మందలించారు. అప్పుడు వాడు తప్పంతా నాదే అన్నట్లు వారితో మాట్లాడేడు. నా ప్రవర్తన గురించి అబద్ధాలు చెప్పాడు. వారు మంచివారు. వాడి అబద్ధాలు నమ్మలేదు. వాడిని కోప్పడి మళ్ళీ

తనకు ముఖం చూపలేకపోతున్నారు. వాడు నా గురించి చెప్పిన మాటలన్నీ చెప్పి—"అవి నేను నమ్మడంలేదు. నువ్వు నా దానివి. నేను నీ మాటలే నమ్ముతాను. ఒకవేళ వాడు నిజమే చెప్పినా సరే—అది గతం. నా కా గతంతో నిమిత్తంలేదు—" అన్నారు. అంత మంచివారు వారు—....." అందామె.

వసంత అభిప్రాయంలో—వాడిప్పు డవకాశం దొరికింది కదా అని ఆమెను దక్కించుకోవాలనుకుంటున్నాడు.

ఈ సమాచారం విన్న వెంకన్న ఆలోచనలో పడిపోయాడు.

రామ్మూర్తి విషయాన్ని వసంత ఇంతకాలమూ బైట పెటలేదు. కేసులో చాలా పెద్ద మిస్సింగు లింకు. తనకు తానే బయట పడ్డాడు కాబట్టి కానీ రామ్మూర్తి గురించి తెలుసుకోవడం తమకు సాధ్యపడేది కాదు.

రామ్మూర్తికీ వసంతకూ మధ్య యేదో వ్యవహారం నడిచింది. అది సుబ్బారావుకి తెలిసింది. ఆ తర్వాత సుబ్బారావు మరణించాడు. అది హత్యయితే వసంత, రామ్మూర్తి కలిసి చేసి వుండవచ్చు. ఎక్స్-32 గురించి వసంత రామ్మూర్తికి చెప్పివుండవచ్చు. తన పరిశోధనల గురించి అన్నీ చెబుతూండే సుబ్బారావు భార్యకు లాబొరేటరీలో యితర విశేషాలు చెప్పననుకుందుకు లేదు. ఆమెకు ఎక్స్-32 గురించి తెలిసే వుంటుంది.

లేదా వసంత నిర్దోషి. కానీ సుబ్బారావు రామ్మూర్తి మాటలు నమ్మాడు. నమ్మలేదని భార్యకబద్ధం చెప్పాడు. మానసికంగా బాధపడుతూ తట్టుకోలేక ఒకరోజున ఆత్మహత్య చేసుకున్నాడు.

అయితే ఎక్స్-32 అతడిదాకా ఎలా వచ్చింది? అతడి ప్రయోగాల్లో ఎక్కడా ఎక్స్-32 అవసరమున్నట్లు లేదు. అతడు ఎక్స్-32 తననుంచి తీసుకున్నట్లు సైంటిస్టు మధుమూర్తికూడా చెప్పలేదు.

అప్పుడు వెంకన్నకు స్ఫురించింది—సుబ్బారావుకు డైరీ వ్రాసే అలవాటు గనుక ఉన్నట్లయితే—అది చూడాలి! అందులో చాలా విశేషాలు బయటపడవచ్చు. కానీ వసంత అతడికి డైరీ రాసే అలవాటు లేదని చెప్పినట్లు గుర్తు.

వెంకన్న వెంటనే వసంతను కలుసుకుని రామ్మూర్తి విషయమడిగి—"నువ్వు మొదట ఈ రామ్మూర్తి వ్యవహారం బయటపెట్టకపోవడంవల్ల — నిన్నిప్పుడనుమానించక తప్పదు. నీ నిజాయితీని నీ భర్త ఒక్కడే నిరూపించగలడు. లేదా అతడి డైరీ నిరూపించగలదు. దురదృష్టవశాత్తూ అతడికి డైరీ రాసే అలవాటు లేదు—" అన్నాడు.

"వెంకన్నగారూ! ఇబ్బందికరమైన విశేషాలు దాచిపెట్టిన మాట నిజం. మావారు డైరీలో ఉన్నదున్నట్లు రాస్తారు. అందులో మా యిద్దరికీ సంబంధించిన వ్యక్తిగతానుభవాలు కూడా వివరంగా వున్నాయి. అందుకే దాని గురించి అబద్ధం చెప్పాను. వారు డైరీ రాస్తారు. ఆ డైరీ నా నిజాయితీని ఋజువు చేస్తుంది—...." అంది వసంత.

కేసిలా మలుపుతిరిగినందుకు వెంకన్న ఆశ్చర్యపడ్డాడు. సంతోషపడ్డాడు. మనసులోనే రామ్మూర్తి నభినందించుకున్నాడు.

మరి కాసేపట్లో సుబ్బారావు డైరీ వెంకన్న చేతికి

వచ్చింది. వెంకన్న ఆ డైరీ చదివాడు. చదివినందుకు తర్వాత అతడు బాధపడ్డాడు కూడా. అందులో భార్యా భర్తలకు సంబంధించిన ప్రయివేటు విషయాలు చాలా యెక్కువగా వున్నాయి. అందులో రామ్మూర్తి ప్రస్తావన వుంది. సుబ్బారావు రామ్మూర్తిని అసహ్యించుకున్నాడు. రామ్మూర్తివంటి స్నేహితుడి నింటికి రానిచ్చి భార్యను బాధపెట్టానని వ్యథ చెందాడు. మళ్ళీ తమ ఇంటికి వస్తే యే కాఫీలోనో స్లోపాయిజనిస్తానని భయపెట్టి అతడితో తెగతెంపులు చేసుకున్నాడు.

విశేషమేమిటంటే అందులో ఎక్కడా ప్రవీణ్ కుమార్ ప్రసక్తిలేదు. డైరీ నిండా—అతడికీ భార్యకూ సంబంధించిన విశేషాలే వున్నాయి.

వెంకన్న డైరీని వసంతకు తిరిగిచ్చేసి — "నీవు చెప్పింది నిజం. రామ్మూర్తి నీ గురించి అబద్ధం చెప్పాడు. నేనతడి అంతు చూస్తాను. మీ వ్యక్తిగతానుభవాలకు సంబంధించిన ఈ డైరీని చదివినందుకు మన్నించు—" అన్నాడు.

వసంత తల వంచుకుని—"వారీ డైరీని నా కోసమే రాసేవారు. నా గురించి తనకు కలిగే భావాలన్నీ డైరీలో వ్రాసి—దీన్ని నీ వెప్పుడయినా చదువుకోవచ్చు—.... అనేవారు. అందులో మాకు సంబంధించి తప్ప మరేమీ వుండదు—అందుకే నేను దీని గురించి ముందుగా మీకు చెప్పలేదు—" అంది.

అర్థమయింది వెంకన్నకు. సుబ్బారావు భార్యను సంతోష పెట్టడానికి మాత్రమే డైరీ వ్రాసేవాడన్న మాట!

వెంకన్న డైరీ గురించి యింకా ఆలోచిస్తూండగానే

బయట్నుంచి ఫోన్ వచ్చింది.

"హలో!" అన్నాడు వెంకన్న.

"నేను శంకర్రావుని మాట్లాడుతున్నాను. మాట్లాడుతున్నది వెంకన్నగారేకదూ!"

"అవును—ఏమిటి విశేషం!"

"ప్రవీణ్ కుమార్ గురించిన వివరాలు తెలిశాయి. అతడు నేరస్థుడు కావటానికి వీల్లేదు. ప్రభుత్వ గూఢచారి శాఖకు చెందిన వ్యక్తి.... ఇప్పుడీ ఊళ్ళో అతడి మిషన్ అయిపోయింది. అతణ్ని ట్రేస్ చేయడం కూడా కష్టం...."

"వాట్...." అన్నాడు వెంకన్న.

# 7

వెంకన్న రామ్మూర్తి గురించి వాకబు చేశాడు. రామ్మూర్తిలో పెద్దగా విశేషాలేమీ లేవు. కానీ అతడికి శ్రీకాంత్ కీ పరిచయముంది.

"శ్రీకాంత్ తోనే ఈ కేసు లింకంతా ఉంది—" అనుకున్నాడు వెంకన్న. కానీ ఆ లింకును సాధించడమెలా?

వెంకన్న బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. అతడు లాబొరేటరీ అసిస్టెంటు సుధాకర్ ని స్వయంగా కలుసుకుని—"నువ్వు ఎక్స్-32 ని వేరే కాగితంలో వేసి పొట్లాం కట్టడం చూసినవాళ్ళున్నారు. ఆ సాక్ష్యం నిన్ను హంతకుణ్ని చేస్తుంది. నిజం చెబితే నిన్ను రక్షించగలను. లేదా—నీ కర్మ!" అన్నాడు.

సుధాకర్ భయపడ్డాడు—"నేనలాంటి పని చేయలేదు. మీ కెవరో అబద్ధం చెప్పారు—...." అన్నాడతడు.

"సరే—అయితే నీకేమయినా ఆ సీసా పోగొట్టుకుంటే త్వరగా వీలునామా వ్రాసుకో! సుబ్బారావు డైరీలో నీవు ఎక్స్-32 దొంగతనం చేస్తూండగా చూసినట్లు రాసుకున్నాడు. అదికాక ప్రతిరుక్కన్న వారి సాక్ష్యం కూడా వుంది—...."

సుధాకర్ క్షణం తటపటాయించి—"వెంకన్నగారూ! నేను ఎక్స్-32 దొంగిలించి తీసుకున్న మాట నిజం. కానీ నా కోసం కాదు. నేను దాన్ని వాడలేదు....—" అన్నాడు.

"మరి?"

"శ్రీకాంత్ కిచ్చాను...."

"శ్రీకాంత్ కీ నీకూ సంబంధమేమిటి?"

సుధాకర్ బయటపెట్టిన నిజం వెంకన్నని ఆశ్చర్య చకితుణ్ని చేసింది.

శ్రీకాంత్ దగ్గర రకరకాల మద్యాలున్నాయి. వాటిలో కొన్ని నూరేళ్ళ నాటివి. వాటి రుచి మద్యం తాగేవాడికే తప్ప తెలియదు. ఒకసారి వాటిని మరిగినవాడు—ఆ రుచి మరిగి వాటికోసం యేమైనా చేయగల్గుతాడు. శ్రీకాంత్ స్నేహితులందరూ అతడిచుట్టూ తిరిగేది వాటికోసమే! అతడు వారిని బాగా తాగించి తన కావలసిన రహస్యాలు రాబడుతూంటాడు. తనకావలసిన పనులు చేయించుకుంటాడు.

"శ్రీకాంత్ కీ సుబ్బారావుకీ సంబంధమేమిటి?"

"నాకు తెలిసి యే సంబంధమూ లేదు. ఒకరోజాయన సుబ్బారావుగారిని కలుసుకుందుకు వచ్చాడు. అప్పుడే నా దగ్గర ఎక్స్-32 తీసుకున్నాడు. ఆ రాత్రే సుబ్బారావుగారు చనిపోయాడు. ఇంతకు మించి నా కేమీ తెలి

యాదు— ."

"మాడు....నీ సాక్ష్యం చాలా అవసరం. నిన్ను రక్షించుకుందుకే కాదు. ఓ భయంకర నేరస్థుణ్ని బయట పెట్టడానికి...."

సుధాకర్ భయంగా—"నన్ను బయటకు లాగకండి. శ్రీకాంత్ సామాన్యుడు కాదు. అతడికి పెద్దవాళ్ళ అండ వుంది.అతడికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తే బహుశా నేను, నా కుటుంబం సర్వనాశనమయిపోతాం—...."
అన్నాడు.

"అలా జరగదని నేను హామీ యిస్తున్నాను—...."
అన్నాడు వెంకన్న. అతడి కిప్పుడెంతో సంతోషంగా వుంది. సుధాకర్ మీద ఓ అస్త్రం వేసిచూస్తే ఫలించింది. అప్పుడప్పుడిలాంటి అదృష్టముంటే తప్ప కేసులు పరిష్కారం కావు.

వెంకన్న తర్వాత రామ్మూర్తిని కలుసుకుని—"నువ్వు వసంతకోసం సుబ్బారావుని చంపేశావనడానికి ఆధారాలున్నాయి. లాబొరేటరీలో ఓ వ్యక్తి నీకు ఎక్స్-32 విషాన్ని ఇచ్చాడని సాక్ష్యం చెప్పాడు. సుబ్బారావు ఎక్స్-32 విషంతోనే చనిపోయాడు. నువ్వు నా యింట్లో వున్న వసంతను బెదిరించడం కారణంగా కేసు నీకు వ్యతిరేకంగా బలపడింది. సుబ్బారావు డైరీ వసంత నిర్దోషిత్వాన్ని బయట పెట్టింది...." అన్నాడు.

రామ్మూర్తి భయపడ్డాడు. అతడు వెంటనే—"నాకేం తెలియదు. నేను హత్యలు చేసే రకంకాదు. సామాన్యుణ్ని—" అన్నాడు.

"హత్యలు కాంతాకనకాలకోసం జరుగుతాయి. కాంత ఉండనే ఉంది కారణమిక్కడ...." అన్నాడు

వెంకన్న.

వెంకన్న బెదిరింపుకు రామ్మూర్తి భయపడ్డాడు. అతడు వెంటనే—"నా బుద్ధి మంచిదికాదు. అందమైన ఆడపిల్లల వెంటపడడం నా అలవాటు. చాలామంది నాకు లొంగిపోవడంవల్ల నా ధైర్యం పెరిగింది. వసంత చేతిలో నేను పరాభవం చెందాను. అంతటితో ఆమెను మర్చిపోవాలనుకున్నాను. కానీ శ్రీకాంత్ నన్నుపయోగించుకోవాలనుకున్నాడు. సుబ్బారావు హత్య కేసుకో కొత్త మలుపు తేవాలనుకున్నాడతడు. అనుమానం వసంతమీదకే మళ్ళించాలని అతడి ఆశయం. గతంలో పరాభవంచెంది ఉన్న మూలాన నేనూ అందుకంగీకరించాను" అన్నాడు.

"మరి—అందువల్ల నువ్వు ప్రమాదంలో పడతావనీ—హత్య కేసులో ఇరుక్కుంటాననీ భయపడలేదా?" అన్నాడు వెంకన్న.

"శ్రీకాంత్ నాకు హామీ యిచ్చాడు...."

"హామీని నమ్మి—ప్రాణాల మీదకు తెచ్చుకున్నావంటే నమ్మశక్యంకాదు. నువ్వు నిజంగా సుబ్బారావుని హత్యచేశావు...."

శ్రీకాంత్ గురించి సుధాకర్ చెప్పిన నిజాన్నే రామ్మూర్తి కూడా చెప్పడానికెంతోసేపు పట్టలేదు. రామ్మూర్తి మద్యం రుచిమరిగి శ్రీకాంత్ చెప్పినట్లు విన్నాడు. ఆ మద్యం రుచి అలాంటిది!

వెంకన్న సరాసరి శ్రీకాంత్‌ని కలుసుకున్నాడు.

"నగరంలో పలువురిని మత్తు పదార్థాల కలవాటు చేస్తున్నారని మీమీద ఆరోపణలున్నాయి. అందుకు ఋజువులు, సాక్ష్యాలు ఉన్నాయి—" అన్నాడు

వెంకన్న.

శ్రీకాంత్ చలించలేదు—"మత్తు పదార్థాల గురించిన మీ ఆరోపణ తప్పు. నా దగ్గర పాతకాలంనాటి విదేశీ మద్యాలున్నాయి. మద్యం అలవాటైన వారికి తప్ప వాటి రుచి అర్థంకాదు. అందులో యేవిధమైన మత్తు పదార్థాలు కలుపబడలేదు. ఆ మద్యాలకోసమే చాలా మంది నాతో స్నేహం చేస్తున్నారు. ఆ మద్యాలను నేనేమీ రహస్యంగా దాచలేదు. వాటి శాంపుల్స్— ఎప్పుడైనా యెవరైనా పరీక్షించవచ్చు. నేను నా స్నేహితులతో మద్యం తీసుకునే సమయంలో కూడా యెవరైనా వచ్చి—మేము పుచ్చుకునే మద్యాన్ని పరీక్షించుకోవచ్చు—" అన్నాడు ధైర్యంగా.

వెంకన్న మద్యం శాంపిల్సు తీసుకున్నాడు శ్రీకాంత్ వద్ద వాటిలో యేవిధమైన మత్తుపదార్థాలూ కలవలేదని అతడికి ఋజువయింది. ఎలా?

శ్రీకాంత్ సుబ్బారావుని హత్యచేయడానికి కారణమేమిటి? అది తెలిసేదాకా తను శ్రీకాంత్ నేమీ చేయలేదు.

అయితే వెంకన్న అట్టే శ్రమపడకుండానే కారణమతణ్ని వెతుక్కుంటూ వచ్చింది — రిజిస్టరు లెటరు రూపంలో!

ఉత్తరం ప్రవీణ్ కుమార్నించి—సుబ్బారావుకి!

ప్రవీణ్ కుమార్ పేరిటవచ్చే ఉత్తరాలన్నీ తనింట్లో డెలివరీ చేయించే ఏర్పాటు చేశాడు వెంకన్న.

ఉత్తరంలో—

"డియర్ సుబ్బారావు!

నేను మద్యానికి దాసుడినన్న కిటుకు శ్రీకాంత్

పట్టేవాడు. నా నుంచి రహస్యాలు లాగడానికి అతడు నన్ను వాళ్ళింటికి పిలిచేవాడు. నేను మోసం గ్రహించడానికి కొంతకాలం పట్టింది. శ్రీకాంత్ ననుమానించాక చేసేదేముంది? మద్యం నా బలహీనత. ఆ బలహీనతను జయించకపోతే - నా వృత్తికి న్యాయం చేకూర్చలేను. నీకా విషయం చెబితే నువ్వు నాకోసం ప్రత్యేక పరిశోధనలు కావించావు!

ఆసలు ఆల్కహాల్సుకి సంబంధించిన నీ పరిశోధనల వివరాలు పేపర్లో రాబట్టి నాకు నీ గురించి తెలిసింది. మద్యం పుచ్చుకునేవాడు—ఆ రుచిని ఎంజాయ్ చేస్తూ తన్ను తాను మరిచిపోకుండా ఉండడానికి బెంజాయిడ్, అజిపిన్స్, వాలియం, లిబ్రియమ్‌ల నుంచి లభించే కొన్ని డ్రగ్స్ సాయపడతాయనీ — వీటిపై లోతుగా పరిశోధించడానికి భయపడుతున్నట్లూ ఒక సైంటిఫిక్ మాగజైన్లో వ్రాశావు. కారణం-నీ పరిశోధన మద్యపానాన్ని ప్రోత్సహిస్తుంది. నువ్వు కనిపెట్టే డ్రగ్ మనిషెంత మద్యం పుచ్చుకున్నా—పెద్ద మనిషి తరహాగా ప్రవర్తించేలా చేస్తుంది. మనిషిని తన్ను తాను మరిచిపోకుండా చేస్తుంది. కానీ మద్యంవల్లనుండే ఇతర ప్రమాదాలను నివారించదు.

నీ వ్యాసం చదివి నీతో పరిచయం పెంపొందించుకున్నాను. నాకోసం పరిశోధన కొనసాగించమన్నాను. మన పరిశోధనలు రహస్యంగా ఉంచమన్నాను. నువ్వు తయారుచేసిన డ్రగ్ సత్ఫలితాల

నిచ్చింది. శ్రీకాంత్ ఇచ్చే మద్యం రుచిని ఎంజాయ్ చేస్తూ కూడా నేను—అతడికి నా రహస్యాలను చెప్పకుండా — అతడి రహస్యాలను లాగగలిగాను. నేను మత్తులో ఉన్నానన్న భ్రమ అతడికి కలిగించాను. అతడికి తప్పుడు సమాచారాన్నందించాను. ఫలితంగా ఓ పెద్ద ముఠా కొద్ది రోజుల్లో బైటపడుతుంది. అందుకు నీకే అభినందనలు.

ఒక్క విషయంలో నిన్ను హెచ్చరిస్తున్నాను. శ్రీకాంత్ తో నీకాట్టే పరిచయం లేదు. అతడికో బలహీనత్వంలో నీ డ్రగ్ గురించి చెప్పేశాను. అతడికి విషయం తెలిసిపోయింది. అందుకే నేనిక్కణ్నించి మకాం ఎత్తేశాను. నువ్వు జాగ్రత్తగా ఉండాలి. వాళ్ళ పగ నా మీదే కానీ నీమీద వుండదని నా నమ్మకం. అయినా యెందుకైనా మంచిదికదా!

మనం మళ్ళీ కలుసుకుందాం. విలువైన నీ పరిశోధన ఫలితాలను—ఇంకా పబ్లిక్ చేయకూడదని నీవనుకుంటే అది నీ యిష్టం. నువ్విచ్చిన డ్రగ్ ఇంకా నా దగ్గరుంది. అదయ్యాక మళ్ళీ నీ కుత్తరం రాస్తాను.

శ్రీమతి వసంత భోజనం రుచి శ్రీకాంత్ మద్యాల రుచిని మించింది. ఆమెకు నా అభినందనలు, ధన్యవాదాలు చెప్పు.

ఇప్పట్లో మనం కలుసుకునే అవకాశం లేదు. ప్రస్తుతానికి నేను నా అడ్రసు కూడా ఇవ్వలేను.

నీకీ ఉత్తరమందాక రెండు నెలల్లో ఓ పెద్ద ముఠా బైటపడుతుంది. అది నీ డ్రగ్ మహాత్మ్యమే!

సెలవు  నీ

ప్రవీణ్ కుమార్ —"

ఉత్తరం చదవగానే — వెంకన్నకు జరిగిందేమిటో అర్థమయింది. ఉత్తరం ప్రవీణ్ కుమార్ ఊళ్ళో ఉండగానే రాశాడు. ఒక పోస్టాఫీసు నుంచి మరో పోస్టాఫీసుకి రిజిస్టర్డు లెటరు.

అది చేరడానికింత కాలం పట్టింది.

వెంకన్న ఉత్తరం చదివి పెద్దగా అరిచాడు. ఆ అరుపువిని కంగారుగా లోపల్నుంచి అతడి భార్య పద్మావతీదేవి, వసంత కూడా పరుగున వచ్చారు.

"ఏమయింది!" అంది పద్మావతీదేవి.

"వాక్యమ యెవర్ని తప్పుపట్టాలో తెలిసిపోయింది.."

'ఎవరని?"

"పోస్టల్ డిపార్టుమెంటుని...." అన్నాడు వెంకన్న.

ఆతర్వాత....

నెలరోజుల్లోగానే శ్రీకాంత్ జైల్లో ఉన్నాడు. నగరంలో ఓ ముఠా బైటపడి — పురప్రముఖులు కొందరు కోర్టుల చుట్టూ తిరుగుతున్నారు.

—: ఐపోయింది :—

# రెడ్ బాక్స్

## సుంకరి రాంప్రసాద్

(గత సంచిక తరువాయి)

## 10

సుమారు ఆరడుగుల ఎత్తుంది ఆ జీవి.

నల్లగా మెరుస్తున్న గుండ్రని శరీర ఆకృతి, పొడవాటి పది కాళ్ళు. కీటకాలకు మల్లే మడిచి పెట్టబడిఉన్న దాని కాళ్ళు ఒక్కొక్కటి సుమారు ఆరేడడుగుల పొడవు ఉంటాయి. ముందుకు పొడచుకు వచ్చినట్లు కన్పిస్తున్న తలలో ఎర్రని మిడిగుడ్లు మరింత భయంకరంగా కన్పిస్తున్నాయి.

సాలెపురుగు ఆకారాన్ని పోలివున్న అలాంటి విచిత్ర జీవిని, మునుపెన్నడూ వారు చూసివుండలేదు. ఎప్పుడో చదివిన 'ట్వంటీ థౌజండ్ లీగ్స్ అండర్ ద సీ' అనే నవలలో జూల్స్ వెర్న్ చే అభివర్ణించబడ్డ 'సీ స్పైడర్' గుర్తుకు వచ్చింది శివాజీకి.

"అంటే ఈ విచిత్రజీవి సీ స్పైడరా?" భయంతో వణికిపోతూ దానివంక చూస్తోన్నారు వారిద్దరూ.

దాని ముందరి రెండు కాళ్ళమధ్య చిక్కుపడివున్నాడు చౌహాన్. కేన్సర్ డెక్కల్లా వున్న దాని ముందరికాలి చివర్లు పట్టకార్లలా అతని దేహాన్ని పట్టివున్నాయి. అప్పటికే దాదాపుగా మోకాళ్ళదాకా అతడిని మింగేసింది ఆ జీవి. మెల్లగా దవడలను కదిలిస్తూ, కర కరా అతని కాళ్ళను నములసాగింది అది.

భరించలేని బాధతో కెవ్వున అరుస్తూ, గిలగిలా కొట్టుకుంటున్నాడు చౌహాన్.

'ఎలా తమ సహచరుని రక్షించుకోవడం?' వారు అసహనంగా చుట్టూ చూస్తున్నారు. 'కనీసం పొడవాటి ఐరన్ రాడ్ లాంటి దేదయినా దొరక్కపోతుందా?' అని.

ఒక్కక్షణంపాటు చుట్టూ కలియజూసి, నిరాశగా తల విదిలించాడు శివాజీ. ఏదో నిశ్చయానికి వచ్చినట్లు ముందుకు అడుగువేశాడు. ఛటుక్కున అతని భుజాన్ని పట్టి ఆపాడు పండిట్.

ఏం చేద్దామని అన్నట్లుంది అతని చూపు. ఇద్దరూ ఒకరినొకరు సాభిప్రాయంగా చూసుకున్నారు.

నిజమే! ఏం చేద్దామని!

చేతిలో కనీసం ఐరన్ రాడ్ లాంటి ఆయుధమైనా లేకుండా, సీ స్పైడర్ లాంటి జీవిని ఎలా ఎదుర్కొందామని? వట్టి చేతులతో ఆ జలరాక్షసికి ఎదురునిలవటం సాధ్యమయ్యే పనేనా?

అయితే యిక్కడ సమస్య....అది సాధ్యమవుతుందా, కాదా అన్నది కాదు. అక్కడ ఒక నేస్తం

ప్రాణం ప్రమాదంలో ఉంది. అతని ప్రాణాన్ని రక్షించడం కోసం తన ప్రాణాన్ని పణంగా ఒడ్డితే సేం?

పండిట్ చేతిని సాభిప్రాయంగా నొక్కి ముందుకు అడుగువేశాడు శివాజీ.

అంతలో....

ఒక్కసారిగా అక్కడి నీళ్ళు, కల్లోలంగా ఎగిసి పడ్డాయి. నీళ్ళను చీల్చుకుంటూ ఒక నల్లని ఆకారం దూసుకుంటూ వచ్చింది.

"మైగాడ్! ఎనదర్ సీ స్పైడర్!" పాలిపోయిన ముఖాలతో ఆ ఆకారం వంక చూస్తూ మెల్లగా గొణుక్కున్నారు వారు.

రెండవ సీ స్పైడర్ రివ్వున దూసుకుంటూ వచ్చి, మొదటి సీ స్పైడర్‌ను సమీపించింది. వస్తూ వస్తూనే మొదటి సీస్పైడర్ నోటిలో గింజుకుంటున్న చౌహాన్ తలను ఛటుక్కున, ముందరికాలి డెక్కలతో అందుకొంది.

ఆ డెక్కల వత్తిడికి, చౌహాన్ కంఠనాళాలు తెగిపోయాయి. కొనవూపిరితో నిస్సహాయంగా గిజగిజ లాడుతున్న అతన్ని చూసాక శివాజీకి మరి అడుగులు ముందుకు పడలేదు. అతనికి తెలుసు యిక ప్రపంచంలోని యేశక్తీ తమ స్నేహితుని ప్రాణాలను రక్షించలేదని. మరో రెండు క్షణాలు. అంతే!

బాధగా తల విదిలించి, ఆ భయానక దృశ్యాన్ని చూడలేక ముఖాన్ని ప్రక్కకు తిప్పుకున్నాడు. జీవం యింకిన కళ్ళతో నిస్తేజంగా చూస్తూ నిలబడివున్నాడు పండిట్.

రెండు సీస్పైడర్ల మధ్యా పెనుగులాట ప్రారంభ

మయింది. చావుకూ, బ్రతుకుకూ మధ్య ఊగిసలాడుతున్న చౌహాన్ శరీరం ఆ రెండు జీవుల మధ్యా నలిగి పోతూంది.

ఇక ఆ దృశ్యాన్ని చూసి, భరించలేక గిరుక్కున వెనుతిరిగి, పండిట్ భుజాన్ని తడుతూ డెన్‌లోకి నడిచాడు శివాజీ.

స్నేహితుని దక్కించుకోవడం అసాధ్యమని తేలాక కనీసం ఆ అమూల్య సంపదనైనా చేజిక్కించుకుందామనే ఆశతో వారు వెనుతిరిగారు.

నిజమే! ప్రాణాలకు తెగించి మరీ ఈ సాహసకార్యానికి పూనుకున్నవారికి తమకన్నా తమ ప్రాణాలకన్నా దేశం ముఖ్యం! దేశస్వాతంత్ర్య సాధనకు అవసరమయిన ఆ అమూల్య సంపద ముఖ్యం.

వారు డెన్‌లో ప్రవేశించారు. అప్పటికే, ఉబికి వస్తోన్న నీళ్ళతో డెన్ దాదాపుగా నిండిపోయింది. ఓ మూలనున్న రెయిలింగ్స్‌లో చివరి మూడు నాలుగు మెట్లు మాత్రం నీళ్ళ అంచులపై నుండి కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. వారు ఈదుకుంటూ ఆ మెట్లను సమీపించారు....

అదృష్టం! నీళ్ళు ముంచెత్తినా, ఆ మెట్లపై పెట్టబడ్డ ఆ పెట్టె భద్రంగానే వుంది. డెన్ ద్వారంగుండా, పెట్టెను మోసుకొంటూ బయటకు వచ్చారు. అప్పటికి డెక్ ఉపరితలం, సముద్ర మట్టం రెంటూ కలసిపోయి వున్నాయి.

డెక్‌పై నిలుచుని ఒక్కసారి చుట్టూ కలియజూశాడు శివాజీ. క్షణానికో అంగుళం చొప్పున సముద్రంలో మునిగిపోతూంది షిప్ ఎలిజబెత్.

అతని కళ్ళల్లో చెప్పలేనంత కలవరం!

అయితే అతడు కలవరపడుతున్నది మునిగిపోతున్న షిప్ గురించి కాదు. నింగి అంచుల నుండి సముద్రం పైకి ముంచెత్తుక వస్తూన్న కారు మేఘాలను చూసి.

ఆకాశపు టడవిలో పరుగులు తీస్తున్న మత్తగజాల్లా వున్నాయి ఆ కారుమబ్బులు. కడలి తలం పై అన్ని కారు మబ్బులు కమ్ముకున్నాయంటే, జరగబోయేదేమిటో అతనికి తెలియంది కాదు.

కుంభవృష్టి!

కుంభవృష్టి కురవబోతోంది.

పండిట్ వంక ఒక్కసారి సాలోచనగా చూసి, ముందుకు పరుగెత్తాడు శివాజీ. అతన్ని అనుసరించాడు పండిట్. వారిద్దరి చేతుల మధ్యా బరువుగా వేలాడుతోంది అపూర్వ సంపదను తన పొట్టలో దాచుకున్న ఆ పెట్టె.

డెక్ అంచుకు చేరుకున్నాక, యిద్దరూ కూడబలుక్కొని సముద్రంలోనికి ఒక్కసారి దూకేశారు. తీరం వైపు ఈదటం ప్రారంభించారు.

ఆటు పోటులతో నున్న సముద్రంలో చెరివొకవైపు బరువైన ఆ పెట్టెను పట్టుకొని, ఒంటిచేత్తో ఈదటమంటే మాటలతో చెప్పినంత సులువేం కాదు.

అతి కష్టంమీద వారు తీరాన్ని చేరుకోగల్గారు. అయితే, ఉధృతంగా వున్న సముద్ర కెరటాల తాకిడికి, తమ పడవను ఆపివుంచిన తీరానికి కాక, మరో దిశకు చేరుకున్నారు.

ఆయాసంతో వగరుస్తూ, ఇసుకలో కూలబడ్డారు.

"వర్షం వచ్చేటట్టుంది. ఏం చేద్దాం శివాజీ....?"

ఆకాశంవంక అలజడిగా చూస్తూ అడిగాడు పండిట్.

తాము ఎక్కివచ్చిన నరుకుల నావకను దగ్ధం చేసే ముందు ఒక లైఫ్ బోటును తీరంలో ఒకచోట దాచి వుంచారు వారు. తమ తిరుగుప్రయాణానికి కావాల్సిన ఆహారం, నీరు ఆ బోటులో పెట్టి వుంచారు.

"ముందు ఆ బోటును చేరుకోవాలి. దానిలోనికి ఈ పెట్టెను చేర్చాలి. అప్పుడు కదా ప్రయాణ విషయం. చూద్దాం!" అన్నాడు శివాజీ నిదానంగా.

అయితే, ఓ ప్రక్క సంశయంగానే వుంది. కుంభ వృష్టి కురిసే సూచనలున్న ఈ వాతావరణంలో ఆ చిన్న బోటును నమ్ముకుని, అనంతమైన కడలిలో అంత ప్రయాణం చేయటం ఎంతవరకూ క్షేమకరం!

"పోనీ యీ రాత్రికి ఈ దీవిలోనే విశ్రాంతి తీసుకొని, సూర్యోదయమయ్యాక, వాతావరణం కాస్త తెరపినిచ్చాక ప్రయాణం సాగిస్తే....!"

—పండిట్ ఆలోచిస్తున్నది కూడా సరిగ్గా ఇదే!

అయితే, శివాజీ యింకా స్త ముందుకుపోయి, ఆలోచిస్తోన్నాడు. 'ఒకవేళ షిప్ ఎలిజబెత్‌కు అండోత్ దీవి తీరంలో ప్రమాదం వాటిల్లిందని తెలిసి, బ్రిటిష్ అధికారులు ఈ దీవికి సెర్చింగ్ పార్టీని పంపిస్తే....అప్పుడు తామింకా ఈ దీవిలోనే విశ్రాంతి తీసుకుంటూ కూర్చుంటే....' ఆ పైన ఆలోచించలేక తల విదిలించాడు.

అతని సిక్స్త్ సెన్స్ గట్టిగా చెబుతూంది....అతని అనుమానం నిజం కాబోతుందని. అందుకే ఎంత ప్రమాదమయినా ఆ క్షణమే ఆ దీవిని విడిచి వెళ్ళిపోదామని అనిపించసాగింది అతనికి.

అదే క్షణంలో తన కాలిని ఏదో పట్టి లాగుతున్న ట్లయ్యేసరికి, ఉలిక్కిపడి చూశాడతడు.

పాదం దగ్గర ఏదో నల్లని ఆకారం కాలి బూటును కొరకడానికి ప్రయత్నిస్తూంది. లాగి పెట్టి తన్నాడతడు. కీచుమంటూ అరుస్తూ ఎగిరి ఆరడుగుల దూరంలో పడిందది. ఒక్క ఉదుటున లేచి వెళ్ళి ఆ ఆకారాన్ని సమీపించారు వారు.

చిన్న సైజు పందిపిల్లలా ఉంది అది. నల్లని దేహంపై తెల్లని పొడలు. చూడటానికి పరమ అసహ్యాకరంగా ఉంది. పొడుగాటి దాని తోకను చూస్తూనే అదేమిటో గ్రహించాడు శివాజీ.

"పందికొక్కు!" అన్నాడతడు ఆశ్చర్యంగా దాని తెల్లని పొడలను చూస్తూ.

తెల్లని కోరలను పైకి చూస్తూ, కీచుగా అరుస్తూ పారిపోవడానికి ప్రయత్నించింది ఆ పందికొక్కు.

ఛటుక్కున వంగి నేలపైనున్న చిన్న రాయినితీసి, బలంగా దానివైపు విసిరాడు పండిట్. నున్నగా, క్రికెట్ బాల్ సైజులో వుంది అతడు విసిరిన రాయి. సూటిగా పోయి ఆ పందికొక్కు తలకు తగిలిందది. అంతే తల చిటికి, గిల, గిల కొట్టుకుంటూ చచ్చిపోయిందది. చిందిన ఎర్రని రక్తంతో మరింత అసహ్యంగా కన్పిస్తున్న దాని వంక చూడలేక వెనుతిరిగారు వారు.

"పండిట్! తెల్లటి పొడలతో ఉండే అలాంటి పంది కొక్కు కరిచిందంటే ప్లేగు వ్యాధి వస్తుంది. తెలుసా?" అన్నాడు శివాజీ.

"అయితే, అలాంటి పందికొక్కుల్ని పట్టి ఇండియా లోని తెల్లదొరల ఇళ్ళలో వదిలేస్తే సరి!" అన్నాడు

పండిట్.

చిన్నగా నవ్వుకున్నారు వారు.

అయితే, ఒక్కసారిగా వినవచ్చిన యేవో విచిత్ర ధ్వనులకు, వారు వెనుతిరిగి చూసారు.

అంతే!

ఎదురుగా కనిపిస్తున్న ఆ దృశ్యాన్ని చూసేసరికి వారి పెదవులమీది చిరునవ్వులు అంతరించిపోయాయి. భయంతో వారి ముఖాలు తెల్లగా పాలిపోయాయి.

'ఆ రాత్రికి ఆ దీవిలో వుండి విశ్రాంతి తీసుకుందామనే' ఆలోచన ఏమైనా వారి మనసుల్లో మిగిలి వుంటే అది ఆ క్షణమే పటాపంచలైంది.

చచ్చిపడివున్న ఆ పందికొక్కును పీక్కుతింటున్నాయి మరికొన్ని పందికొక్కులు. దాని పచ్చిరక్తపు వాసన సముద్రపుగాలికి కొట్టుకువస్తోంది. ఆ వాసన సోకి కాబోలు.... ఎక్కడినుండో గుంపులు గుంపులుగా వచ్చి పడుతున్నాయి లెక్కలేనన్ని పందికొక్కులు.

వందలు, వందలు.... ఊహుఁ.... వేలల్లో వుంటుంది వాటి సంఖ్య. మందలుగా వచ్చి పడుతున్న ఆ పందికొక్కులను చూసేసరికి భయంతో కంపించిపోయారు వారు.

"ఖర్మకాలి వాటిమధ్యలో తాము చిక్కుపడితే..." ఆ ఆలోచన రావటమే తడవుగా చిగురుటాకుల్లా కంపించిపోయాయి వారి మేనులు.

"లెటజ్ గెట్ అవుటాఫ్ ద హెల్ హియర్ పండిట్! కమాన్ క్విక్!"

—అంటూ పెట్టెను అందుకున్నాడు శివాజీ. పండిట్ అతనికి సాయం పట్టాడు. వారు పెట్టెను మోసు

తుంటూ రెండు అడుగులు వేసివుంటారు.

అంతే! వారు ఏది జరుగకూడదని భావించారో, ఆ దేమేజ్ కాస్త జరిగిపోయింది.

ఓ పెద్ద పందికొక్కుల మంద కళ్ళబడ్డారు వారు. అంతే! కీచుగా అరుస్తూ కోరలు చాస్తూ వారివైపు ఉరికాయి అవి. అంతటితో మిగిలిన పందికొక్కుల దృష్టి కూడా వారిమీదకు పడింది. అంతే! అవికూడా కీచుగా అరుస్తూ ముందుకు ఉరికాయి.

ఎగిసి వచ్చే కడలి అలలా ముంచెత్తుకు వస్తున్న ఆ పందికొక్కుల సమూహాన్ని చూసేసరికి వారి ప్రాణాలు కడ గట్టాయి.

'ఒకటీ, రెండయితే తప్పించుకోవచ్చు. కాని వేల సంఖ్యలో నున్న వాటి బారినుండి ఎలా తప్పించుకోవడం?'

ప్రాణభయంతో శక్తినంతా కూడదీసుకుంటూ పరుగెత్తుతున్నారు వారు. ఇసుకలో పాదాలు కూరుకు పోతున్నాయి. పెట్టె బరువుకు అరచేతులు మంటలు పెడుతున్నాయి. ఆయాసంతో గుండెలు ఎగిసిపడుతున్నాయి. అయినా వారు పరుగును ఆపటంలేదు.

పరుగు....పరుగు. ఒకటే పరుగు.

అయితే, వారు తమ శక్తినంతటినీ వెచ్చించి పరుగెత్తుతున్నా ఫలితం లేకపోయింది. ఆ పందికొక్కులు వారిని సమీపించాయి.

ఇప్పుడు వాటికీ, వారికీ మధ్యనున్న దూరం కేవలం కొన్ని అడుగులు. అంతే!

'అయిపోయింది! మరో ఒకటి, రెండు క్షణాలు. అంతే! అంతటితో తమ బ్రతుకులు సరి! ఆ పంది

కొక్కులు తమ శరీరాలను పీక్కుతింటూంటే, భరించలేని చిత్రవధను అనుభవిస్తూ దిక్కులేని చావు చావాల్సిందే!'

నిస్పృహగా యెవరికి వారే అనుకుంటున్నారు వారు. అదే క్షణంలో వారిని పూర్తిగా సమీపించాయి ఆ పందికొక్కులు. ఒక వలయంలా తమను చుట్టుముడుతున్న వాటి వంక నిస్సహాయంగా చూశారు వారు.

"వుయ్ ఆర్ ఫినిష్డ్ పండిట్!" అన్నాడు శివాజీ తన స్నేహితుని చేతిని చిన్నగా నొక్కుతూ.

వారి కళ్ళల్లో లీలగా ఒక వేదనా వీచిక! అది.... తాము చనిపోతున్నామన్న బాధతో కాదు. మాతృదేశ స్వాతంత్ర్యంకోసం తాము తలపెట్టిన కార్యం తమ చావువలన మధ్యలోనే ఆగిపోతున్నందుకు.

## 11

అత్యంత భీకరంగా సాగుతుంది వాటి పోరాటం. కాళ్ళతో తోసుకుంటూ, డెక్కలతో రక్కుకుంటూ కోరలతో కరచుకుంటూ ఒకదానిని మరొకటి తీవ్రంగా గాయపరచుకుంటున్నాయి ఆ రెండు సీ-స్పైడర్లు.

సాగర గర్భంలో సైతం అరుదుగా కనిపించే జీవి సీ-స్పైడర్. పురాతన రాతియుగం నాటి డినోసార్స్ (సరీసృపాలు) ఒకదానికొకటి తారసపడితే చాలు వాటి మధ్య పోరాటం ప్రారంభమయ్యేదట. రెండింటిలో ఒకటి చంపబడ్డాకే వాటి పోరాటం అంతం అయ్యేది.

అలాగే ఈ సీ స్పైడర్లు కూడా. వాటి పోరాటం కొనసాగేది గంటలా? లేక రోజులా అన్నది ఇతమిద్ధంగా ఎవరూ చెప్పలేరు.

వాటి భీకర పోరాటాన్ని చూస్తూ భయంతో కంపించిపోయారు ఆ సైనికులు. ఆ పరిస్థితిలో వాటిని

దాటుకుంటూ పోయి, షిప్ శకలాల మధ్య ఆ పెట్టె కోసం గాలించడానికి వారికి ధైర్యం చాలలేదు.

అది ఆత్మహత్యా సదృశమని వారికి తెలుసు.

'ఆ జల రాక్షసిల కండబడకుండా ఆ స్థలాన్ని వీడి వెళ్ళటం క్షేమకరం!' అనుకున్నారు వారు.

అంతే! మెల్లగా వెనుతిరిగి తమ బోట్లను చేరుకున్నారు. ఇక అప్పుడు ఏం చేయాలన్న మీమాంస బయలుదేరింది.

'ఆ సీ-స్పైడర్ల పోరాటం అంతమయ్యేవరకూ వేచి యుండి, షిప్ శిథిలాలను గాలించటమా? లేక పరిస్థితిని కమేండర్‌కు చెప్పటానికి పెట్రోల్ బోట్స్ దగ్గరకు వెళ్ళటమా?'

వారు చర్చించుకుంటున్నారు.

అంతలో టప్, టప్ మంటూ చిన్న చినుకులు ప్రారంభమయ్యాయి. అప్పుడు చూశారు వారు ఆకాశం వంకా, కారు ఎనుముల మందలా ముంచెత్తుకువస్తున్న కారు మేఘాల వంకా.

"మై గాడ్! పెద్ద వర్షమే వచ్చేట్లుంది" అలజడిగా ఆ మబ్బుల వంక చూస్తూ అన్నాడొక సైనికుడు.

"వర్షమేం ఖర్మ! కుంభవృష్టే కురిసేట్లుంది" మరొకని ఉవాచ.

అంతటితో ఏం చేద్దామా అన్న చర్చకు తెరపడింది. బోట్లను వెనక్కు త్రిప్పి, పెట్రోల్ బోట్ల దగ్గరకు పోనిద్దామని అనుకున్నారు వారంతా.

అయితే వారు బోట్లను త్రిప్పి ముందుకు పోనిచ్చే లోగా అకస్మాత్తుగా ఈదురు గాలులు ప్రారంభమయ్యాయి. అంతవరకూ ఎంతో ప్రశాంతంగా కనిపి

స్తున్న వాతావరణంలో ఒక్కసారిగా అనూహ్యమైన మార్పు వచ్చింది.

క్షణక్షణానికీ వేగం పుంజుకుంటున్నాయి ఈదురుగాలులు. వర్షం పెద్దదయింది. పోటు వచ్చినట్లు సముద్రపుటలలు ఉవ్వెత్తున ఎగియసాగాయి.

అలల తాకిడికి ఎగిసిపడుతున్నాయి వారి బోట్లు. పరిస్థితి ఒక్కసారిగా అంత ప్రమాదకరంగా మారేసరికి వారిలో కలవరం బయలుదేరింది.

అయితే ఆ కలవరపాటు క్షణికమే! సముద్రయానం చేసే నావికులకు ఇలాంటి ఆటుపోట్లన్నీ మామూలే! అందులో సుశిక్షితులైన సైనికులు వారు.

జాగ్రత్తగా బోట్లను కంట్రోల్ చేస్తూ, ముందుకు నడపడానికి ప్రయత్నిస్తున్నారు వారు. అయితే అలల తాకిడికి వారు అనుకున్న దిశలోగాక, మరో దిశకు కొట్టుకుపోతున్నాయి వారి బోట్లు.

ఈదురుగాలులూ, ఎగిసిపడుతున్న అలలూ వారి బోట్లను వెనక్కి నెట్టేస్తున్నా, మొక్కవోని ధైర్యంతో, తమ బోట్లను ముందుకు నడపడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు వారు.

మనిషికీ, ప్రకృతికీ మధ్య జరుగుతున్న అద్భుతమైన పోరాటం అది!

క్షణం వెనుక క్షణం గడిచిపోతుంది. అవిశ్రాంత పోరాటంతో వారి శరీరాలు అలసిపోతున్నాయి.

అంతలో ఫెటేల్మంటూ నింగి నిలువునా చీలినట్లు ఒక పెద్ద మెరుపు! దగ్గరలోనే పిడుగుపడ్డట్లు భయంకరంగా ఉరిమిన మేఘాల శబ్దం! చీకటిని చీలుస్తూ కొన్ని

క్షణాలపాటు కనుచూపుమేరలోని ప్రదేశానంతా కాంతి వంతం చేసిందా మెరుపు.

ఆ మెరుపు వెలుగులో....

## 12

"భగవాన్!

జీవితంలో యెప్పటికైనా తప్పనిచావు గూర్చి మేము భయపడటంలేదు. కాని, ఏం పాపం చేశామని మా నుదుట ఇంతటి నికృష్టమైన చావును వ్రాసిపెట్టావు?"

—మరో క్షణంలో ఆ పందికొక్కుల కోరలు తమ కండలను చీల్చబోతాయనగా, ఏమీ చేయలేని నిస్సహాయతతో, ఉక్రోషంగా తనలో తానే అనుకుంటున్నాడు పండిట్.

అంతలో....

ఉవ్వెత్తుగ లేచిన ఓ సముద్ర కెరటం, ఉప్పొంగి, ఉరకలు వేస్తూ, నురుగులు గ్రక్కుతూ, తీరం అంచులు దాటి ముందుకు పొంగి, పొర్లి....

ఇసుకలో నిల్చున్న శివాజీ, పండిట్‌లను నిలువెల్లా ముంచెత్తింది.

అంతే!

కెరటపు నీరు తాకిన మరుక్షణం కీసర బాసరగా అరుస్తూ, గాలికి పీడిన మబ్బుల్లా, వారిని విడిచి దూరంగా పరుగులెత్తాయి ఆ పందికొక్కులు.

ఒక్కసారిగా కడలి అల తమను నిలువెల్లా ముంచెత్తే సరికి ఉక్కిరిబిక్కిరయ్యారు వారు. చేతినాచేతనావస్థలో రెండు క్షణాల పాటు కొట్టుమిట్టు లాడారువారు.

రెండు క్షణాల తరువాత కళ్ళు తెరిచారు వారు. 'తామింకా బ్రతికే వున్నామని, తమను నిలువెల్లా అక్ర

మించుకున్న పందికొక్కులు. తమను విడిచి పారిపోయా యని గ్రహించడానికి వారికి మరో రెండు క్షణాలు పట్టాయి.

అంతలో.... వారికి మళ్ళీ కీచుమంటూ వినిపించాయి కొన్ని వికృత స్వరాలు. తలలు వెనక్కు తిప్పి చూశారు వారు.

ఆ పందికొక్కుల గుంపు దూరంగా అక్కడే వుంది. కెరటంవలన ఏర్పడ్డ తడిని దాటి ముందుకు రాలేక కీచు మంటూ అరుస్తున్నాయవి. ఆ తడి ఆరిన మరుక్షణం మళ్ళీ పడతాయని గ్రహించలేని తెలివితక్కువవారు కారు వారు.

ఒక్క ఉదుటున పైకి లేచి, ప్రక్కనే పడివున్న పెట్టెను అందుకొని, సముద్రంవైపు పరుగుతీశారు వారు. కడలి అలలు కాలి పిక్కలను తాకుతుంటే తేలిగ్గా నిట్టూర్చి, ముందుకు అడుగులు వేశారు.

వారికి తెలుసు, తాము నీటిలో వున్నంతవరకూ ఆ పందికొక్కులు తమను యేమీ చేయలేవని. వారిని చూస్తూ, ముందుకు రాలేక ఒడ్డునే పరుగులుతీస్తూ కీచుగా అరుస్తో న్నాయి ఆ పందికొక్కులు.

వారు నడుస్తున్నారు. దూరంగా తీరం వెంబడి నల్లగా, బోలుగా మెరుస్తోన్న అయస్కాంత శిలలు అస్పష్టంగా కన్పిస్తున్నాయి. ఎలిజబెత్ ముక్కలయిందీ, తమ పడ వను దాచిందీ అక్కడేనని వారికి తెలుసు. అందుకే సూటిగా ఆ శిలలవంకే తమ ప్రయాణాన్ని కొనసాగిం చారు.

ఆకలి, నీరసం, నిస్సత్తువ వారి శరీరాలను కృంగ దీస్తున్నాయి. కాళ్ళు లాగేస్తున్నాయి .... అయినా

లేని శక్తిని కూడదీసుకొంటూ ముందుకు అడుగులు వేస్తున్నారు వారు.

సుమారు అయిదారు గంటలు నిర్విరామంగా నడిచాక తమ గమ్యాన్ని చేరుకోగల్గారు వారు. ఎదురుగా బండ రాళ్ళ మధ్య క్షేమంగా వున్న తమ లైఫ్ బోటును చూసేసరికి, ఒక్కసారిగా యెంతో రిలీఫ్‌ను ఫీల య్యారు.

బోటులో వున్న బాస్కెట్‌ను తెరచి కాసిన్ని నీళ్ళను గట గటా త్రాగారు. రెండేసి పళ్ళను తినేసరికి కాస్త శక్తి వచ్చినట్లయింది వారికి.

"ఇక వెళ్దామా?" అన్నట్లు చూసాడు శివాజీ. "ఓ!" అంటూ జేబులో నుండి చాకును తీసి బండకు కట్టిన బోటు త్రాళ్ళను కోశాడు పండిట్. శివాజీ బోటు లోకి ఎక్కి కూర్చున్నాడు.

బోటును నీళ్ళలోకి తోస్తుండగా....

పండిట్ మోచేతిపై "టప్" మంటూ పడిందొక వర్ష పుచుక్క. ఉలిక్కిపడ్డాడతడు. అదే క్షణంలో మరో చినుకు తన నుదిటిని తాకేసరికి, ఉలిక్కిపడుతూ చూశాడు శివాజీ.

"వర్షం వచ్చేసింది శివాజీ! ఏం చేద్దాం?" అన్నాడు పండిట్ బోటు అంచులను పట్టుకొని.

శివాజీ పెదవి విప్పేలోగా, ఒక చల్లని తెమ్మెర అతని ముఖాన్ని తాకింది. ఆ గాలి అలలలో మార్దవ్యం కన్నా, బలంపాలు ఎక్కువగా ఉన్నట్లు గమనించా డతడు. "ఈదురు గాలులు" సన్నగా గొణుక్కున్నా డతడు, నుదుటిపైకి పడిన జుట్టును వెనక్కి త్రోసు కుంటూ.

'కమ్ముకున్న కారుమబ్బులూ, వీస్తున్న ఈదురుగాలు లనూ చూస్తూంటే కుంభవృష్టే కురిసేట్లుంది. ఈ స్థితిలో ఈ చిన్న లైఫ్ బోటును నమ్ముకొని ప్రయాణం కొన సాగించడం యెంతవరకూ క్షేమకరం?'

అతని ఆలోచనలతో తనకేమీ సంబంధం లేనట్లు వర్షం మొదలయింది.

వర్షం తగ్గేంతవరకూ ఆగి, తరువాత ప్రయాణం సాగించటం మంచిదేమోనని....ఓ ప్రక్క అనిపిస్తూంది. కాని షిప్ ఎలిజబెత్ కు సంభవించిన ప్రమాదం గురించి తెలిసి, బ్రిటిష్ అధికార్లు యేదైనా సెర్చింగ్ స్క్వాడ్ ను పంపితే....అప్పుడు తమ పని సూప్ లో పడుతుంది.

ఇంత శ్రమా, నిష్ఫలమౌతుంది!'

ఏం చేయాలో తోచక ఆలోచనలతో కొట్టుమిట్టులాడుతున్న శివాజీ, పండిట్ చిన్నగా అరవటంతో ఉలిక్కిపడుతూ చూశాడు.

"శివాజీ! అటు చూడు!"

—దూరంగా సముద్రంలో మిణుకు మిణుకు మంటూ వెలుగుతున్న దీపాలవంక చూపించాడు పండిట్.

అస్పష్టంగా కనిపిస్తోన్న ఆ దీపాలను చూస్తూనే, అవి పెట్రోల్ బోట్సు అని గ్రహించారు వారు. అంత రాత్రి సమయంలో అన్ని పెట్రోల్ బోట్సు అండోత్ దీవిని సమీపిస్తున్నాయంటే అవి ఖచ్చితంగా బ్రిటిష్ నావికాదళానికి సంబంధించినవే అయివుంటాయి.

'తన అనుమానమే నిజం అయిందా? అది బ్రిటిష్ సెర్చింగ్ స్క్వాడా? ....' శివాజీ కన్నుల్లో ఆందోళన.

అప్పటికే పండిట్ అసహనంగా చూస్తున్నాడు.

అది బ్రిటిష్ పెర్చింగ్ స్క్వాడో, కాదో తమకు తెలియదు. కాని వాటి కళ్ళబడి లేని రిస్కును తీసుకోవడం వారికి యిష్టం లేకపోయింది.

"కమాన్ పండిట్....! బోటును ముందుకు పోనీ! ఆ బోట్లు ఈ తీరానికి చేరకముందే మనం ఈ ప్రదేశాన్ని విడిపోవాలి....!" ఒక నిశ్చయానికి వచ్చినట్లు దృఢ స్వరంతో అన్నాడు శివాజీ.

బోటును మరికాస్త ముందుకు త్రోసి, తను కూడా బోటులోనికి యెక్కాడు పండిట్. తెడ్లు వేయటం ప్రారంభించాడు శివాజీ. బోటు ముందుకు కదిలింది.

"వర్షం యిలాగే కురిసినా, కనీసం రేపటిలోగానైనా మనం మలబార్ తీర ప్రాంతాన్ని చేరుకోగలమనుకుంటాను" అన్నాడు పండిట్.

ఔనన్నట్లు తలాడించాడు శివాజీ.

అయితే వారి అంచనాలను తారుమారు చేస్తూ కొద్ది సేపటిలోనే పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

వర్షం ఉధృతమయింది. ఆకాశం చిల్లులుపడ్డట్టుగా పెనుధారలతో కురవసాగింది వర్షం.

ఈదురు గాలుల వేగం క్షణ క్షణానికీ పెరగసాగింది. సముద్రంలో పోటు మొదలై ఉవ్వెత్తున లేచి పడసాగాయి కెరటాలు. ఆ తాకిడికి ఎగిరి ఎగిరి పడుతూ ఊగసాగింది వారి లైఫ్ బోటు.

అది మామూలు వర్షం కాదని, తుఫాన్ అని గ్రహించటం వారికి పెద్ద కష్టమేమీ కాలేదు. గ్రహించాక వారి ముఖాలు రక్తం యింకినట్లు తెల్లగా పాలిపోయాయి.

ఈ నడిసముద్రంలో పెనుతుఫాన్ మధ్య చిక్కుకున్న తాము బ్రతికి బట్ట కట్టగలమా లేదాన్నది కాదు వారి ధ్యాస. మాతృదేశ స్వాతంత్ర్యం కోసం, యిన్ని శ్రమల కోర్చి చేజిక్కించుకున్న ఆ అమూల్యమయిన సంపదను మళ్ళీ తమ దేశమాతకే అర్పించాలన్నదే వారి ఆశ....

ఆ ఆశతోనే, విలయరూపం దాల్చిన ప్రకృతితో పోరాడుతూ, తాడి ఎత్తున లేచిపడుతున్న అలలకు ఎదురొడ్డి, తమ చిన్న లైఫ్‌బోటును ముందుకు నడపడానికే విశ్వప్రయత్నం చేస్తున్నారు వారు.

అంతలో....

ఫెళ్ళుమంటూ నింగి నిలువునా చీలినట్లు ఒక పెద్ద మెరుపు! దగ్గరలోనే పిడుగు పడ్డట్లు భయంకరంగా ఉరిమిన మేఘాల శబ్దం! చీకటిని చీలుస్తూ కొన్ని క్షణాల పాటు కనుచూపు మేరలోని ప్రదేశాన్నంతా కాంతిమంతం చేసిందా మెరుపు.

ఆ మెరుపు వెలుగులో ....

# 13

ఆ వెలుగులో....

కాస్త దూరంలో అలల మధ్య అల్లల్లాడుతున్న చిన్న లైఫ్‌బోటు ఆ సైనికుల కంటబడింది. మెరిసింది క్షణమేనైనా, ఆ క్షణంసేపూ ఆ ప్రాంతాన్నంతా పట్టపగలు చేసిందా మెరుపు.

ఆ మెరుపు వెలుగులో....

ఆ చిన్న లైఫ్‌బోటులో ప్రయాణిస్తున్న ఇద్దరు వ్యక్తులూ, వారిద్దరి మధ్యనున్న పెద్ద ఎర్రని పెట్టె, దానిపై కొట్టవచ్చినట్లున్న B. T. అన్న రెండు తెల్లని

అక్షరాలు.... వారికి స్పష్టంగా కన్పించాయి.

ఆ బోటువంక, ఆ పెట్టెవంక అనుమానంగా చూశాడు ఆ సెర్చింగ్ స్క్వాడ్ లీడర్. ఆ బోటులోని యిద్దరు వ్యక్తులను స్పష్టంగా చూశాడతడు. 'వారు ఆంగ్లేయులు కారు. భారతీయులు. అంటే వారు ఎలిజబెత్ షిప్ కు సంబంధించిన నావికులు కారు. కాకంటే యెవరు వారు?....'

ఆలోచిస్తున్నాడతడు.

ఆ పెట్టె.... దట్ రెడ్ బాక్స్.... అచ్చం ఎలిజబెత్ షిప్ లో పంపించబడ్డ పెట్టెలానే వుంది.

అదేనా ? అది ఆ పెట్టేనా?

ఆ పెట్టెపై చూసిన రెండు అక్షరాలు గుర్తుకు వచ్చాయి అతనికి.

"B. T." మరోసారి మననం చేసుకున్నాడతడు. "B. T. .... బ్రిటిష్ ట్రెజరీ!" ఆనందంతో చిన్నగా అరిచాడతడు.

'యస్. సందేహం లేదు. దట్స్ ద బాక్స్!' ఉత్సాహంగా మిగిలిన సైనికులవంక చూసి, తన మనసులోని అనుమానాన్ని వివరించి, ఆ బోటును చుట్టుముట్టమని చెప్పాడు.

ఆ సైనికుల బోట్లు ప్రక్కకు తిరిగి ఆ ఒంటరి బోటును చుట్టుముట్టడానికి ముందుకు వురికాయి.

ఆ క్షణం వరకూ ప్రాణాలను ఒడ్డి ప్రకృతితో పోరాడుతున్నారు వారు. మరి కొద్దిసేపటిలో తమ పెట్రోల్ బోట్స్ ను చేరుకోకపోతే తమ ప్రాణాలు దక్కటం కష్టమని వారికి తెలుసు. ఇప్పుడు వెనక్కు మరలి, ఆ బోటు కోసం వెళ్ళటం తమ ప్రాణాలను

రిస్క్ చేయటమేనని వారికి తెలుసు.

అయినా వారు వెనక్కి మరలారు.

ప్రాణంకన్నా కర్తవ్యం మిన్నగా భావించే సైనికులు వారు. ఏ లక్ష్యం కోసం, ఏ పెట్టెను శోధించటం కోసం తాము అందోత్ దీవికి వచ్చారో ఆ పెట్టె కళ్ళ యెదురుగా కనిపిస్తూంటే.... దానిని వదలి ప్రాణాల కోసం పిరికిపందల్లా ఎలా వెళ్ళిపోగలరు?

ఏ క్షణమైతే మెరపు వెలుగులో సైనికులు ఆ బోటును చూశారో.........అదే క్షణం ఆ బోటులో నున్న శివాజీ, పండిట్‌లు కూడా ఆ సైనికుల్ని చూశారు.

వారు శిథిలమయిన ఎలిజబెత్ షిప్ నుండి తప్పించుకున్న సెయిలర్లో, లేక ఆ శిథిలాలను శోధించడానికి వచ్చిన సెర్చింగ్ స్క్వాడో...అర్థం కాలేదు వారికి.

'వారెవరైనా... వారి కంట బడకముందే ఆ ప్రదేశం నుండి దూరంగా తొలగిపోవాలి' అనుకుంటూ తమ బోటును ప్రక్కకు తిప్పాడు శివాజీ.

అప్పుడు తట్టింది అతనికి వారెవరో.

'ఎలిజబెత్‌కు ప్రమాదం జరిగి అప్పటికే చాలా గంటలయింది. అప్పుడు లైఫ్‌బోట్లపై బయలుదేరిన ఆ షిప్ సిబ్బంది ఇంతవరకూ ఇక్కడే ఎందుకుంటారు? ఈ పటికి వారు చాలా దూరం పోయివుంటారు. అంటే, వీరు సెర్చింగ్ స్క్వాడే అయివుంటారు.'

తన అనుమానమే నిజమయినందుకు విపరీతమైన ఆందోళనతో చలించిపోయాడతడు.

అప్పటికే అర్థచంద్రాకృతిలో తమను చుట్టుముడుతున్న ఆ సైనికులను చూసి కెవ్వున అరిచాడు పండిట్.

శివాజీ ఒక్కసారి వారివంక పరిశీలనగా చూశాడు.

పదో, పన్నెండో వుంటాయి తమను చుట్టుముడుతున్న బోట్లు. దాదాపు ఇరవై మంది వుంటారు ఆ బోట్లలోని సైనికులు. వారి చేతులలోని వాటర్ గన్‌లు ఆ చీకట్లో సయాశం తళ తళ మెరుస్తోన్నాయి. వారంతా స్విమ్మింగ్ సూట్లలో వున్నారు.

వారిని చూస్తూ బాధగా తల విదిలించాడు శివాజీ. ఊహుం.... లాభంలేదు. ఎట్టి పరిస్థితులలోనూ తాము వారినుండి తప్పించుకోలేరు. అయిపోయింది. ఇంత శ్రమా నిష్ఫలమయింది.

గుండెల్ని పిండేస్తున్న బాధతో ఒకరివంక ఒకరు చూసుకున్నారు వారు ఆర్తిగా.

'వీల్లేదు! తరతరాలుగా భరతమాత కళసీమను అలంకరించిన ఈ అపూర్వ ఆభరణాలు ఈ తుచ్ఛమ్లేచ్ఛుల పాల్బడి కళంకం కారాదు.

ఏది జరగరాదని, ఏ అపురూపసంపద పరాయి దేశస్థుల హస్తగతం కారాదని, ఇంతవు తెగించి, ఇంతటి వ్యూహాన్ని పన్ని, ప్రాణాల నొడ్డి మరీ తాము పోరాడారో.... ఆ సంపద మళ్ళీ ఆ తెల్లదొరల పాలు కావలసిందేనా?

శోకం, ఆక్రోశం, ఆవేశం ముప్పిరిగొనగా ఓ నిర్ణయానికి వచ్చాడు శివాజీ. తన నేస్తం వంక సాభిప్రాయంగా చూశాడు.

"పండిట్! ఈ అపూర్వ సంపద మనకు దక్కనినాడు, ఈ తెల్లదొరలకు చిక్కకూడదన్న, సాగర గర్భంలో కలియటం మిన్న.

మరో మార్గంలేదు ఫ్రెండ్!

ఈ పెట్టెను తీసుకొని సముద్రంలోనికి దూకేద్దాం. ఈ తుఫాన్‌లో పోటుమీదనున్న సముద్రంలోనికి దూకి మనకోసం ఆ సైనికులు వెతకలేరు. అయితే మళ్ళీ మనం ప్రాణాలతో బయటపడగలమనే ఆశ లేదు.

పోనీ నేస్తం! మన దేశ సంపద పరాయి ప్రభువుల హస్తగతం కాకుండా చేయడానికి, ఈ తుచ్ఛ ప్రాణాలను బలియిస్తే నేం?'

శివాజీ చెప్పటం పూర్తిచేయగానే, వారిద్దరూ ఆ పెట్టెను పట్టుకొని లేచి నిలబడ్డారు. వారి ప్రమేయం లేకుండానే కెరటాల వాలుకు కొట్టుకుపోతూంది వారి పడవ. ఆ సైనికుల బోట్లు క్షణక్షణానికి వారికి దగ్గర కాసాగాయి.

పండిట్ కన్నులు అరమోడ్చాడు.

"భగవాన్!

ఏనాడైనా మనిషి తన ప్రాణాలను రక్షించమనే నిన్ను ప్రార్థిస్తాడు. కాని, ఈనాడు, నేను మా ప్రాణాలను భక్షించమని కోరుకుంటున్నాను.

మా ఆశయం సిద్ధించాలంటే, మా దేశ సంపద, పరాయివారి పాలు కాకూడదంటే, మాతోపాటు ఈ సంపద కూడా సాగర గర్భంలో కలిసిపోవాలి! ఈ రహస్యం శాశ్వతంగా ఈ రత్నపక్షిలో నిక్షిప్తం కావాలి.

అందుకే చేతులు మోడ్చి అర్థిస్తున్నా!

ఈ సైనికులు మాకోసం, ఈ పెట్టెకోసం అన్వేషించకముందే....

విలయరూపుడవైన ఓ సముద్రుడా! ప్రళయకాల పర్జన్య, మారుతి సహితుడవై ఉప్పొంగి, మమ్మల్ని

ముంచెత్తిపో!”

ఒకరినొకరు ఆర్తిగా చూసుకొని, ఒక్క ఉదుటున ఆ పెట్టెతోసహా సముద్రంలోనికి దూకేశారు వారిద్దరూ.

అదే క్షణంలో వారిని సమీపించిన సైనికులు వారి దుస్సాహసాన్ని చూసి హాహాకారాలు చేశారు.

ఆ స్క్వాడ్ చీఫ్ ఆలోచిస్తున్నాడు. 'ఏం చేయాలి? ఇప్పుడే సాగర గర్భంలోనికి ప్రవేశించి, ఆ పెట్టెకోసం అన్వేషణ సాగించాలా? లేక, ఆ స్థలాన్ని గుర్తుపెట్టుకొని, తుఫాన్ తీవ్రత తగ్గాక అన్వేషణ ప్రారంభించాలా?'

వారు ఆలోచనలో వుండగానే

అంతలో....

ఒక ప్రళయ భీకర విస్ఫోటనం! నింగి నిలువునా చీలినట్లు ఒక మెరపు! దిక్కులను పిక్కటిల్లజేస్తూ వారికి దగ్గరలోనే పడ్డ పిడుగు. ఒక మహాపర్వతాన్ని ఎత్తి సముద్రంలోనికి యెవరో విసిరేసినట్లు ఉవ్వెత్తున లేచాయి సముద్ర జలాలు.

ముత్తాడి యెత్తున లేచిన ఓ సముద్ర కెరటం, ఒక రాక్షస అల వేయి శిరస్సులనూ విప్పార్చుకొని ఊరికే ఆదిశేషునిలా పైకి లేచి వారిమీదకు విరుచుకు పడింది.

అంతే!

పిచ్చుక గూళ్ళలా యెగిరిపోయాయి వారి బోట్లు. వారి ఆర్తనాదాలు ఆ పర్జన్యఘోషలో కలిసిపోయాయి.

తమతోపాటుగా, ఆ అపురూప సంపద రహస్యం, కూడా శాశ్వతంగా సాగర గర్భంలో సమాధయినందుకు తృప్తిగా నిట్టూర్చాయి పండిట్, శివాజీల ఆత్మలు.

—:అయిపోయింది:—

సీరియల్-

[illegible]

(గత సంచిక తరువాయి)

అతని చేతిలోనుంచి తన చేతిని విసురుగా లాక్కొని "ఏమిటి మీరు మాట్లాడదలచుకున్నది?" అన్నది మామూలుగా వుండటానికి ప్రయత్నిస్తూ.

"మిస్ దివ్యా, మీరు నన్నపార్థం చేసుకోనంటే ఒక్క మాటడుగుతాను...."

"ఏమిటది?"

"విని కోపించరు కదా...."

"ఏమిటో చెప్పకుండా కండిషన్స్ ఏమిటి?"

"నేను పైలెట్ గా పదిహేనేళ్ళుగా పని చేస్తూన్నాను. నాకు అన్నిటితో కలుపుకుని నెలకు అయిదు వేల వరకు వస్తాయి. ఇంకా పెళ్ళికాలేదు. నన్ను పెళ్ళాడటానికి యెందరో కోటీశ్వరుల కూతుళ్ళు బారులుతీరి వున్నారు. కాని నాకు వాళ్ళెవరూ నచ్చలేదు. నేను కోరుకున్న అమ్మాయి వాళ్ళలో లేదు...." ఓ క్షణం ఎఫెక్టుకోసం ఆగి ఆమె ముఖంలోకి చూశాడు.

దివ్య ముఖం చాలా గంభీరంగా వుంది.

"నన్ను చేసుకోబోయే అదృష్టవంతురాలు, నా మనసు దోచుకున్న అమ్మాయి యెవరో తెలుసా?"

ఎవరని దివ్య అడగలేదు. అతనే చెప్పాడు. "నువ్వే. మిస్ దివ్యా!"

అరికాలిమంట నెత్తికెక్కింది దామెకు.

అంతవరకు బహువచనంలో మాట్లాడి, ఇదివరకు ఏర్ పోర్టులో మల్లే మళ్ళీ ఏకవచనంలోకి దిగి అసభ్యంగా మాట్లాడటాన్నామె సహించలేకపోయింది.

"మీరు వెంటనే ఇక్కడ్నుంచి వెళ్ళిపోండి" తర్జనితో గుమ్మంవైపు చూపిస్తూ, గొంతుపెంచి అన్నది దివ్య.

సునీల్ హఠాత్తుగా ఆమె వంక కోపంగా చూస్తూ లేచి నించున్నాడు.

"సారి నువ్వే కావాలని వస్తే ఏ ఆడదానికైనా ఆ మగాడంటే చులకనే! నువ్వు అందుకు భిన్నంగా ప్రవర్తించటంలేదు. అనక చింతిస్తావు—మీ పెద్దవాళ్ళ నడగమంటావా?"

"పొమ్మని కసిరినా, ఆత్మాభిమానంలేని వాళ్ళతో నాకు మాటలేమిటి? వెళ్తారా, మా నౌఖర్ని పిలిపించాలా?"

సునీల్ తాచుపాములా బుసకొట్టాడు.

"చూస్తాను, ఈ మిడిసిపాటెన్నాళ్ళో? నీ సిద్ధార్థ బతికి మళ్ళీ నిన్ను చూడవస్తాడనుకుంటున్నావేమో.... ఉత్త భ్రమ! ఈరోజు అఫీషియల్‌గా అతనికోసం ప్రత్యేక విమానం అన్వేషించటానికి వెళ్తోంది. నేనూ వెళ్తున్నాను. అతను కనిపిస్తే స్పాట్‌లోనే చంపి పాతేస్తాను" చరచరా బయటికి వెళ్ళిపోయాడు.

దివ్య మాటరానిదానిలా బొమ్మలా అలాగే నిల్చుండి పోయింది కాసేపు. తర్వాత తలుపు మూయటానికి ముందుకు కదిలింది.

సరిగ్గా అప్పుడే యెవరో ఓ యువతి గుమ్మం మెట్లెక్కుతోంది. దివ్య విస్మయంగా చూసిందామె వంక.

"మీ పేరు దివ్య కదూ...." అన్నదామె.

అవునని తలూపింది దివ్య సందిగ్ధంతోనే.

"నేను మీతో రెండు నిమిషాలు మాట్లాడాలనుకుంటున్నాను. మీకభ్యంతరమా?" మర్యాద, సంస్కారం వుట్టిపడే గొంతులో తియ్యగా అడిగిందామె.

"అబ్బెబ్బే ప్లీజ్ కమ్" అన్నది దివ్య తలుపులు బార్లా తెరిచి.

ఆమె "థాంక్స్" చెప్పి లోపలికొచ్చి దివ్య చూపిన సీట్లో కూచొని, "నా పేరు రమ్య. ఎర్ హోస్టెస్ గా పని చేస్తున్నాను. సిద్ధార్థతో నాకు ఉద్యోగరీత్యా మంచి స్నేహ భావముంది" అన్నదామె.

చేదుకూర తిన్నట్టు ముఖం పెట్టింది దివ్య.

"అఫ్ కోర్స్, అతని గురించి మీకు చెడుగా చెప్పిన వాళ్ళ గురించి నాకు తెలుసు. సుస్మిత నిప్పులాంటి దనుకుంటే సిద్ధార్థ అగ్నిలాంటివాడు. ఇద్దరూ చాలా పవిత్రులు. వాళ్ళని అనుమానించటం అమానుషం, అన్యాయం!" అన్నది రమ్య.

"ఇంతకు మీరు వచ్చిన పని....!?"

"సిద్ధార్థ గార్ని పొగడటానికి మాత్రం కాదు. మీకు ఉన్న నిజాన్ని చెప్పి కళ్ళు తెరిపించాలని. మీ మనసులో అతని పట్ల పేరుకుపోయిన ఏహ్యభావాన్ని, అయిష్టతను తొలగించటానికి నావంతు ప్రయత్నం చెయ్యాలని వచ్చాను.

ఆ రోజు సిద్ధార్థ పడిపోయిన ఫ్లైట్‌లోని ఏర్ హోస్టెస్‌లలో నేనొకతెను. సునీల్ కావాలనే సిద్ధార్థని బయటికి తోసేశాడు. సుస్మితమీద సునీల్ ఎన్నాళ్ళగానో కన్ను వేసివున్నాడు. ఆమె ఎదురుతిరిగింది. అవకాశం దొరగ్గానే ఆమెను కూడా ప్లేన్‌లోనించి కిందికి తోసేశాడు. వాళ్ళు కావాలని దూకేశారని కథ అల్లి చెప్పాడు...." ఓ క్షణం ఆగింది రమ్య.

దివ్య ముఖంలో అతి వేగంగా రంగులు మారిపోవటాన్ని స్పష్టంగా గుర్తించిందామె. దివ్య ముఖంలో యిప్పుడు ఆసక్తి, ఆశ్చర్యం దోబూచులాడుతున్నాయి.

"సిద్ధార్థ మాతో ఎన్నోసార్లు మీ ఇద్దరి ప్రణయం గురించి చెప్తూ మిమ్మల్ని తన హృదయాధినేతగా ఎంతో గొప్పగా వర్ణిస్తూ, అందంలో మాకు మేమే సాటి అని మురిసిపోయే మాకే అసూయ కలిగేలా మీ గురించి చెప్పేవాడు. అతని మాటలోను, మనసులోను మీరే అనుక్షణం మెదులుండేవారు.

నిజంగా అలాంటి గొప్ప ప్రేమికుడి కోసం ఆడది ఎన్ని త్యాగాలైనా చెయ్యగలదు. మీ అదృష్టానికి మేం ఈర్ష్యపడేవాళ్ళం. అలాంటి సిద్ధార్థని అనుమానించటం; అతని వ్యక్తిత్వాన్ని అవమానించటమే, అతనికి ద్రోహం చెయ్యటమే అవుతుంది."

రమ్య మాటలు దివ్య గుండెల్లో సమ్మెటపోటుల్లా తగిలాయి.

"సిద్ధూ, నన్ను క్షమించు.... నేను చాలా ఘోరంగా నిన్నపార్థం చేసుకున్నాను" ఆమె మనసు ఆక్రోశిస్తోంది.

"కాని....సుస్మిత...." ఏదో చెప్పబోయి ఆగి పోయింది.

"మీ అనుమాన మర్థమయింది. సుస్మిత అతన్ని ప్రేమించి వుండొచ్చును కదా అని కదూ, మీరనబోయేది! మంచివాళ్ళని ప్రతి ఒక్కరూ ప్రేమిస్తారు. ఆ మాటకొస్తే నేనూ సిద్ధార్థని ప్రేమిస్తున్నాను—ఓ సహృదయుడయిన మంచి స్నేహితుడిగా ఆత్మీయుడిగా, అంత మాత్రాన....?!"

దివ్య తన ఆలోచనకి సిగ్గుపడింది. "సారీ!...." అన్నది.

"మరో ముఖ్యమైన విషయం చెప్పటం మరిచాను. సుస్మిత మృతదేహాన్ని మా సిబ్బంది కనుగొన్నారు. ఆమె ప్లేన్ నించి పడిపోయినపుడు ధరించిన చీరను, ఆ చీరకున్న ఆమె నేమ్ గల బాడ్జిని బట్టి! అస్థిపంజరం మాత్రమే దొరికింది. ఓ గోతిలో నుంచి యేవో జంతువులు ఆమె శరీరాన్ని పైకి లాగి తింటుండగా చూశారు మా సిబ్బంది.

గోతిలో ఆమెను పాతిపెట్టే అవసరం యెవరికుంటుంది? మేము అనుకునేదేమిటంటే, సిద్ధార్థ బతికేవున్నాడని, అతనే ఆమెకు చివరి వీడ్కోలు ఇచ్చి ఆమె శరీరాన్ని ఖననం చేసివుంటాడనీ!..."

ఒళ్ళంతా చెవులు చేసుకుని విన్నది దివ్య....

"అయితే నా సిద్ధార్థ ...." ఆనందంతో ఆమె గొంతు పూడుకుపోయింది.

"అతన్ని సజీవంగా చూడగలమనే మేం యెదురు చూస్తున్నాం. ఆఖరి ప్రయత్నంగా ఈ రోజు మరో ప్లేన్ వెళ్తోంది అతన్ని వెతకటానికి...."

సునీల్ మాటలు గుర్తొచ్చి నిలువెల్లా వణికిపోయింది దివ్య.

"అయితే సునీల్ సిద్ధార్థను చంపేస్తాడా?" అంది హిస్టిరికల్‌గా.

"సునీల్ సిద్ధార్థని చంపటమేమిటి?" రమ్య ఆశ్చర్యంగా అడిగింది.

దివ్య సునీల్ వచ్చి బెదిరించి వెళ్ళిన విషయం చెప్పింది.

"రాస్కెల్! వాడికింకా బుద్ధి రాలేదా? మీకేం భయంలేదు. సునీల్‌ని తప్పనిసరిగా తీసుకు వెళ్తారు మా సిబ్బంది—స్పాట్‌ని లొకేట్ చెయ్యటం కోసం! సిద్ధార్థ కనిపించినా సునీల్ ఏం చెయ్యలేడు. అతని వెంట ఎయిర్‌ఫోర్స్ అధికారులు సెక్యూరిటీ సిబ్బంది వుంటారు. అతను సిద్ధార్థని చంపే దుస్సాహసం చెయ్యడు. మీరు నిశ్చింతగా వుండండి" అంది రమ్య ధైర్యం చెపుతూ.

దివ్య మనస్సులో అగ్నిపర్వతాలు బద్దలవుతున్నాయి. తను సిద్ధార్థని మళ్ళీ కళ్ళ చూడగలదా? అతను క్షేమంగానే వున్నాడా యిన్నాళ్ళు? ఏమో !?

"నేను వెళ్తాను మ్మా. మీరు సిద్ధార్థ గురించి వర్రీ కాకండి. ఎవ్వరి థింక్ విల్ బీ ఆల్ రైట్!" అంటూ వెళ్ళిపోయింది రమ్య.

దివ్య శిలాప్రతిమలా నిల్చుండిపోయింది చాలా సేపు....

• • •

సిద్ధార్థ చాలా స్పాంటేనియస్‌కి పక్కకి తప్పుకుని వుండకపోతే బందిపోటు వేటుకి అతని తల మొండెం

నుంచి వేరయిపోయుండేది!

ఆ మరుక్షణమే కోయిల చేతిలోని బాణంకర్ర ఆ బందిపోటు వెన్నులో నుంచి గుండెల్ని చీల్చుకుని ఛాతీ నుంచి బయటికొచ్చింది.

పెద్దగా అరుస్తూ నేలకూలిపోయాడు ఆ బందిపోటు!

ఆ కేక ఆ గూడెంలో ప్రతిధ్వనించింది. గస్తీ తిరుగుతున్న యిద్దరు బందిపోట్లు, అంతక్రితమే ఎవరినో దోచుకుని మూటలు కట్టి తెచ్చిన బందిపోట్లు నలుగురు పరుగున అక్కడికొస్తూ కనిపించారు.

కోయిల, సిద్దార్థ ప్రమాదాన్ని గుర్తించారు.

"మనం ఏదీ నిర్ణయించుకునే లోపల జరగకూడనిది జరిగిపోయింది. ఈ గస్తీ బందిపోటు మనల్ని కనిపెట్టి చంపబోయాడు. వాడ్ని నోరు నొక్కి చంపి వుండాల్సింది, తొందర్లో ఆ విషయాన్ని విస్మరించి చంపేశాను. ఇక గూడెమంతా నిద్రలేచిపోయిందంటే మనకి అవకాశం చేజారిపోతుంది. ఆ వచ్చే ఆరుగురిని ముందు శాశ్వతంగా నిద్ర పుచ్చితేనేగాని మనకి రక్షణ వుండదు. ఈ కత్తి నువ్వుంచుకో. వాళ్ళని మెలకువగా వ్యవహరించి మట్టుబెట్టాలి!"

అంటూ అతని చేతిలోని బాణాకర్రని కూడా తను అందుకుని యెటాక్ చెయ్యటానికి సిద్ధంగా నిల్చుంది కోయిల.

సిద్దార్థ చచ్చిన బందిపోటు పట్టాకత్తిని చేత ధరించి సన్నద్ధుడయ్యాడు.

సరిగ్గా అప్పుడే బందిపోట్లు ఆరుగురు ఒకరి వెంట మరొకరు అక్కడికి చేరుకున్నారు.

మొదటి యిద్దరు అక్కడికి చేరుకుంటుండగానే సిద్ధార పట్టాకత్తితో వెనుకనుంచి దాడి చేసి వాళ్ళ తలలు నరికేశాడు. తక్కిన నలుగురికి ఈ విషయం తెలియకముందే ఆ గస్తీ బందిపోట్లని బండరాళ్ళ వెనుక దాచేశారిద్దరు కలిసి.

ఇప్పుడు వాళ్ళ పట్టాకత్తులు కూడా జతచేస్తే మూడు కత్తులు రెండు బాణాకర్రలు ఆయుధాలుగా, తక్కిన నలుగురికి మరణ ముహూర్తం పెట్టేశారు కోయిల, సిద్ధార.

అయితే వాళ్ళు నలుగురు నాలుగువైపులకి విడిపోయి వాళ్ళని కమ్ముకుంటూ వచ్చేశారు.

వాళ్ళు రావటం ఎత్తులో వున్న సిద్ధార కోయిల స్పష్టంగా గుర్తించారు.

దూరంనించే గురిచూసి బాణంకర్రల్ని విసిరి ఇద్దరిని నేలకూల్చింది కోయిల.

రెండు చేతుల్లో రెండు పట్టాకత్తులు ధరించిన సిద్ధార వీరభద్రావతారం దాల్చినవాడిలా ఆవేశంతో ఊగిపోతున్నాడు.

శత్రువులు బండల వెనుక దాక్కుని వున్నారని మిగిలిన ఇద్దరు బందిపోట్లు గ్రహించి ఒక్కసారిగా వెనుతిరిగి గూడెంవైపు పరుగెత్తబోయారు.

అంతే! కోయిల విసిరిన పట్టాకత్తి ఒకడిని సిద్ధార విసిరిన కత్తి మరొకడిని అమాంతంగా నేల కూల్చేశాయి.

అయితే నేలకూలిపోతూ వాళ్ళిద్దరు పెద్దగా అరిచారు. అది శత్రువులు దాడిచేశారనే సంకేతం! ఆగి ఆగి వింత శబ్దాలతో సైరన్‌లా మోగాయి వాళ్ళ గొంతులు.

తర్వాత....వాళ్ళ గొంతులు శాశ్వతంగా మూగబోయాయి.

తెల్లవారుఝామున మూడున్నర గంటల సమయాన, ఆదమరిచి నిద్రిస్తున్న ఆ బందిపోటు ప్రాకారంలోని చాలా మందికి ఆ ఇద్దరి సంకేతం అందలేదు.

అందిన కొద్దిమంది యిళ్ళలోనుంచి బయటికి పరుగెత్తుకొచ్చారు. అయితే ఆ సంకేతం యెటునుంచి వచ్చిందో వాళ్ళకి వెంటనే అర్థం కాలేదు.

కాసేపు చూసి గస్తీ బందిపోట్లు జాడ కనిపించక పోవటంతో చకచకా అందరిని నిద్ర లేపటం మొదలెట్టారు.

కోయిల సిద్ధార్థ ఎలర్టుగా నించున్నారు. ఇప్పుడు వాళ్ళ దగ్గర ఆరు కత్తులు, రెండు బాణం కర్రలు వున్నాయి.

"విల్లమ్ములుంటే యెంత బావుండును....!" అనుకొన్నది కోయిల........అవి వుంటే యెంత దూరం నుంచయినా శత్రువుని గురి చూసి బాణాలు నాటగలదామె.

ఏం చెయ్యాలో ఎలా ఎటాక్ చెయ్యాలో సరిగ్గా ప్లాన్ చేసుకోకముందే వేగంగా జరిగిపోతున్న సంఘటనలకి రవంత ఆశ్చర్యంతో ప్రశ్నార్థకంగా ఆమెవైపు చూశాడు సిద్ధార్థ.

"వాళ్ళకి మనమెక్కడ దాక్కొని వున్నామో ఇంకా తెలియదు. కాని తెలుసుకోవటం పెద్ద కష్టం కాదు. ఈలోపల మనం వాళ్ళనెలా సంహరించాలో ఓ నిర్ణయానికి రావటం చాలా అవసరం...." అన్నది కోయిల.

మనిద్దరం వాళ్ళ కెదురుపడి సంహరించటం జరిగే పని కాదు....నలుగురైదుగురుని చంపేలోగా వాళ్ళందరు కలిసి మన శరీరాల్ని ముక్కలు ముక్కలు చేసేస్తారు. మనం బయటపడకుండా వాళ్ళని మట్టుబెట్టాలి" చెప్పాడు సిద్ధార.

దగువ గోలగా అరుచుకుంటూ గూడెంలోని మనుషు లంతా గుంపుగా చేరిపోతున్నారు. స్త్రీలు, పిల్లలు, వృద్ధులు తప్పిస్తే యితరులు, మధ్యవయస్కులయిన బంది పోట్లు దాదాపు ఏభైమందికి పైగానే వున్నట్టు గమ నించారిద్దరు.

"వాళ్ళు తమలో తామేదో చర్చించుకుని జట్లుగా విడిపోతున్నారు. వెతకటానికి నిర్ణయించుకుంటున్నట్టు కని పిస్తోంది. అలా జరిగితే మనకి వాళ్ళని నాశనం చెయ్యటం తేలికవుతుంది" అన్నాడు సిద్ధార.

"మనమీ బండరాళ్ళ వెనక వున్నట్టు తెలిస్తే తక్కిన వాళ్ళందరు యిక్కడికే వచ్చి మనలిని చుట్టుముట్టేస్తారు. అప్పుడు తప్పించుకోలేము" అన్నది కోయిల సాలో చనగా.

ఇద్దరు తర్జనభర్జనలు చేసుకుంటుండగానే బందిపోట్లు ఏభైమంది నాలుగు జట్లుగా చీలిపోయి నలువైపులా శత్రువుల కోసం వెతకటం మొదలెట్టారు.

కోయిల, సిద్ధార చాలా తొందరగా ఓ నిశ్చయాని కొచ్చేశారు.

గూడెం చుట్టూ బండరాళ్ళు వలయంగా పేర్చబడి వున్నాయి. తామున్న చోటికి ఒక జట్టు వస్తే తక్కిన మూడు జట్లు మూడువైపులకి వెళ్తాయి. తమవైపు వచ్చిన

బందిపోట్లని బండరాళ్ళ వెనుక పొంచివుండి మట్టుపెడతారు.

అక్కడ పని పూర్తికాగానే మరోవైపుకి మెల్లగా నక్కి చేరుకుంటారు. అక్కడికి చేరిన బందిపోట్లని కూడా అలాగే సంహరించి తక్కిన రెండువైపులకి అదేవిధంగా చేరుకుని, అక్కడికి వచ్చే బందిపోట్లని సంహరిస్తారు.

కర్ర విరక్కుండా పాము చస్తుంది.

స్త్రీలు, వృద్ధులు, పిల్లల్ని తామెలాగూ వదిలెయ్యదలచుకున్నారు. తమ టార్గెట్ గూడేలకి గూడేలు దోచుకుంటున్న వయసులో వున్న ఆ బందిపోట్లు! వాళ్ళే ఇప్పుడు కోరి తమ చావును వరిస్తున్నారు!

కోయిల, సిద్ధార్థ పథకం కొంతవరకు మంచి ఫలితాన్నే ఇచ్చింది.

ముందుగా చేరిన పదిహేనుమంది బందిపోట్లను తమ పథకం ప్రకారం చాటునుండి దెబ్బకు నలుగురు చొప్పున నేలకూల్చేశారిద్దరు కలిసి.

అయితే వాళ్ళు చస్తూ పెట్టిన కేకలతో శత్రువు లెక్కడున్నారో తక్కిన బందిపోట్లకి తెలిసిపోయింది. అంతే! ఒక్కసారిగా వాళ్ళంతా కోయిల సిద్ధార్థ దాగి వున్న బండరాళ్ళవైపు పరుగెత్తుకుంటూ వచ్చారు.

అయితే, అప్పటికే వాళ్ళిద్దరివద్ద చాలా ఆయుధాలు పోగుపడ్డాయి. వాటిని ప్రయోగించి వీలయినంతమందిని సంహరించాలని నిర్ణయించుకున్నారు.

కోయిల రెండు చేతుల్తో రెండు కత్తులు ధరించి రుద్రకాళికలా వాళ్ళమీదకు విరుచుకు పడింది.

వాలుగా వున్న ప్రదేశం నుంచి వాళ్ళు పైకి— తామున్న ప్రదేశానికి—ఎక్కుతూ వస్తున్న సమయంలో

తమ దగ్గరున్న కత్తుల్ని ఒకటొకటి వాళ్ళమీదకు విసి రారు కోయిల, సిద్ధారలు.

వాళ్ళ గురి సూటిగా టార్గెట్స్‌ని తాకటం, ఒకేసారి నలుగురు చొప్పున బందిపోట్లు హాహాకారాలు చేస్తూ నేల కూలిపోవటం చాలా వేగంగా జరిగిపోయింది.

అప్పటికే ముప్పయిమందికి పైగానే శత్రువులు నేల కూలిపోయారు. తక్కినవాళ్ళు తమదగ్గరున్న ఆయుధాల్ని మహావేగంగా బండరాళ్ళవైపు విసిరారు.

అయితే బండల వెనుకనున్న కోయిల సిద్ధారలని చేర కుండానే అవన్నీ బండరాళ్ళకి కొట్టుకొని ఖంగున శబ్దం చేస్తూ నేలమీద వ్యర్థంగా పడిపోయాయి.

అయినా వాళ్ళు మహోగ్రంగా కేకలు పెడుతూ పైకి, పైపైకి వచ్చేస్తున్నారు.

కోయిల దగ్గర రెండు బాణం కర్రలు తప్ప ఆయుధా లన్నీ ఖర్చయిపోయాయి.

అప్పుడు సిద్ధార స్పాంటేనియస్ గా నిర్ణయం తీసు కుని ఆమెకు చెప్పాడు.

వరసగా పేర్చబడిన బండరాళ్ళని వాలుగా వున్న బందిపోట్లమీదికి దొర్లించెయ్యటమే! వాళ్ళు పైకి చేరే లోపల ఆ రాళ్ళకింద నలిగి చస్తారు.

“అయితే, ఆ రాళ్ళు వాళ్ళని నజ్జు చేసేసి, దిగువ నున్న వాళ్ళ ఇళ్ళను, వాళ్ళ భార్యాపిల్లల్ని కూడా నేల మట్టం చేసేస్తాయి. ఎలా మరి?....” అన్నది కోయిల సందేహంగా.

“నువ్వింకా ఈ రాక్షసుల కుటుంబాల గురించి జాలి పడితే లాభంలేదు. ఈలోపల వాళ్ళు పైకి చేరిపోతారు. మనల్ని నరికి పోగులు పెట్టేస్తారు. నాకూ జాలి వేస్తోంది

పిల్లల్ని చూస్తే.... కానీ అవన్నీ ఆలోచించే వ్యవధి లేదు...." సిద్ధార్థ హెచ్చరికతో ఆమె కూడా తన నిర్ణయాన్ని మార్చుకుంది.

మరుక్షణం వాలుగా వున్న చోటికి పైనుండి దబ దబ మంటూ బండరాళ్ళు దొర్లటం ప్రారంభమయింది. ఏ రాళ్ళను తమకు రక్షక వలయంగా పేర్చుకున్నారో ఆ రాళ్ళకింద పడి హాహాకారాలు చేస్తూ నలిగిపోయారు బందిపోట్లు.

అప్పటికి తూర్పు తెల్లవారిపోయింది.

ఎటు చూసినా పీనుగుల గుట్టలతో బందిపోట్ల స్థావరమంతా నానా బీభత్సంగా తయారయింది.

బందిపోట్లతోబాటు చాలామంది స్త్రీలు, పిల్లలు రాళ్ళకింద నలిగి ప్రాణాలు వదలటం చూసి కోయిల గుండె నీరయిపోయింది. ఆ దృశ్యాన్ని చూడలేక తల తిప్పుకున్నది.

"నీ ప్రతిజ్ఞ నెరవేరింది. ఇక వెళ్దామా?" అన్నాడు సిద్ధార్థ.

ఆమెకు నిజంగా చాలా సంతృప్తిగా వుంది. తన తండ్రి ఆత్మకు శాంతి కలిగించటమే కాక ఎడారిలోని గూడేలవాసులందరికీ శాశ్వతంగా బందిపోట్ల బెడద తప్పించగలిగినందుకు ఆమెకు చాలా ఆనందంగానూ వుంది.

"నువ్వు నాకు చేసిన సహాయం ఈ జన్మకి మరచిపోను. ఇక నేనిచ్చిన మాట నెరవేర్చుకోవలసి వుంది.... పద, నిన్ను స్వామి చెప్పిన గ్రామానికి నేను చేరుస్తాను" అంది కోయిల.

అప్పటికి సూర్యుడు ఉదయించి వేగంగా పైకి వచ్చే

స్తున్నాడు.

ఇద్దరూ ఇసుకలో నడుస్తున్నారు.

"సిద్ధార్థా, నేనంటే నీ మనసులో ఎలాంటి స్పందనా కలగటం లేదా? నాతో వుండిపోతానని ఒక్క మాట అనకూడదా? జీవితాంతం నీకు సేవ చేస్తూ బతికేస్తాను. లేదా, నీ వెంట నన్ను తీసుకుపో, ఆనందంగా వచ్చేస్తాను. నీ ఇంట కేవలం దాసీగా వుంటూ నీకు పరిచర్యలు చేసుకుంటూ నిన్ను చూసుకుంటూ నా జీవితం గడిపేస్తాను—నన్ను నీ భార్యగా చేసుకోనక్కర్లేదు—కనీసం నీ సేవకురాలిగా వుంచుకోలేవా?"

అని అర్థించాలనుకున్నది కోయిల. కాని ఆమె పెదాలు ఆమె భావాలను పైకి ఉచ్చరించలేకపోయాయి. కాని ఆమె కళ్ళు మాత్రం అతని కళ్ళకు మౌనంగా ఆ మాటల్ని అనువదించాయి.

సిద్ధార్థ ఆమె చూపుల్నుంచి తన దృష్టిని మరలించుకుని, "ఆ గ్రామం యింకా యెంత దూరముంటుంది?" అన్నాడు.

సరిగ్గా అదే సమయంలో వారి తలల మీదుగా రెండుసార్లు చక్కర్లు కొడుతూ యెగిరింది ఓ విమానం.

దిగ్భ్రాంతితో దానివంక చూశాడు సిద్ధార్థ. అతని కళ్ళలో కోటి జ్యోత్స్నల వెలుగు!

ఏర్‌ఫోర్స్‌కి చెందిన ఆ చిన్న విమానాన్ని ఆనందంగా విస్మయంగా ఇంకా ప్రకటించలేని అనేక భావాలతో అపురూపంగా చూశాడు సిద్ధార్థ. కోయిల అయోమయంగా చూసింది.

• • •

"ఎస్, హి ఈజ్ సిద్ధార్థ! నో డౌట్! అదిగో మాని

పోయి చీలికలయిపోయినా అతని యూనిఫాం స్పష్టంగా కనిపిస్తోంది" విస్మయంగా అరిచింది విమానంలోని ఏర్ హోస్టెస్ రమ్య.

విమానంలోని ఏర్ ఫోర్స్ అధికార్లు, సెక్యూరిటీ స్టాఫ్, విమానం నడుపుతున్న సునీల్ — అందరు కోయిలతో నడుస్తూ వెళ్తున్న సిద్ధారను స్పష్టంగా చూశారు.

సునీల్ విమానాన్ని బాగా దిగువగా సిద్ధార నెత్తి మీదుగా రెండు రౌండ్లు వేశాడు. అతని ఎడమ చేతిలోకి రివాల్వర్ ఆటోమాటిగ్గా రావటం సేఫ్టీకాచ్ తప్పించటం చాలా ఆటోమాటిక్ గా జరిగిపోయాయి.

అయితే రమ్య ఈ పరిస్థితి వస్తుందని ముందుగానే వూహించి సునీల్ ప్రతీ చర్యను శ్రద్ధగా ఓ కంట గమనిస్తూనే వుంది. సీనియర్ అధికారికి దివ్యతో అతనన్న మాటలు బెదిరింపు గురించి ముందుగానే చెప్పి తను కూడా ఆ ప్లేన్ లో రావటానికి అనుమతి తీసుకున్నది.

ఇప్పుడు సునీల్ చేతిలోకి రివాల్వర్ రాగానే ఆ అధికారికి సైగ చేసింది.

మరుక్షణం సునీల్ చేతిలోని రివాల్వర్ నుంచి రిలీజయిన బులెట్ సిద్ధార గుండెల్ని చీల్చుకుంటూ పోయేదే.

కాని ఎయిర్ ఫోర్స్ అధికారి చాలా వేగంగా రియాక్టయ్యాడు.

సునీల్ చేతిని గట్టిగా పట్టుకొని అతను విమానాన్ని నేలకూల్చేస్తాదేమోనని తనే విమానాన్ని తన కంట్రోల్ లోకి తెచ్చుకున్నాడు.

విమానంలోని సెక్యూరిటీ సిబ్బంది సునీల్ ని అదుపులోకి తీసుకున్నారు. అంతా క్షణాల్లో జరిగిపోయింది.

"దివ్యా, నీకిచ్చిన మాట నిలబెట్టుకున్నాను, నీ

సిద్ధార్థని త్వరలో నీముందుంచుతాను" అని మనసులోనే అనుకున్నది, మంచి మనసున్న ఏర్ హోస్టెస్ రమ్య.

విమానంలోనించి తాటినిచ్చెన కిందికి జారింది—ఆ వెనక నే ఏర్ ఫోర్స్ అధికారి గొంతు స్రష్టంగా సిద్ధార్థ చెవులకి వినిపించింది.

"మిస్టర్ సిద్ధార్థా, ఇక్కడెక్కడా విమానాన్ని ల్యాండ్ చెయ్యటం కుదరదు. నిచ్చెన ఎక్కి వచ్చెయ్యండి. ఉయార్ ఫ్రం హైద్రాబాడ్" చెప్పాడు అధికారి.

కోయిల వంక ఆప్యాయంగా, అభిమానంగా, ప్రేమగా, వాత్సల్యంగా, కృతజ్ఞతగా, బాధగా, బరువుగా—ఇంకా అనేకమైన వ్యక్తీకరించలేని భావాలతో చూశాడు సిద్ధార్థ.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి. సిద్ధార్థ చేతివందుకుని గాఢంగా చుంబించింది. కన్నీళ్ళతో అభిషేకించింది.

"కోయిలా! నీ మేలు మరచిపోను. నాకు సెలవిప్పించు, నీకు కృతజ్ఞుడ్ని" అన్నాడు సిద్ధార్థ.

కోయిల కన్నీరు తుడుచుకుని స్నేహపూర్వకంగా నవ్వింది.

సిద్ధార్థ చటుక్కున ఆమెచేతి నందుకుని గాఢంగా చుంబించి వదిలాడు.

కోయిల కళ్ళలో కోటి వెలుగులు!

"ఈ జన్మకీ వరంచాలు! మరో జన్మంటూ వుంటే నీ భార్యగా నీ సరసన స్థానం సంపాదించుకుంటాను" మనసులోనే ఆనందంగా చెప్పుకుంది కోయిల.

చకచక తాటినిచ్చెన మీదుగా విమానం ఎక్కేశాడు

సిద్ధార్థ. అప్పటికి కనీసం పదిసార్లయినా విమానం వాళ్ళ మీదుగా రౌండ్లు కొట్టింది.

"గుడ్ బై ఫరెవర్!" అన్నాడు మెల్లిగా సిద్ధార్థ.

దిగుతున్న ఎడారి కోయిల చిన్న చుక్కగా మారేంతవరకు ఆవైపే చూస్తూండిపోయాడు సిద్ధార్థ.

—: సమాప్తం :—

## అంకితం

సప్త చలాధీశుడు, కలియుగ వైకుంఠమూర్తి, నా ఆరాధ్యదైవం తిరుమల శ్రీనివాసుని చరణార విందాలకు ముకుళిత హస్తాలతో—

—రచయిత.

కొత్త సీరియల్ ప్రారంభం

# రాక్షసహేల

వాణిశ్రీ

విజయ నెత్తిన పిడుగు పడినట్లు అదిరిపోయింది. శరీరంలో రక్తమంతా నీరై పోయినట్లు నీరసపడిపోయింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగి మసక మసకగా కన్పించాయి పరిసరాలు.

సోఫాలో కూలబడిపోయింది.

"అంకుల్! మీరు చెప్పేదంతా నిజమేనా?" అని హీనస్వరంతో ప్రశ్నించింది విజయ.

"రేపో మాపో చావబోతున్నవాడిని అబద్ధం ఎందుకు చెప్తానమ్మా? ఈ నిజాన్ని ఇన్నాళ్ళూ యెవరికీ చెప్పకుండా కడుపులో దాచుకున్నాను. బైటపడితే సర్వనాశనం చేస్తారని భయంతో నోరు మెదపలేకపోయాను. ఇప్పుడిక దాచుకోలేకపోయాను."

జోగారావు దగ్గు తెర వచ్చి మాట్లాడలేకపోయాడు.

విజయ కొంచెంసేపు మాటా పలుకూ లేకుండా జోగారావువైపు చూస్తూ వుండిపోయింది.

జోగారావు ఆరేళ్ళ క్రితం పక్షవాతంతో మంచాన పడ్డాడు. అప్పట్నుంచి అనారోగ్యంగానే వుంది. ఇప్పుడు మనిషి మరీ నీరసించిపోయాడు. మాటకూడా స్పష్టంగా రావడంలేదు. ఇక ఎక్కువరోజులు నెట్టుకొచ్చేటట్లుగా కనిపించటంలేదు.

కిరణ్ టెలిగ్రామ్ అందగానే నాయనమ్మతో కలిసి వెంటనే బయల్దేరి వచ్చింది విజయ.

ఆమెకు వూహ వచ్చినప్పట్నుంచి జోగారావు వాళ్ళ భూములు చూస్తున్నాడు. సంవత్సరానికొకసారి మద్రాస్ నుంచి అనందపురం వచ్చి పంటమీద వచ్చే ఆదాయం తీసుకెళ్ళడం తప్పితే కుటుంబం గురించి వివరాలు ఆమెకు పూర్తిగా తెలియవు. నాయనమ్మ భవానీదేవి విజయను అలా పెంచింది.

తనకు రెండేళ్ళ వయస్సున్నప్పుడు తల్లిదండ్రుల్ని దొంగలు కొట్టి చంపి డబ్బు, నగలు దోచుకుపోయారని మాత్రమే ఆమెకు తెలుసుగాని దాని వెనుక ఇంత కథ వుందని తెలియదు.

ఇప్పుడు జోగారావు అవసాన దశలో నిజం చెప్తుంటే షాక్ తిన్నట్లు అయిపోయింది.

ఆ ఫోటో వైపు కళ్ళార్పకుండా చూసింది. మధ్యలో తండ్రి బ్రహ్మాజీ, తల్లి సుజనా దేవి కూర్చున్నారు. వాళ్ళతో పాటు కూర్చున్న నలుగురు ప్రాణస్నేహితులు.

ఆ ప్రాణస్నేహితులే డబ్బుకోసం, బంగారం కోసం ప్రాణాలు తీశారు.

'ఎంత భయంకరమైన నిజం!

సంవత్సరం పొడుగునా మద్రాస్‌లో కాలం గడిపిన ఆమెకు అనందపురం రాగానే మండుటెండలో నుంచి తల్లిఒడిలోకి వచ్చి వాలినట్లు అనిపించేది.

పది ఎకరాల స్థలంలో మూడంతస్తుల మేడ. చుట్టూ పది అడుగుల ఎత్తున పాటి మట్టి కోటగోడ. మధ్యలో మామిడి, సపోట, నారింజ చెట్లతో గుబురుగా తోట. సింహద్వారం ప్రక్కనే భవానీదేవి గుడి. కోనేరులో

తామర పూలు. విజయకు అక్కడున్నన్నాళ్ళూ స్వర్గంలో వున్నట్లు అనిపించేది.

ఊరికి చివరగా వంద ఎకరాల మామిడితోట. అందులో గెస్టు హౌస్ కూడా వున్నాయి. అదిగాక ఏభై ఎకరాల మాగాణి వుంది. అవన్నీ జోగారావే మేనేజ్ చేస్తుండే వాడు.

ఇన్నాళ్ళూ తల్లిదండ్రులు దొంగల చేతిలో ప్రాణాలు పోగొట్టుకున్నారనే అనుకునేది. కాని ప్రాణస్నేహితుల నమ్మకద్రోహంతో చంపబడ్డారని తెలిసి ఆమె మెదడు మొద్దుబారిపోయింది. ప్రపంచం శూన్యంగా కనిపించింది.

తను ఏన్నడూ చూడని తల్లిదండ్రులు స్నేహితుల దుర్మార్గానికి బలైపోయారని తెలిసి ఆమె రక్తంలో చలనం కలిగించింది. శరీరం వుడికిపోయింది.

జోగారావు పిలుస్తున్నా వినిపించుకోకుండా ఆమె చరచర నడిచింది.

జీప్ ఎక్కి స్పీడ్ ఎక్కించింది. దుమ్ము రేపుకుంటూ విమానంలా పోతున్న జీవ్‌ని నోళ్ళు తెరిచి చూశారు ఆ వీధిలో వాళ్ళు.

"నాన్నా! విజయ వెళ్ళిపోయిందా?" ఆశ్చర్యపోతూ అడిగాడు కిరణ్.

జోగారావు తల వూపాడు నీరసంగా.

"చెప్పకుండా వెళ్ళిపోయిందేమిటి? కొత్త కాసెట్ తెచ్చాను సినిమా చూపిస్తానని చెప్పిందే!" అన్నాడు.

విజయ తనకు చెప్పకుండా వెళ్ళిపోవడం అతనికి వింతగా అనిపించింది,

# 2

భవానీదేవి టీ.వీ. లో వస్తున్న తెలుగు వార్తలు చూస్తోంది. రాత్రి ఏడున్నర దాటింది.

ఆ గది విశాలంగా వుంది. గోడలు గులాబీ రంగులో వున్నాయి. మధ్యలో పెద్ద ఛాండలీర్ వెలుగులు విరజిమ్ముతోంది. గోడలకు అక్కడక్కడ జింక కొమ్ములు అమర్చి వున్నాయి. గది మధ్యలో వున్న పెద్ద పట్టె మంచం, తెల్లటి దోమ తెర వున్నాయి.

గోడకు నిలువెత్తు ఆయిల్ పెయింట్ లో తుపాకీ పట్టుకుని హుందాగా, ఠీవిగానిల్చున్న రాజావారున్నారు. ఆయన కాళ్ళదగ్గర చచ్చిపడివున్న పెద్ద పులి వుంది. ఆ చిత్రం ఫ్రేమ్ చుట్టూ పెద్ద పులిగోళ్ళతో తయారుచేసిన హారం వుంది. దానికి ఎన్ని గోళ్ళున్నాయో చెప్పడం కష్టం. వంద గోళ్ళపైనే వుండొచ్చు. ఆయన రాజా శ్యామ్‌సుందరప్రసాద్. భవానీదేవి భర్త.

ఆ భవనంలో లెక్కలేనన్ని గదులున్నా, భవానీదేవి మద్రాస్ నుంచి వచ్చినప్పుడు రెండు గదులు, ఒక హాలు మాత్రమే వాడుతుంటుంది. మిగిలిన గదులన్నీ తాళాలు బిగించి వుంటాయి. వాటిలో అలనాటి జమీందారీ ఫర్నిచర్, పాత్ర సామాను వగైరాలుంటాయి.

విజయ చరచర వచ్చి మంచంమీద వాలిపోయింది. ఆమె ముఖం గంభీరంగా వుంది. ఎర్రబడి వచ్చినట్లు కనిపిస్తోంది. మనుమరాలు మాటా పలుకూ లేకుండా వచ్చి పడుకోవడం భవానీదేవికి అసహజంగా కనిపించింది. టి.వి. ఆఫ్ చేసి దగ్గరగా వచ్చింది.

"అలా వున్నావేమిటమ్మా? ఒంట్లో బాగాలేదా?" అంది విజయ నుదిటిమీద చెయ్యివేసి.

విజయ లేచి కూర్చుంది.

"అమ్మా! నేనొకటి అడుగుతాను నిజం చెప్పు" అంది నాయనమ్మ ముఖంలోకి సూటిగా చూస్తూ.

విజయ చిన్నతనం నుంచి ఆమెను 'అమ్మా' అనే పిలుస్తుంది.

భవానీదేవి నివ్వెరపోయింది.

"నేనెప్పుడు అబద్ధం చెప్పానమ్మా నీకు?" అని యెదురుప్రశ్న వేసింది.

"అమ్మా, నాన్న ఎలా చనిపోయారో చెప్పు. వివరంగా చెప్పాలి. ఆ రోజు నీకు బాగా గుర్తుండే వుంటుంది" అంది విజయ వణుకుతున్న కంఠంతో.

"అదంతా ఎందుకమ్మా! ఇప్పుడు?"

"తెలుసుకోవాలనుకుంటున్నాను."

భవానీదేవి దీర్ఘంగా నిట్టూర్చి చెప్పటం ప్రారంభించింది:

"అప్పుడు నీకు రెండు సంవత్సరాలు.

హైదరాబాద్ నుంచి నాన్నగారి స్నేహితులు నలుగురు వచ్చారు. అందులో అవతారకృష్ణ నాన్నగారితోపాటు చదువుకున్నాడు. హైదరాబాద్‌లో స్టీల్ వ్యాపారం చేస్తున్నాడు. అప్పుడప్పుడు డబ్బు అప్పుగా తీసికెళ్ళి ఇస్తుండేవాడు. మిగిలిన ముగ్గురు అతని ద్వారా నాన్నకి స్నేహితులు.

మామూలుగానే అవతారకృష్ణ పదిలక్షలు అప్పు కావాలని వచ్చాడు. అంతకుముందెప్పుడు అంత డబ్బు అడగలేదు. లక్ష, రెండు లక్షలు తీసికెళ్ళి అర్థరూపాయి వడ్డీతో తిరిగి ఇస్తుండేవాడు. అంత డబ్బు రెడీగా లేదు. బాంక్‌లో డ్రా చేసి ఇస్తానని అందరూ కలసి కారులో

ఏలూరు వెళ్ళారు. వాళ్ళతోపాటు మీ అమ్మగూడా వెళ్ళింది.

డబ్బు తీసుకుని అట్నుంచి అటు వెళ్ళిపోతామని అవతారకృష్ణ అంటే మీ నాన్న ఒప్పుకోలేదు. ఆనంద పురంలో రెండు రోజులు వుండి వెళ్ళమని బలవంతంచేసి తీసుకుని వస్తున్నారు. అందరూ ఫస్టు షో సినిమా చూసి తిరిగివస్తుంటే దారిలో దొంగలు అటకాయించారు.

"మీ నాన్న డబ్బున్న సూట్‌కేసు ఇవ్వలేదు. ప్రతి ఘటించాడు. మీ అమ్మగూడా నగలు ఇవ్వనని మొండి కేసింది. ఆ పాపిష్టి డబ్బు, నగల కోసం దొంగలు వాళ్ళిద్దర్నీ కత్తులతో పొడిచి చంపారమ్మా. మీ నాన్న స్నేహితుల్ని కూడా కొట్టారు."

భవానీదేవికి అదంతా గుర్తుకొచ్చి దుఃఖం ముంచు కొచ్చింది. నోటికి చేతులు అడ్డం పెట్టుకుని రాబోతున్న ఏడుపు ఆపుకోవాలని ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది. వెక్కి వెక్కి ఏడ్చింది.

"అంతా అబద్ధం" గట్టిగా అరిచింది విజయ.

భవానీదేవి కళ్ళు తుడుచుకుంటూ ఆశ్చర్యంగా చూసింది.

"ఏమిటమ్మా! నువ్వనేది?"

"నువ్వు చెప్పిందంతా కట్టుకథ."

ఆమె స్థాణువైపోయింది.

"నీ కిదంతా యెవరు చెప్పారు?" ప్రశ్నించింది విజయ.

"జోగారావు చెప్పాడమ్మా! అతను యెప్పుడూ నాన్నగారితోనే వుండేవాడు. అప్పుడూ వున్నాడు."

"లేదమ్మా! నాన్నగారిని, అమ్మని దొంగలు చంప

లేదు. నాన్న స్నేహితులే చంపారు. డబ్బు, నగలు కాజేసి అడవిలో పాతిపెట్టారు. ఈ సంగతి బైటపెడితే కుటుంబంతో సహా అందర్నీ చంపుతామని జోగారావుని భయపెట్టారు. ప్రాణంమీది తీపితో జోగారావు ఈ నిజం ఎవరికీ చెప్పలేకపోయాడు."

భవానీదేవి కుప్పకూలి పోయింది ఆ సంగతి విని.

"ఇప్పుడు ఎవరు చెప్పారమ్మా అదంతా?"

"జోగారావే చెప్పాడమ్మా! ఎటూ చనిపోతున్నా నని తెలిసి ఇన్నాళ్టికి నిజం చెప్పాడు. మనసులో దాచుకోలేకపోయాడు" అంది విజయ.

"ఇప్పుడు చెప్పి యేం లాభం? అప్పుడే తెలియజేస్తే ఆ దుర్మార్గుల్ని ఉరికంబం ఎక్కించేదాన్ని" ఆవేశంతో అంది భవానీదేవి.

"ఇప్పటికీ మించిపోయిందేం లేదమ్మా! అమ్మని, నాన్నని దుర్మార్గంగా చంపిన ఆ రాక్షసుల్ని ప్రాణా లతో వదిలిపెట్టను. వాళ్ళని చంపితేగాని నా మనసు ప్రశాంతంగా వుండదు" వణుకుతున్న కంఠంతో అంది విజయ.

"పిచ్చి తల్లీ! ఇప్పుడు వాళ్ళెక్కడ వున్నారో? చచ్చారో, బతికారో తెలీదు. ఎక్కడని వెతుకుతావు? యెట్లా చంపుతావు. రోజులు మారిపోయాయమ్మా! మనిషిని హత్య చేస్తే పోలీసులకు దొరికిపోతావు" అంది భవానీదేవి.

"రోజులు మారినా, నా వంట్లో ప్రవహిస్తున్న నాన్న రక్తం మారుతుందా అమ్మా!"

"ఆవేశంతో అంటున్నావుగాని ఒకర్ని కాదు, నలు గుర్ని వెతికి పట్టుకుని చంపడం నీవల్ల అవుతుందా తల్లీ?

అదెంత కష్టసాధ్యమో ఆలోచించావా?"

"ఎంత కష్టమైనా సాధిస్తాను. మనిషికి అసాధ్యమైనది ఈ ప్రపంచంలో ఏదీ లేదమ్మా!"

"వద్దమ్మా! నీది పసివయస్సు. అనుభవం లేదు. పెళ్ళి చేసుకుని, పిల్లాపాపలతో గడపాల్సిన సమయంలో పగ, ప్రతీకారం అంటూ లేనిపోని కష్టాలు కొనితెచ్చుకుంటావా? వద్దమ్మా! వద్దు" అంది భవానిదేవి.

"హుఁ....అమ్మా! నువ్వేనా మాట్లాడుతున్నది. ఒక జమీందారు కూతురివి, మరొక జమీందారు భార్యవి, కన్నతల్లివి యింత పిరికిదానివి యెలా అయ్యావు?"

"గతించిన గతం తవ్వుకుని, అక్కరకురాని పొరపాలవల్ల జీవితం వ్యర్థంకావడం తప్ప ప్రయోజనం ఏమీ లేదమ్మా! సూర్యవంశం, చంద్రవంశం, ఆ జమీందారీలు అన్నీ పోయాయి."

"ఏది పోయినా మనిషి గుణం మారదమ్మా! నాన్న, అమ్మ స్నేహితుల చేతిలోనే దుర్మార్గంగా చంపబడ్డారని విన్నవేళ నా రక్తం వుడికిపోయింది. నా మనసు ప్రతీకారం తీర్చుకోమని ఆదేశిస్తున్నదమ్మా! జీవితాంతం అశాంతితో కుమిలిపోయేదానికన్నా, దానికి కారణమైన పగ తీర్చుకుని కొద్దిరోజులయినా తృప్తిగా బ్రతుకుతానమ్మా....!" ఆవేశంతో యెర్రబడిపోయింది విజయ ముఖం.

భవానీదేవి ఆశ్చర్యంతో విజయను తదేకంగా చూసింది. కొత్తగా ఎవరోన్ని చూస్తున్నట్లుగా భ్రమ కలిగింది. ఆమె ఆవేశం, పట్టుదల చూస్తూంటే తనకి కూడా

నెత్తురు మరుగుతున్నట్లు, నరాల్లో సంచలనం బయల్దేరి నట్లు అవుతోంది.

విజయ పట్టిన పట్టు వదలదని ఆమెకు తెలుసు.

## 3

నాంపల్లిలో రైలు దిగిన తర్వాత ఎక్కడికి పోవాలో అర్థం కాలేదు రాజయ్యకి. సరస్వతి అయోమయంగా చూసింది. రైలు దిగిన ప్రయాణీకులు ఒక్కొక్కరే వెళ్ళి పోతుంటే వాళ్ళూ గేటు దాటి బయటకు వచ్చారు.

రిక్షావాళ్ళు, ఆటోలవాళ్ళు మూగారు. వాళ్ళని తప్పించుకుని రోడ్డుమీద పడ్డారు. హైదరాబాద్ వాళ్ళకి కొత్త. తెలియకుండా ఆటోగాని, రిక్షాగాని యెక్కితే యెక్కడికి తీసుకెళ్తారో యేమోనని రాజయ్యకు భయం. అతని స్నేహితుడు సింహాద్రి ఆల్విన్‌లో పని చేస్తున్నాడు. అతని దగ్గరికి వెళ్ళాలి.

కానీ అర్ధరాత్రి దాటింది.

ఇప్పుడా ఫ్యాక్టరీ తీసివుంటుందా? సింహాద్రి ఇప్పుడు వుంటాడా?

అనవసరంగా వెళ్ళడం యెందుకు? తెల్లవారి వెళ్తే బాగుంటుందని రాజయ్య అనుకున్నాడు.

తెల్లవారే వరకూ యెక్కడ వుండా అన్నదే సమస్య.

ఎదురుగా వున్న హోటల్లో రూమ్ వుందేమో అడి గాడు. రాజయ్య ముఖం చూసీ చూడనట్లుగా చూసి "నై ....జావ్ ...." అన్నాడు రిసెప్షన్‌లో వున్న పెద్ద మనిషి.

రాజయ్య చేతిలో సూట్‌కేస్ వుంది.

సరస్వతి భుజానికి జిప్ బ్యాగ్ వ్రేలాడుతున్నది.

రోడ్డుకి అటూ యిటూ చూసుకుంటూ బయల్దేరారు. ఎక్కడికో వాళ్ళకే తెలీదు. తెల్లవారేవరకూ గడప డానికి ఏదయినా మరుగు దొరకకుండేమోనని రాజయ్య ఆశ.

లైట్లు పట్టపగల్లా వెలుగుతున్నాయి.

అప్పుడప్పుడు కార్లు, బస్సులు లారీలు వెళ్తున్నాయి.

కొంతదూరం నడిచాక చీకటిగా వుంది.

సరిగ్గా అక్కడే వాళ్ళముందు సరికొత్త వెంజికారు సడెన్ బ్రేక్‌తో ఆగింది.

రాజయ్య భయంగా చూశాడు.

సరస్వతి రాజయ్య వెనక్కి వెళ్ళి దాక్కుంది.

కారులో నుంచి నలుగురు కుర్రాళ్ళు దిగారు. జీన్స పాంట్స్, హిప్పీ క్రాప్, కళ్ళజోళ్ళు, దుబ్బు మీసాలు, చూడ్డానికి భయం కలిగించేలా వున్నారు. బాగా తాగి వున్నట్లు వాళ్ళ వాలకమే చెప్తోంది.

"ఎవర్రా నువ్వు?" అన్నాడు ఎర్ర కళ్ళచొక్కా వున్న కుర్రాడు.

"నా పేరు రాజయ్యండి."

"ఎక్కడ్నుంచి వస్తున్నావ్?"

"రైలు దిగి వస్తున్నానండి."

"ఏ వూరునుంచి?"

"షోలాపూరండి."

"ఈ పిల్లెవరు?"

"నా కాబోయే పెళ్ళాంవండి."

"అంటే లేపుకొస్తున్నావన్న మాట."

"లేదండి. వాళ్ళ నాన్న పెళ్ళికి ఒప్పుకోలేదండి.

అందుకని యిప్పుడు పెళ్ళి చేసుకుని మళ్ళీ పోతా నండి...."

"బద్మాష్. ఆ పిల్లను లేపుకొచ్చింది గాక కథలు చెప్తున్నావురా?...." అని అతను రాజయ్యని ఒక్క తోపు తోసి ఆ పిల్లని పట్టుకున్నాడు.

సరస్వతి గావుకేక పెట్టింది. ఇద్దరు ఆమె నోరు మూసి కారులోకి నెట్టారు. రాజయ్య తిరగబడ్డాడుగాని నలుగురి ముందు ఆగలేకపోయాడు. అతని చొక్కా చిరిగింది. మూతికి దెబ్బ తగిలి నెత్తురు కారుతోంది.

సరస్వతిని ఎక్కించుకున్న కారు కదిలింది. రాజయ్య రోడ్డుమీద బోర్లాపడ్డాడు. లేచి కేకలు వెయ్య సాగాడు.

అప్పుడు పోలీస్ జీప్ అతని పక్కనే ఆగింది.

"ఏమైంది?...." సబ్ ఇన్స్పెక్టర్ విజయ ప్రశ్నించింది.

రాజయ్య ఏడుస్తూ జరిగింది చెప్పాడు.

"ఎక్కు" అంది యస్.ఐ.

రాజయ్య జీప్ ఎక్కాడు.

పోలీస్ జీప్ విమానంలా పరిగెత్తింది. వెనుక కూర్చున్న ఆడ కానిస్టేబుల్స్ ఆ వేగానికి హడలి పోయారు. ప్రాణాలు బిగపట్టుకుని కూర్చున్నారు.

వెనుక పోలీసు జీప్ వస్తున్నదని తెలుసుకున్న బెంజి కారు స్పీడ్ పెరిగింది.

ఎర్రగడ్డ దగ్గర పెట్రోలు అయిపోయి ఆగిపోయింది కారు.

బెంజి కారు ముందు ఆగింది పోలీస్ జీప్. జీపులో నుంచి యస్.ఐ., కానిస్టేబుల్స్ దిగారు. కాని కారులో

వాళ్ళు దిగలేదు.

"రాస్కెల్స్ దిగండిరా" అంది విజయ కోపంగా.

"మేడమ్! మర్యాదగా మాట్లాడు" అన్నాడు డ్రైవింగ్ సీట్లో కూర్చుని నిర్భయంగా చూస్తున్న ఎర్ర కళ్ళ చౌకాకా కుర్రాడు.

"నీకు మర్యాద కావాల్రా! రాస్కెల్!" అని చెయ్యి పట్టుకుని ఒక్క వూపు వూపింది విజయ.

డోర్‌తో సహా తెరుచుకుని రోడ్డుమీద పడ్డాడు.

"ఊఁ.... జీవ్ ఎక్కించండి స్కౌండ్రల్స్‌ని."

కానిస్టేబుల్స్ అందరినీ కలిపి జీపులో యెక్కించారు.

సరస్వతి ఏడుస్తోంది.

బెంజీకారు టైర్లు చాకుతో కోసేసింది విజయ. తుస్సు తుస్సుమని గాలి పోయింది.

"నే నెవర్నో తెలుసా?...." అంటున్నాడు ఆ కుర్రాడు.

"నువ్వెవడివో స్టేషన్‌లో వింటాన్రా!" అంది విజయ.

"నిన్ను సస్పెండ్ చేయిస్తాను. ఏమనుకున్నావో!"

ఆ కుర్రాడి వీపుమీద లాఠీదెబ్బ పడింది.

"షటప్ యువర్ మౌత్" అంది హూంకరిస్తూ.

పోలీస్ స్టేషన్ ముందు జీవ్ ఆగింది.

రాత్రి రెండు గంటలయింది.

రాజయ్య, సరస్వతి తాము హైదరాబాద్ ఎందుకు వచ్చారో చెప్పారు. వాళ్ళని స్టేషన్‌లో కూర్చోబెట్టి రైలు దిగిన తర్వాత ఏం జరిగిందో స్టేట్‌మెంట్ రాయించి సంతకాలు చేయించింది విజయ.

నలుగురు కుర్రాళ్ళ చేతులకు కఫ్స్ తొడిగి నిలబెట్టింది. ఎదురుగా కుర్చీలో కూర్చుంది విజయ.

ఇన్‌స్పెక్టర్ దుస్తుల్లో వున్న ఆమె వాళ్ళ కళ్ళకి కాళి కలా కనిపిస్తోంది.

ఎర్ర కళ్ళ చొక్కా కుర్రవాడిని ప్రశ్నించింది.

"నీ పేరేమిట్రా?"

"సురేంద్ర" అవమాన భారంతో, కేవురించిన ముఖంతో చెప్పాడు అతను.

"ఎవర్రా మీ నాన్న?"

"హోమ్ మినిష్టర్."

ఆ మాట విని ఉలిక్కిపడింది విజయ. కళ్ళు పెద్దవి చేసి అతన్ని చూసింది. చేతిలోని లాఠీ బిగుసుకుంది. కుర్చీలోంచి సడెన్‌గా లేచింది.

"రాస్కెల్! హోమ్ మినిష్టర్ కొడుకునని చెప్తున్నావా? సిగ్గులేదూ! మీ నాన్న అధికారం అంతా నీ చేతిలో వుందని నీలుగుతున్నావా?"

లాఠీ గాల్లో లేచింది. అందిన చోటల్లా కొట్టింది. రొప్పు వచ్చేవరకు చెయ్యి ఆడుతూనే వుంది.

"ప్లీజ్ మేడమ్! కొట్టొద్దు. ఇంకెప్పుడూ చెయ్యను" అతను కేకలు పెట్టాడు.

స్టేషన్‌లో వున్న కానిస్టేబుల్స్ అంతా నోళ్ళు తెరిచి చూస్తున్నారు.

హోమ్ మినిష్టర్ కొడుకు అని తెలిసి కళ్ళ బాదడం ఎంత సాహసం?

'ఇక ఈవిడ ఉద్యోగానికి నీళ్ళు వదులుకోవాల్సిందే' అనుకున్నారు.

"ఈ రాస్కెల్స్‌ని లాకప్‌లో పడెయ్యండి. కఫ్స్

గూడా తిరయ్యొద్దు...." అంది విజయ ఆవేశంతో వణికి పోతూ.

తర్వాత రెండు గ్లాసులు మంచినీళ్ళు త్రాగింది.

టెలిఫోన్ ముందు కూర్చుని డైరెక్టరీ తిరగేసింది. దినపత్రికల టెలిఫోన్ నెంబర్స్ నోట్ చేసుకుంది. ఒక్కొక్క నెంబరే రింగ్ చేసింది.

"హలో ఈజిట్ ఈ రోజు డెయిలీ?"

"యస్."

"హూ ఈజ్ స్పీకింగ్?"

"ఇన్‌చార్జి ఎడిటర్."

"రేపటి పేపరు ప్రింటయిందా?"

"కొన్ని డిస్ట్రిక్ట్స్ పేపర్లు ప్రింటవుతున్నాయి. ఎవరు మీరు?"

"నేను సబ్ ఇన్‌స్పెక్టర్ విజయని మాట్లాడుతున్నాను."

"చెప్పండి మేడమ్."

"ముఖ్యమైన వార్త వుంది. సిటీ ఎడిషన్‌లో ప్రింట్ చెయ్యడానికి వీలుంటుందా?"

"ముఖ్యమయిన వార్త అయితే ఫ్రంట్ పేజీలో వెయ్యొచ్చు."

"హోమ్ మినిష్టర్ కొడుకు సురేంద్ర, సరస్వతి అనే అమ్మాయిని కిడ్నాప్ చేసి తీసుకుపోతుండగా రెడ్ హేండెడ్‌గా పట్టుకున్నాను. ఎర్రగడ్డ దగ్గర కారు ఆపి టైర్లు కోసేశాను."

"ఈజిట్?"

"యస్."

"పోలీస్ కమీషనర్ గారికి ఫోన్ చేసి కన్ఫరమ్

చేసుకోమంటారా?"

విజయ నవ్వింది.

"ఈ వార్త కమీషనర్కి తప్ప పేపర్లో రాదు. కావాలంటే మీరు పోలీస్ స్టేషన్కి మీ వాళ్ళని ఎవ రన్నాయినా పంపండి. అతని ఫోటో కూడా తీసు కోవచ్చు."

## 4

మర్నాడు దినపత్రికల మొదటి పేజీలలో హోమ్ మినిష్టర్ కొడుకు రాత్రి చేసిన నిర్వాకం బాక్స్ కట్టి ప్రచురించబడింది. కొన్ని పత్రికలవాళ్ళు రాజయ్య, సరస్వతి ఫోటో వాళ్ళతో ఇంటర్వ్యూ, హోమ్ మినిష్టర్ కొడుకు ఫోటోతో సహా ప్రముఖంగా వేశారు___

ఒక దినపత్రిక ఎడిటర్, హోమ్ మినిష్టర్కి ఫోన్ చేశాడు. కాని ఇంట్లో యెవరూ లేరనీ, అంతా పెళ్ళికి మద్రాస్ వెళ్ళారని తెలిసింది. రాత్రి మూడు గంటల నుంచి ట్రై చేస్తుంటే మద్రాసులో ఒక సినిమా స్టార్ యింట్లో దొరికాడు హోమ్ మినిష్టర్. అప్పుడు టైమ్ నాలుగున్నరయింది. తన పరువు మంటగలిపిన యస్.ఐ. మీద కారాలు, మిరియాలు నూరుతూ ఎయిర్ పోర్టుకి వెళ్ళాడు.

మద్రాస్, హైదరాబాద్ ఫ్లైట్ ఉదయం ఆరు గంటలకు బయల్దేరింది. ఏడుగంటలకు బేగం పేటలో దిగాడు హోమ్ మినిష్టర్.

అప్పటికి నగరంలోను, కొన్ని జిల్లాలలోను కిడ్నాప్ వార్త కొన్ని లక్షలమంది చదువుతున్నారు. చదివారు. పక్కింటివాళ్ళతో డిస్కస్ చేస్తున్నారు కూడా.

పోలీస్ ఉన్నతాధికారుల గుండెల్లో రైలింజన్లు పరిగెత్తుతున్నాయి. అసలు యస్. ఐ. విజయ ఎవరో చాలా మందికి తెలియనే తెలియదు. ఇంత గడుగ్గాయి ఇన్నాళ్ళూ సిటీలో యెట్లా ఉద్యోగం చేస్తున్నదో వాళ్ళకి అంతుబట్టలేదు.

హోమ్ మినిష్టర్ నివాసగృహానికి చేరుతూనే ఐ.జి.కి ఫోన్ చేశాడు.

ఆయనింకా లేవలేదు. నిద్రలేపి మంగళహారతి పాడాడు హోమ్ మినిష్టర్.

"గుడ్ మార్నింగ్ సర్" అన్నాడు ఐ.జి. కళ్ళు నులుముకుంటూ.

"పేపరు చూశారా ఐ జి. గారూ!"

"ఏ పేపరు సర్!"

"మీరు ఏ పేపరు చూస్తారు?"

"అన్ని పేపర్లూ చూస్తాను సర్."

"ఏదోక పేపరు చూడండి."

"వాటిజ్ రాంగ్ సర్?"

"మా అబ్బాయిని మీ అడ యస్ ఐ. లాకప్‌లో తోసింది. పేపర్లన్నింటికి ఇన్ఫర్మేషన్ ఇచ్చింది. చూడండి, బొక్సులు కట్టి మరీ వేశారు."

"ఈజిట్?"

"తమరే చూడండి."

"ఇటీస్ వెరీ బాడ్.... వెరీ వెరీ బాడ్ అన్ ది పార్ట్ ఆఫ్ ది యస్.ఐ. ఐ విల్ సస్పెండ్ హర్ ఇమ్మీడియట్లీ"

"ఆ పని చెయ్యకండి. అపొజిషన్ వాళ్ళు పెద్ద గొడవ చేస్తారు."

"తమరేం చెయ్యమంటారు?"

"ఏం చేస్తారో మీ ఇష్టం" హోమ్ మినిస్టరు కోపంగా ఫోన్ రిసీవర్ విసిరిపడేశాడు.

ఐ.జి. తల పట్టుకుని కూర్చున్నాడు కొంతసేపు.

"కాఫీ...." అని గావుకేక పెట్టాడు.

తర్వాత టెలిఫోన్ రిసీవర్ ఎత్తి నెంబర్లు డైల్ చేసి నోటికొచ్చినట్లు తిట్టసాగాడు.

## 5

"యూ ఆర్ ఎ ఫూల్" అన్నాడు కమీషనర్ ఆఫ్ పోలీస్ మండిపడుతూ.

ఆ గదిలో నలుగురు పోలీస్ ఆఫీసర్లు వున్నారు.

విజయ సమాధానం చెప్పలేదు. స్మైల్ చేసి వూరు కుంది.

"పోస్టు గ్రాడ్యుయేట్ వి. స్పోర్ట్సు వుమన్ వి, కరాటే వచ్చినదానివి. కనీసం యస్పీ అన్నా అవుతావనుకున్నాను. డిపార్టుమెంటుకి పేరు తెస్తావనుకున్నాను" కమీషనర్ దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఈ గొడవలో నుంచి యెలా బయటపడాలో అర్థం కావడంలేదు.

"ఇప్పుడు ఏమైంది సర్. పేపరువాళ్ళు మన డిపార్టు మెంటును పొగుడుతూ రాశారుగా!" అంది విజయ అమాయకంగా.

"డోంట్ సే నాన్సెన్స్. పేరు రావడం అంటే పేపర్లలో కాదు. మన పై అధికారుల్లో, పొజిషన్ పార్టీలో" అన్నాడు రొప్పుతూ. "నేను చెప్పినట్లు వింటే బతికిపోతావు."

"చెప్పండి సర్."

"కేస్ విత్ డ్రా చేసుకో!"

"ఎలా సర్? పేపర్లో స్టేట్ మెంటు యిచ్చానుగా?"

"ఎందుకిచ్చావ్? అప్ట్రాల్ నువ్వొక ప్రొబేషనర్వి. ఏదైనా కేసుంటే పై అధికారులకు చెప్పాలి. వాళ్ళ గైడెన్స్ తీసుకోవాలి. అంతేగాని నీ యిష్టం వచ్చినట్లు పేపర్లో స్టేట్ మెంటు ఇస్తావా? అంతా నీ ఇష్టమేనా? ఛీ ...ఛీ....బుర్ర లేనిదానివి దొరికావు."

"మన డిపార్టుమెంటుకి మంచి పేరు రావాలని ఇచ్చాను సర్."

"నువ్వు అమాయకురాలివో గడుసుదానివో తెలియడంలేదు. అసలు నాకొక అనుమానం వస్తోంది. హోమ్ మినిష్టర్తో నీ కేమైనా గ్రడ్జెస్ వున్నాయా?"

"నో....సర్! ఆయనెక్కడ? నేనెక్కడ?"

"మరి ఆ కుర్రాడు హోమ్ మినిష్టర్ కొడుకను దేవుడోయ్ అని మొత్తుకుంటున్నా వినకుండా వాయించేశావ్?"

"యస్ సర్! చట్టం ముందు అందరూ సమానమే కదా సార్! తప్పు చేసిందని ఎవరో అభాండం వేస్తేనే రాముడు సీతను వదిలేశాడు కదా సార్! ఆయనెవరో రాజా, కొడుకు నేరం చేస్తే ఉరిశిక్ష కూడా వేశాడు.... ఆయన పేరు...."

"డోంట్ టాక్ నాన్సెన్స్...."

"సర్! నేనేదో తప్పు చేసినట్లు మీరు రెచ్చిపోవడం బాగాలేదు. ఇప్పటిదాకా పెద్దవాళ్ళని వూరుకున్నాను" విజయ ముఖం సీరియస్గా అయిపోయింది.

పోలీస్ కమీషనర్ ఖంగుతిన్నాడు. అతనికి విజయ

బాకింగ్ ఏమిటో అర్థంకావడంలేదు. ఒక ప్రొఫెసర్ హోమ్ మినిష్టర్ కొడుకుని అరెస్టు చెయ్యడం,లాకప్‌లో పడేసి కుళ్ళబొడవడం సామాన్యమైన విషయం కాదు. దీనికి ఏ పొలిటికల్ బాక్‌గ్రౌండ్ వుందో? లేకపోతే అంత ధైర్యం ఎక్కడుంటుంది?

'సమ్‌థింగ్ ఈజ్ దేర్.'

కమీషనర్ బుర్ర వేడెక్కిపోయింది. వెనుక గొయ్యి, ముందు నుయ్యిలా వుంది అతని పరిస్థితి.

'ఈ కుర్రముండ తననే ఎదిరించేలట్లుంది' అనుకుని జుట్టు పీక్కున్నాడు.

సురేంద్రమీద కేసు బుక్ చేసి పోలీస్ అధికారులను ఇరుకులో పడేసింది విజయ.

కమీషనర్ వెళ్ళిపోయాక ఎ.సి.పి. వస్తాడని విజయకు తెలుసు. అతను అటు వెళ్ళగానే యస్.ఐ. పరమేశ్వర్‌కి చార్జి అప్పగించి ఇంటికి బయల్దేరింది. ఆమెకు ఇప్పుడు తృప్తిగా వుంది.

ఇరవై నాలుగు గంటలు గడిచేసరికి హోమ్ మినిష్టర్ మీద గందరగోళం ఏర్పడింది.

ఆ సమయంలో చీఫ్ మినిష్టర్ నగరంలో లేడు. ఢిల్లీలో కాన్ఫరెన్స్‌కి హాజరవడానికి వెళ్ళాడు. పేపర్లో ప్రముఖంగా పడిన వార్త చదివి ఐ.జి.కి ఫోన్ చేసి జరిగిందేమిటో తెలుసుకున్నాడు. చీఫ్ మినిష్టర్ తనను అడక్కుండా సరాసరి ఐ.జి.కి ఫోన్ చెయ్యడం హోమ్ మినిష్టర్ మనసుకి కష్టం కలిగించింది. అయినా చేసేదేం లేక వూరుకున్నాడు.

ఆ రోజు హోమ్ మినిష్టర్ యిల్లు వదిలి యెక్కడికీ పోలేదు. గిల్టీగా ఫీలై ఎవరికీ ముఖం చూపించలేక

పోయాడు. తోటి మంత్రులు ఫోన్ చేసి సానుభూతి తెలియజేశారు. చాలా ఫోన్లు వచ్చాయి. స్నేహితులు, శ్రేయోభిలాషులు ఫోన్లు చేశారు గాని అయ్యగారు ఇంట్లో లేరని చెప్తున్నాడు. ముఖ్యమయినవాళ్ళతో నే మాట్లాడాడు.

మర్నాడు పేపరువాళ్ళు ఈ విషయంమీద సంపాదకీయాలు రాశారు. తన కొడుకుని అదుపు చేసుకోలేనివాడు రాష్ట్రంలో రౌడీలను, గూండాలను ఎలా కంట్రోల్ చేస్తాడన్నారు. రాను రాను ఆడపడుచులకు రక్షణ కరువైపోతున్నదని వాపోయారు. ప్రతిపక్షం నాయకులు దుమ్మెత్తిపోశారు. వెంటనే రాజీనామా చేయాలని డిమాండ్ చేశారు. అతన్ని మంత్రివర్గం నుంచి తొలగించవలసిందిగా ముఖ్యమంత్రికి విజ్ఞప్తి చేశారు.

సామాన్య కార్యకర్తగా రాజకీయాల్లో ప్రవేశించి మున్సిపాల్టీ కౌన్సిలర్ గా, సమితి ప్రెసిడెంటుగా, కార్పొరేషన్ మెంబర్ గా, ఎమ్మెల్లేగా, చివరకు మంత్రిగా ఒక్కొక్క మెట్టే ఎక్కిన హోమ్ మినిష్టర్ ఇమేజ్ ఒక్కసారిగా మురికాల్వలో పడిపోయినట్లయిపోయింది.

ముఖ్యమంత్రి ఢిల్లీ నుంచి రాజధానికి రాగానే తనను వెంటనే కలుసుకోవలసిందిగా హోమ్ మినిష్టర్ కి కబురు పెట్టాడు.

హోమ్ మినిష్టర్ గుండె దడ దడ లాడింది. ఇక పదవికి నీళ్ళొచ్చినట్లే అనుకున్నాడు. కాబినెట్ రాంక్ నుంచి పడిపోయి మామూలు ఎమ్మెల్లేగా అసెంబ్లీలో కూర్చోవడం కంటే హుస్సేన్ సాగర్ లో దూకి చావడం మేలు అనుకున్నాడు. ఈ న్యూసెన్సంతా కారణమైన కొడుకుమీద కోపం ముంచుకొచ్చింది. అడ్డు ఆపులేకుండా

అడ్డగాడిదలా తిరుగుతున్నాడు పాధవ!

గుండె చిక్కబట్టుకుని ముఖ్యమంత్రి ఇంటికి బయల్దే రాడు. ఆయనకి బి.పి. ఎక్కితే ఎంత మాటబడితే అంత మాట అంటాడు. నలుగురూ వున్నా లెక్క చెయ్యడు. లోగడ చాలాసార్లు పదిమందిలోనే కోప్పడ్డాడు. పదవి కోసం ఓర్చుకుని వుండాల్సొచ్చింది. తిట్టినా కొట్టినా ఆయన ధర్మం చేసిన పదవిగదా! పదవివల్ల మనిషికి ఎంతో పవర్ వస్తుంది. పవర్తోపాటు డబ్బు, కార్లు, మేడలు అన్నీ వస్తాయి. అది లేకపోతే ఎన్నో సౌక ర్యాలు పోతాయి. అయినా అందులో వుండే మజా సామాన్యులకు ఎలా అర్థమౌతుంది?

అదృష్టవశాత్తు ముఖ్యమంత్రి చాంబర్లో ఒక్కడే వున్నారు.

'హమ్మయ్య యిక యెన్ని తిట్టినా ఫర్వాలేదు' నిట్టూ ర్చాడు.

రెండు చేతులు ఎత్తి నమస్కారం చేశాడు. ముఖ్య మంత్రి చూసీ చూడనట్లు వూరుకున్నాడు. ఆయన ఎంతో గంభీరంగా కనిపిస్తున్నాడు. ఆయన్ని ప్రసన్నం చేసు కోవడానికి కాళ్ళమీద పడదామని అనుకున్నాడు గాని వీలుకాలేదు. ఎదురుగా టేబుల్ ఒకటి అడ్డం వుండి పోయింది.

"ఏమిటయ్యా ఈ న్యూసెన్స్ అంతా!" అని కొన్ని దినపత్రికలు విసిరికొట్టాడు ముఖ్యమంత్రి.

హోమ్ మంత్రి తల దించుకున్నాడు. ఏం మాట్లాడితే ఏం కొంప మునుగుతుందోనని లోపల భయం.

అరగంటసేపు వాయించి అలసిపోయాడు ముఖ్య మంత్రి.

"దిస్ ఈజ్ ఫైనల్ వార్నింగ్! ఈసారి ఏదైనా స్కాండల్ బైటపడితే నిన్ను డిస్మిస్ చేసి పడేస్తా!"

హోమ్ మంత్రి హృదయంలో పన్నీటిజల్లు కురిసింది.

'హమ్మయ్య తన పదవి పోలేదు.'

ఆనందంతో యెగిరి గంతులెయ్యాలనుకున్నాడు. వెంటనే విమానం ఎక్కి ఆ ఏడుకొండలవాడిని దర్శించుకుని తల నీలాలు సమర్పించుకోవాలి. స్వామి దయ తన మీద ఇంకా వున్నది.

"ఆ రాస్కెల్ ఏం చేస్తున్నాడు?"

"ఎవరు సార్?"

"అదేనయ్యా! నీ కొడుకు?"

"అమెరికాలో ఇంజనీరింగ్ చదువుతున్నాడు సార్!"

"వెంటనే మాన్పించెయ్!"

"సార్"

"వాడికి డిసిప్లిన్ నేర్పించు ఇక్కడే. ఈవయసు లోనే పెద్ద గూండాగా మారిపోతే ఎలా? అంతా అమెరికా ప్రభావం. అక్కడ వాడికి అదుపు లేదు, అడిగేవాడు లేడు. నువ్వేమో అడిగినంత డబ్బు పంపి స్తుంటావ్! నో....దిస్ ఈజ్ టూ మచ్."

"సార్!"

"సిటీలోనే ఏదొక ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పించు. ఎటువంటి గొడవలు రాకుండా చూసుకుంటే నాలుగు రోజాలు పదవిలో వుంటావు. తెలుసుగదా నీ పదవి ఎంత రెస్పాన్సిబిలిటీ గలదో! ఎలర్టుగా వుండాలి. ఎక్కడ లాకప్ మరణం జరిగినా, ఏ మారుమూల రేప్ కేస్ జరిగినా హోమ్ మంత్రి రాజీనామా చేయాలంటారు

జనం."

హోమ్ మంత్రి ముఖం పెనంమీద మాడిన పెసరట్టులా నల్లబడిపోయింది.

ఎట్లాగొట్లా అమెరికాలో ఇంజనీరింగ్ పూర్తి చేసుకొన్న కోటిరూపాయల కట్నంతో పిల్ల నివ్వడానికి పార్టీలు రెడీగా వున్నారు. ఇక్కడ చదివి, ఇక్కడే వుంటే అంత డిమాండ్ ఎక్కడిది?

హోమ్ మినిష్టర్ కొడుకు ఫ్యూచర్ గురించి లోలోపల విచారిస్తూ వుండగా యిక సెలవు తీసుకోమన్నారు ముఖ్యమంత్రి.

"జాగ్రత్త! వాడి చేతికి డబ్బు అందివ్వకు! డబ్బున్న దగ్గర్నుంచి నలుగురు ఫ్రెండ్స్‌ని పోగుచేసుకుని తాగి తందనాలు ఆడతాడు. బీ కేర్ ఫుల్" అని హెచ్చరించాడు.

హోమ్ మంత్రి వడిలిన ముఖంతో తల వూపాడు.

## 6

షాపింగు ముగించుకుని యింటికి వెళ్ళేసరికి హాల్లో కూర్చొని భవానీదేవితో మాట్లాడుతున్నాడు డి.సి.పి.

"గుడ్ ఈవెనింగ్ సర్!" అంది విజయ.

డి.సి.పి. చిన్నగా నవ్వి గుడ్ ఈవెనింగ్ చెప్పాడు. అతను యింటికి యెందుకు వచ్చాడో గ్రహించింది విజయ.

"చూడమ్మా! నీకు డిపార్టుమెంటులో చాలా ఫ్యూచర్ వుంది. పొలిటికల్ వాళ్ళతో ఎడ్జెస్టు అయిపోవాలి. తప్పదు. పట్టు విడువలేకపోతే నెగ్గుకురాలేం" అన్నాడు విజయతో.

"అవునమ్మాయ్! డిపార్టుమెంటులో అనుభవం వున్నవాడు. ఆయన చెప్పినట్లు విను" అంది భవానీదేవి.

"సారీ సర్! ఈ కేసులో మాత్రం నేను కాంప్రమైజ్ కాను" కొంచెం సీరియస్‌గానే చెప్పింది.

"మనం గట్టిగా నిలబడినంత మాత్రాన జరిగేది ఏమీ లేదు. నిన్ను అక్కడ్నుంచి ట్రాన్స్‌ఫర్ చేస్తారు. వచ్చేవాడు కేసు నీరు కారుస్తాడు. దట్సాల్."

"నాకు తెలుసు సర్, అలాగే జరుగుతుందని. కాని నాకు అదొక తృప్తి. ఎవరి పిచ్చి వారికి ఆనందం అంటారే అలా అన్నమాట...." అని చిన్నగా నవ్వింది విజయ.

డి.సి.పి. కాసేపు మాట్లాడి వెళ్ళిపోయాడు.

"ఎందుకమ్మా నీ కంత పట్టుదల? వాళ్ళంతా పెద్దవాళ్ళు. యేమైనా చెయ్యగల స్థితిలో వుంటారు. వాళ్ళతో అనవసరమైన విరోధం ఎందుకు?"

"అనవసరమైన విరోధం కాదమ్మా! అవసరమే!"

భవానీదేవి ఆశ్చర్యంగా మనవరాలివంక చూసింది.

విజయ నవ్వింది.

"మా నాన్నని చంపినవాడిలో వీడొకడు."

"నిజంగా?" నివ్వెరబోయింది భవానీదేవి.

"అవునమ్మా! వీడి పేరు కాటిల్యరావు. నాన్నతో పాటు ఫోటోలో వున్నాడు చూడు."

విజయ ఫోటోలో కాటిల్యరావుని చూపించింది. సన్నగా, లాల్చీ, పైజామా వేసుకుని వున్నాడు. ఇప్పుడేమో ఏనుగులా బలిసిపోయాడు. అతనే ఇతనని గుర్తుపట్టడం కష్టం.

"ఇప్పుడు అర్థమైందా? నేను ఇంత పట్టుదలగా ఎందుకు వున్నానో?" అంది విజయ.

"కాని .... వాడు హోమ్ మినిష్టర్. మరి నువ్వో....? ఎలా సాధిస్తావు అతన్ని."

"చూస్తుండు...." అంది విజయ కసిగా.

భవానీదేవి దిగులుగా కనిపించింది. ఎప్పుడో జరిగిన గొడవ జోగారావు చెప్పడం, దాన్ని తీసుకుని విజయ పగ తీర్చుకుంటానని ప్రతిజ్ఞ చెయ్యడం ఆమెకు నచ్చలేదు. జరిగిందేదో జరిగిపోయింది. కొడుకు కోడలు వాళ్ళ దుర్మార్గానికి బలైపోయారు. ఇన్నేళ్ళ తర్వాత వాళ్ళ మీద పగ తీర్చుకుని లాభం యేమిటి? అది అంత సులభమా? ఒకడు హోమ్ మినిష్టర్ గా ప్రత్యక్షమయ్యాడు. మిగిలిన ముగ్గురు ఎక్కడెక్కడున్నారో? వాళ్ళని మట్టు పెట్టడం అంత సులభంగా జరిగే పని కాదు. వాళ్ళు రాక్షసులు. ఎంత పనికైనా తెగించి వుంటారు.

ఎందుకొచ్చిన బాధ? హాయిగా నవ్వుతూ, తుళ్ళుతూ వుండాల్సిన వయస్సు. పెళ్ళి చేసుకుని భర్తతో సుఖంగా రోజులు వెళ్ళదీయాల్సిన సమయం. దాని పెళ్ళి చేసి నిశ్చింతగా వుండాలని ఎంతో ఆశపడింది.

కాని విజయ పట్టుదల చూస్తే తన కోరిక తీరేటట్లు కన్పించలేదు.

భవానీదేవి దీర్ఘంగా నిట్టూర్చింది.

విజయకు మెలకువ వచ్చి కళ్ళు తెరిచింది.

ఎదురుగా కిరణ్ నవ్వుతూ కన్పించాడు.

కలా? నిజమా? అనుకుంటూ కళ్ళు నులుముకుని మరీ చూసింది. కిరణ్ స్టిల్ లా కూర్చున్నాడు.

"కిరణ్!" అంది ఆశ్చర్యపోతూ.

"ఎందుకలా వండర్ అయిపోతున్నావ్?"

"ఎప్పుడొచ్చావ్?"

"రాత్రి పన్నెండు దాటింది. నువ్వు నిద్రపోతు న్నావ్. పాపం పగలంతా కష్టపడి డ్యూటీ చేసి వుంటావు. డిస్టర్బ్ చెయ్యడం ఎందుకని వూరుకున్నాను" అన్నాడు కిరణ్.

"రాత్రి సరే! ఇప్పుడు తెల్లవారింది కదా! నేను నిద్రపోతూ వుంటే చూస్తూ కూర్చున్నావా?"

"ఊఁ....నిద్రలో ఎంత అందంగా వున్నావో కదా! స్లీపింగ్ బ్యూటీ చూస్తూ కూర్చున్నాను."

"యూ....సిల్లీ...." అంది విజయ.

"నేను పేపరు చదువుతూ వుంటాను. నువ్వు స్నానం చేసి రా!" అన్నాడు కిరణ్ పేపర్ చేతిలోకి తీసుకుని.

విజయ అరగంటలో తిరిగివచ్చింది. పనిమనిషి ట్రేలో 'టీ' తెచ్చింది. ఇద్దరూ 'టీ' తీసుకున్నారు.

"ఏమిటి విశేషాలు?" ప్రశ్నించాడు కిరణ్.

"ఏముంటాయ్? నువ్వే చెప్పు పేపరు చదివావుగదా! నిన్న రాయెన్ని రేప్ కేసులు జరిగాయి? ఎందరు అత్తలు కిరోసిన్ పోసి కోడళ్ళని తగలబెట్టారు? మంత్రుల కుంభ కోణాలు కొత్తవి ఏమయినా బయట పడ్డాయా? వేటి మీద పన్నులు వేశారు?"

కిరణ్ పకపకా నవ్వాడు.

"అవన్నీ మామూలే."

"పోనీ మీ వూరి కబుర్లు చెప్పు" అంది విజయ.

"మా వూరు ఏమిటి? మీ వూరు కాదా? అక్కడ

మేడలు, తోటలు, పొలాలు అన్నీ మీ కేగా!"

"ఎన్ని వున్నా మేము అక్కడ వుండేది ఏవుంది?"

"లేకపోయినా మీ వూరే! అది సరేగాని ఎలా వుంది వుద్యోగం?"

"బాగుంది కిరణ్! అధికారం నా టోపీలో వుంది. అహంకారం నా చేతి లాఠీలో వుంటుంది. కోపం వచ్చిందంటే ఎంతటివాడ్నయినా లాకప్‌లో పడేసి ఏదోక నేరం నెత్తిన వేసి కుళ్ళబొడవొచ్చు."

"ఈ మధ్య పేపర్లో చూశా నీ పేరు. హోమ్ మినిష్టర్ కొడుకుని లాకప్‌లో వేశావటగా. మన వూళ్ళో వాళ్ళు గొప్పగా చెప్పుకుంటున్నారు నీ గురించి" అన్నాడు కిరణ్.

విజయ నవ్వింది గర్వంగా.

"ఛాన్స్ దొరికితే హోమ్ మినిష్టర్నిగూడా లాకప్‌లో పడేస్తా!"

"ఆ పని చేశావంటే బోలెడంత పబ్లిసిటీ వస్తుంది. జాబ్‌కి రిజైన్ చేసేసి ఒక ప్రాంతీయ పార్టీ పెట్టొచ్చు."

"నీకు అంతా పరిహాసంగా వుందా?"

"లేదు మేడమ్! సిన్సియర్‌గా చెప్తున్నా"

"ఊఁ... ఊరక రారు మహాత్ములని, రమ్మని బ్రతిమాలినా రానివాడివి హఠాత్తుగా వూడిపడ్డావంటే ఏదో కారణం వుండివుంటుంది. చెప్పు ఎందుకు వచ్చావ్?"

"నీ పోలీసు బుద్ధి పోనిచ్చుకున్నావు కాదు."

"పోలీసులకు వేరే బుద్ధి యెక్కడ్నుంచి వస్తుంది? ఒకటే బుద్ధి ఇంటా, బయటా."

"డ్యూటీకి వెళ్లావంటే యెప్పుడొస్తావో యేమో?

ఎందుకయినా మంచిది ఇప్పుడే మనవి చేసుకుంటాను. మా నాన్న కూడా చనిపోయాక మరీ బోర్ గా వుంది. ఆ వూళ్ళో అసలు వుండ బుద్ధి కావడంలేదు. ఇప్పట్లో ఉద్యోగం వచ్చే సూచనలు కూడా కన్పించటంలేదు. తోడు యెవరయినా వుంటే బాగుంటుందని అనిపించింది. ఉద్యోగం వున్న అమ్మాయిని పెళ్ళి చేసుకుందామని అనుకుంటున్నాను" అన్నాడు కిరణ్.

"ఐయామ్ సారీ కిరణ్!" అంది విజయ సీరియస్ గా.

"వాట్?"

"ఇప్పట్లో పెళ్ళి చేసుకునే ఐడియా లేదు నాకు."

కిరణ్ అదిరిపడ్డాడు ఆమె మాటలు విని.

గుండె గుండు దెబ్బలు తిని తూట్లు పడినట్లు విలవిల లాడిపోయాడు.

# 7

"విజయా! నువ్వేనా మాట్లాడేది?"

హతాశుడయ్యాడు కిరణ్.

"యస్! నేనే కిరణ్."

"నీకేమయినా మతిపోయిందా?"

"మతిపోతే యెట్లా మాట్లాడుతున్నాను. ఐయామ్ ఆల్ రైట్!"

"ఏమైంది నీకు?"

విజయ మాట్లాడలేదు.

"చెప్పు విజయా! బీ ఫ్రాంక్. జాబ్ లో చేరాక నీ మనసు మారిపోయిందా?"

విజయ సమాధానం చెప్పలేదు.

"పాత రోజులన్నీ మర్చిపోయావా? చిన్నప్పటినుంచి వున్న అనుబంధం ఒక్కసారిగా ఎక్కడికి పోతుందను

ఉన్నావ్? మనం పెళ్ళిచేసుకోవాలనీ, ఎన్ని కలలు కన్నాం. అవన్నీ గుర్తులేవా?"

కిరణ్ మెల్లిగా అన్నీ గుర్తు చేస్తుంటే విజయ కళ్ళలో నీటి పొర కదిలింది.

"చెప్పు విజయా? పోనీ ఇక్కడ యెవర్నయినా ప్రేమించావా?"

"షటప్ యూ ఫూల్!" అంది విజయ కోపంగా.

కిరణ్ మనసు కుదుటపడింది. అతను భయపడుతున్నాడు. పెళ్ళి వద్దనడానికి కారణం వేరే ఎవర్నయినా ప్రేమించిందేమోనని. 'హమ్మయ్య' అని తేలికగా వూపిరి పీల్చుకున్నాడు.

"కిరణ్! నేను పెళ్ళికి విముఖంగా వుండడానికి నువ్వు వూహిస్తున్న కారణాలు ఏవీ కాదు."

"మరి? వాటీజ్ యువర్ ప్రాబ్లమ్?"

"మేము చివరిసారిగా ఆనందపురం వచ్చినప్పుడు తెలిసింది కిరణ్! మీ నాన్నకు సీరియస్‌గా వుందని నువ్విచ్చిన టెలిగ్రామ్ అందుకుని మద్రాస్ నుంచి వచ్చాము గుర్తుంది కదా! అప్పుడు చెప్పాడు మీ నాన్న, యెప్పట్నుంచో ఇరవై సంవత్సరాలుగా కడుపులో దాచుకున్న నిజాన్ని."

విజయ జరిగిందంతా చెప్పింది.

"అప్పటివరకూ నా జీవిత సర్వస్వం నువ్వే కిరణ్. జాబ్ చెయ్యాలని కూడా నేను ఏనాడు అనుకోలేదు. అటువంటి అవసరం కూడా నాకు లేదు. కాని ఆ తర్వాత నా మనస్సు పగతో నిండిపోయింది. ప్రతీకారంతో కడుపు రగులుతోంది. నా తల్లిదండ్రుల్ని రాక్షసంగా చంపిన దుర్మార్గుల్ని నాశనం చెయ్యందే నా మనస్సు శాంతించ

దని తెలుసుకున్నాను."

"విజయా! "

"నన్ను చెప్పనీ కిరణ్! వాళ్ళని చంపినందువల్ల, నాశనం చేసినందువల్ల ఇప్పుడు లాభం ఏమిటి అని నువ్వు ప్రశ్నించవచ్చు. నేను ఖచ్చితంగా చెప్పలేనుగూడా! దుర్మార్గానికి బలైపోయినవాళ్ళు పగ, ప్రతీకారం ఎందుకు తీర్చుకుంటారో నాకు తెలిసేదికాదు. ఇప్పుడు స్పష్టంగా అర్ధమైంది. పగ తీర్చుకోవడంవల్ల మనస్సు శాంతిస్తుంది. రగిలే గుండె చల్లారుతుంది. తృప్తి కలుగుతుంది జీవితంలో ఏదో సాధించామని. దట్సాల్ కిరణ్. ఈ విషయంలో వెనక్కి మళ్ళే ప్రశ్నలేదు. నో సెకండ్ థాట్."

విజయముఖం ఎర్రబడింది. ఆవేశంతో ఆమె పెదవులు అదురుతున్నాయి.

"ఐయామ్ సారీ కిరణ్. నిన్ను ఎంతో బాధపెట్టివుంటాను. ఈ గొడవలో నిన్ను ఇరికించడం నాకు ఇష్టంలేదు. ఇప్పటి పరిస్థితిలో నలుగురు ఘరానా పెద్దమనుషుల్ని నాశనం చెయ్యడం సామాన్యమైన విషయంకాదు. చాలా రిస్క్‌తో కూడింది. ఏ క్షణంలోనైనా నేను ఓడిపోవచ్చు. ప్రాణాలు పోగొట్టుకోవచ్చు. నాకు తెలుసు అవన్నీ. అయినా సరే నేను పట్టువిడవను." దృఢ నిశ్చయంతో చెప్పింది విజయ.

"విజయా! నా గురించి నువ్వు ఎంత నీచంగా ఆలోచిస్తున్నావో నాకు అర్ధమైంది. ఇంతేనా నువ్వు తెలుసుకుంది. నువ్వు ప్రాణాలు పణంగా పెట్టి పోరాడుతూవుంటే నేను చేతగానివాడిలా చేతులు ముడుచుకుని కూర్చుంటానా? చావో! బతుకో నీతోపాటే నేనూ!"

విజయ అబ్బురంగా చూసింది అతన్ని.

"కిరణ్ ...." అంది ఆనందంగా.

మరుక్షణం అతని చేతుల్లో వాలిపోయింది. ఆమెను హృదయానికి హత్తుకుని తృప్తిగా కళ్ళు మూసుకున్నాడు కిరణ్.

"నువ్వు రెస్టు తీసుకో కిరణ్. డ్యూటీకెళ్ళొస్తాను." అంది విజయ.

కిరణ్ తలవూపాడు.

విజయ వెళ్ళేసరికి స్టేషన్‌లో హడావుడిగావుంది. రేప్ కేసు గొడవో, మర్డర్ కేసో అనుకుంటూ వెస్పాకి స్టాండ్ వేసి లోపలకు వెళ్ళింది.

సి.ఐ. ఎదురుగా డి.సి.పి. కూర్చున్నాడు.

ఇద్దరికీ గుడ్‌మార్నింగ్ చెప్పింది. కాని వాళ్ళు వర్రీడ్‌గా కనిపిస్తున్నారు. ముఖాలు మాడ్చుకుని సీరియస్‌గా వున్నారు.

"మీరొకసారి డి.జి.పి. దొరని కలుసుకోండి." అన్నాడు. సి.ఐ.

విజయ ఏమీ మాట్లాడలేదు.

వెస్పా తీసుకుని డి.జి.పి. దగ్గరికి బయల్దేరింది.

"నువ్వేనా విజయ అంటే?" గంభీరంగా అన్నాడు డి.జి.పి.

"యస్ సర్." అంది విజయ అంతకంటే గంభీరంగా.

"నీకు వుద్యోగం చెయ్యాలని లేదా?"

"చెయ్యాలని వుండబట్టే చేస్తున్నాను సర్."

"అప్టాల్ నువ్వొక ప్రొబేషనర్‌వి. హోమ్‌మినిస్టర్ కొడుకుని లాకప్‌లో పెడతావా? వాడూయూమీన్."

"నా డ్యూటీ చేశాను సర్."

"నా త్తిన టోపీ పెట్టుకోగానే కిరీటం పెట్టినట్లు తెచ్చి పోతున్నావా? ఖాకీ బట్టలు కట్టుకోగానే నీదే రాజ్యం అనుకుంటున్నావా? మైండ్ యువర్ బిజినెస్." డి.జి.పి. కంఠం హెచ్చించాడు.

విజయ సీరియస్‌గా చూసింది.

"నన్ను ఎందుకు పిలిపించారో చెప్పండి."

"విత్ డ్రా యువర్ కేస్. కోపరేట్ విత్ ఆఫీషియల్స్ అండ్ డిపార్ట్‌మెంట్."

"ఐయామ్ సారీ సర్."

"యూ ! ఆఫ్ట్రాల్ ప్రొబేషనర్. ఐ విల్ సస్పెండ్ యూ! ఐ విల్ డిస్మిస్....యూ!" డి జి.పి. కేకలు పెట్టాడు.

"యూ కెన్ డూ వాటెవర్ యూ లైక్." చెప్పింది విజయ.

డి.జి.పి. కేకలు పెడుతూనే వున్నాడు.

విజయ అక్కడ్నుంచి చరచర వెళ్ళిపోయింది. ఆమె ప్రవర్తన పుండుమీద కారం చల్లినట్లయింది డి.జి.పి.కి. పళ్ళు కొరికాడు.

'ఇరవై నాలుగు గంటల్లోగా ఆ యస్పై ఎవత్తో, దాంతో కేస్ విత్ డ్రా చేయించండి.' అని హోమ్ మినిష్టర్ ఇచ్చిన వార్నింగ్ చెవుల్లో మ్రోగుతోంది డి.జి.పికి.

ఈమె ఎవరోగాని మొండి ఘటంలా వుంది. ఇప్పుడేం చెయ్యాలి? హోమ్ మినిష్టర్‌కి ఏం సమాధానం చెప్పాలి?

'వాట్ టు హెల్' అని తిట్టుకున్నాడు.

సిటీ పోలీస్ కమీషనర్‌కి ఫోన్ చేశాడు.

"సర్."

"ఆ లేడీ యస్సై నా మాట గూడా వినేదయ్యా! ఇటువంటి మొండి ఘటాన్ని నా సర్వీస్‌లో చూళ్ళేదు. రాడికల్ లేడీ."

"సర్, నాకు అనుమానంగావుంది. పొలిటికల్ బాకింగ్ ఏదైనా వుందేమోనని! లేకపోతే అప్త్రాల్ ఒక యస్సై మనల్ని ఎదిరించడమా? డిపార్ట్‌మెంట్ హిస్టరీలోనే లేదు."

"వాటెవ్వర్ పి ఈజ్? డిస్మిస్ ఇమ్మీడియట్లీ."

"కొంప మునుగుతుంది సర్. ప్రతిపక్షాల వాళ్ళు గొడవ చేస్తారు. అది కోర్టు కెళ్ళిందంటే స్టే ఆర్డర్ ఇస్తారు."

"దెన్, వాడూయూ సే?"

"ట్రాన్స్‌ఫర్ చేద్దాం సర్."

"డూ ఇట్." అని రిసీవర్ విసిరికొట్టాడు డి.జి.పి. డ్యూటీ దిగి వెళ్ళబోతుంటే ఒక కవరు అందించి సంతకం చేయించుకున్నాడు సి.ఐ.

"వాటీజ్ దిస్ సర్?" ప్రశ్నించింది విజయ.

"యువర్ ట్రాన్స్‌ఫర్." నవ్వాడు సి.ఐ. పొగరణిగిందా అన్నట్లు హేళనగా చూశాడు.

విజయ జేబులోనుంచి కాగితం తీసి సి.ఐ.కి అందించింది.

"వాటీజ్ దిస్?" అన్నాడు సి.ఐ.

"నా రాజీనామా!" అంది విజయ.

సి.ఐ. షాక్ తిన్నాడు.

## 8

కిరణ్ ఆ ఫొటోని తదేకంగా చూస్తున్నాడు. కనీసం పాతికేళ్ళు దాటి వుంటుంది ఫొటో తీసి. తెలుపునుంచి మట్టిరంగుకి మారింది. ఫోటోలోవున్న వాళ్ళ పేర్లు

ఇంగ్లీషులో ప్రింట్ చేసి వున్నాయి. ఎడమనుంచి కుడికి. కౌటిల్యరావు. రాజేంద్రకుమార్, బ్రహ్మాజీ పేరుకి బ్రాకెట్లో జమీందార్, ఆనందపురం అని వుంది. బ్రహ్మాజీ ప్రక్కన ఆయన భార్య సుజనాదేవి కూర్చుంది. ఆమె తర్వాత అవతారకృష్ణ, శేష్స.

స్కూటర్ శబ్దం వినిపించింది.

టైమ్ చూశాడు. పన్నెండు దాటింది. రెండుగంటల తర్వాత వస్తాననీ, లంచ్ చేసెయ్యమని, తనకోసం ఎదురు చూడొద్దని చెప్పి వెళ్ళింది విజయ. అప్పుడే వచ్చేసిందే! తను వున్నాడని వచ్చిందేమో అనుకున్నాడు.

విజయ ముఖం సీరియస్‌గావుంది. ఏదో జరిగిందని అనుకున్నాడు.

"కిరణ్! నేను రిజైన్ చేశాను." చెప్పింది విజయ.

"వాట్ హేపెండ్ విజయా?"

విజయ జరిగినదంతా చెప్పింది.

"డోంట్ వర్రీ, మనం చెయ్యబోయే పనికి నీ జాబ్ ఒక రకంగా ఆటంకమే." అన్నాడు కిరణ్.

విజయ ముఖంలో రిలీఫ్ కన్పించింది. యూనీఫాం తీసేసి చీర కట్టుకుని వచ్చింది.

"కౌటిల్యరావు పోతే మిగిలిన ముగ్గురు ఎక్కడున్నారో తెలుసా?" అడిగాడు కిరణ్.

విజయ తల అడ్డంగా వూపింది.

"ముందు ఎవరు ఎక్కడున్నారో తెలుసుకోవాలి. దటీజ్ ఇంపార్టెంట్." అన్నాడు కిరణ్.

"ముగ్గురు సంగతి తర్వాత. కౌటిల్యరావు ఇక్కడే వున్నాడుగదా! వాడి సంగతి చూద్దాం" అంది విజయ.

"యూ ఆర్ రాంగ్ విజయా!"

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరే టట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందచేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 80/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

**పూర్తి వివరాలకై 'అపన' చూడండి!**

"వాటీజ్ రాంగ్?"

"కాటిల్యరావు సామాన్యుడు కాదు. హోమ్ మినిస్టర్ ఆ సంగతి మర్చిపోతున్నావు."

"కావచ్చు."

"అతన్ని ఎలా చంపుతావో? నీ ప్లాన్ చెప్పు?" ప్రశ్నించాడు కిరణ్.

"ఎలా చంపాలో, ఎక్కడ చంపాలో ఇంకా నిర్ణయించుకోలేదు. అతను ఎప్పుడూ టూర్స్‌లో వుంటాడు. ఏదైనా ఒక చిన్న వూళ్ళో ఆగినప్పుడు రివాల్వర్‌తో కాల్చి చంపుతాను."

"అదంత తేలిక కాదు. మినిష్టర్ ప్రోగ్రామ్స్‌లో ఎప్పుడూ సెక్యూరిటీ గార్డ్స్ వుంటారు. హోమ్ మినిష్టర్‌కి ఇంకా ఎక్కువగా వుంటుంది ప్రొటెక్షన్. సరే గార్డ్స్ ఎలర్టుగా లేని సమయం చూసి కాల్చుతానంటావ్. అప్పుడు నీ గురి తప్పవచ్చు. వాడి అదృష్టంకల్ల బులెట్ తగిలినా ప్రాణాం పోకపోవచ్చు. ఆ తర్వాత నువ్వెలా తప్పించుకుంటావ్? గార్డ్స్ ఎదురుకాల్పులు జరుపుతారు. నిన్ను వెంటాడుతారు. దొరికిపోతే?"

"ఐ విల్ టేక్ ది రిస్క్."

"చంపడంలో రిస్క్ ఎప్పుడూ వుంటుంది. మొదటి వాడిని చంపడంలోనే పట్టుబడిపోతే ఇంకా ముగ్గురు మిగిలిపోతారు" అన్నాడు కిరణ్.

"యస్!" అంది విజయ సాలోచనగా.

"ఆవేశానికి లొంగిపోకుండా ఆలోచించు. శత్రువు బలవంతుడయినప్పుడు బుద్ధిబలంతోనే జయించాలి."

"యూ ఆర్ రైట్ కిరణ్! నాకిప్పుడు చాలా ధైర్యంగా వుంది. ఒంటరిగా అయితే ఆవేశంలో

ముందూ వెనుకా చూసుకోకుండా దూకేదాన్ని. ఒక్కడి తోనే పట్టుబడిపోయేదాన్నేమో! ముగ్గురు మిగిలి పోయే వాళ్ళు. అప్పుడు నాకు యే తృప్తీ మిగిలేది కాదు" అంది విజయ.

కిరణ్ చిన్నగా నవ్వాడు.

"ప్రస్తుతానికి హోమ్ మినిష్టర్ని వదిలేద్దాం."

తల వూపింది విజయ.

"మిగిలిన ముగ్గురు ఎక్కడున్నారో కావాలి మనకి. నీకేమయినా ఐడియా వుందా?"

"నో...." అంది విజయ.

"మీ నాయనమ్మకి కొన్ని వివరాలు తెలిసివుంటాయి. అడుగుదాం" అన్నాడు కిరణ్.

విజయ, భవానీదేవిని పిలిచింది.

"ఆంటీ! నేను అడిగేవాటికి జాగ్రత్తగా జవాబు చెప్పాలి" అన్నాడు కిరణ్.

భవానీదేవి ఆ ఫోటో వైపు చూసి "అయితే నీకూ చెప్పిందన్నమాట ఆ గొడవ" అంది.

"నేను విజయకి తోడుగా వుంటాను ఆంటీ! విజయ, నేనూ ఒకటిగా పెరిగాం. జీవితాంతం కలిసి వుండాలను కున్నాం. అలాగే వుంటాం."

"కిరణ్! నీకూ పిచ్చిపట్టినట్లుంది. దానికి బుద్ధి చెప్పాల్సింది పోయి వత్తాసు పలుకుతున్నావా?" సీరియస్‌గా అంది భవానీదేవి.

"సారీ ఆంటీ! విజయ మొండితనం నీకు తెలుసు."

"ఇది నాటకం కాదు, సినిమా కాదు. జీవితం. పగ తీర్చుకోవడం, చంపడం అంత సులభం కాదు. వాళ్ళు

ఇప్పుడు యెక్కడున్నారో గూడా తెలియదు."

"అమ్మా! నాకు మాటి మాటికి నీతులు చెప్పొద్దు" సీరియస్‌గా అంది విజయ.

"ఆంటీ ప్లీజ్ ....ఇక ఆ విషయంమీద డిస్కషన్స్ వద్దు. మాటకి మాట తెగులు. జరిగేది జరక్క మానదు" అన్నాడు కిరణ్.

అక్కడ వాతావరణం గంభీరంగా మారిపోయింది.

ఈ వ్యవహారం భవానీదేవికి ఏ మాత్రం యిష్టం లేదని కిరణ్‌కి అర్థమైంది.

"ఆంటీ! ఈ ఫోటోలో వున్న వాళ్ళ గురించి మీకు తెలిసింది ఏమైనా వుంటే చెప్పండి."

"అందులో అవతార కృష్ణ గురించే నాకు తెలుసు. వాడు అబ్బాయి క్లాస్‌మేట్. ఆ ముగ్గురు ఎవరో నాకు తెలీదు. చదువు పూర్తయ్యాక అవతారకృష్ణ హైదరాబాద్‌లో స్టీలు వ్యాపారం చేస్తున్నాడని చెప్పాడు. వాళ్ళు ముగ్గురూ అతని స్నేహితులు" చెప్పింది భవానీదేవి."

"అవతారకృష్ణ అడ్రస్ తెలుసా?"

ఆమె తల అడ్డంగా వూపింది.

కిరణ్ కొన్ని నిముషాలు ఆలోచనలో పడిపోయాడు. అవతారకృష్ణ ఎక్కడున్నాడో తెలుసుకుంటే, మిగిలిన ఇద్దరు బయటపడిపోతారు. కాని ఎలా?

అతని బుర్రలో ఫ్లాష్ వెలిగింది.

టెలిఫోన్ డైరెక్టరీ తీశాడు.

నెంబర్స్ డైల్ చేశాడు.

(ఇంకా వుంది)

